శ్రీమతే రామానుజాయ నమః



# అపూర్వ రామాయణమ్

( కాంచీ ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారి
ద్రావిడ కృతికి ఆంధ్రానువాదం )


అనువక్త :

డా॥ ఉ.వే. శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు



దశమ ఉభయవేదాంత పండిత సభలు

6, 7, 8, నవంబర్ - 2015

# అపూర్వ రామాయణమ్

**( కాంచీ ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారి ద్రావిడ కృతికి ఆంధ్రానువాదం )**

**అనువక్త : డా॥ ఉ.వే. శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు**


ప్రథమముద్రణ : సెప్టెంబర్, 2014

ద్వితీయముద్రణ : నవంబర్, 2015

ప్రతులు : 500

వెల : అమూల్యము

ఆవిష్కరణ సందర్భం : దశమ ఉభయవేదాంత పండితసభలు

వేదిక : శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చిన్నజీయర్‌స్వామివారి ఆశ్రమం, భద్రాచలం

ముఖచిత్రం : శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీరామచంద్రస్వామివారు,భద్రాచలం, శ్రీకాంచీమహావిద్వాన్ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారు

**ఈగ్రంథం శ్రీమతి పి. అలమేలుమంగ,**
**శ్రీమాన్ పి.గోపాలకృష్ణమూర్తి పుణ్యదంపతులు భద్రాచలంలో**
**నిర్వహించే దశమ ఉభయవేదాంతసభల చిహ్నికగా**
**ముద్రింపబడుతున్నది.**

**ప్రతులకు**

**1. ఈ. ఏ. శింగరాచార్యులు**
18-3-58/7, కె.టి. రోడ్
తిరుపతి-517 507
మొబైల్ : 09885003420

డి.టి.పి. : యస్.చంద్రశేఖర్, తిరుపతి

ప్రింటింగ్ : సి.ఎన్.ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి




# స్మృతి చిహ్నిక

**"పడికొణ్డ కీర్త్తి ఇరామాయణ మెన్నుమ్ పత్తివెళ్ళమ్"** అని అంటూ అముదనార్ ఇరామానుశనూ*ఱ్ఱ*న్దాదిలో శ్రీరామాయణమనే భక్తిసాగరం యొక్క కీర్తి భూమిలో అంతటా వ్యాపించినదని అన్నారు. ఈ సూక్తిని వ్యాఖ్యానించే శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ **"పడికొణ్డ"** అనేది ఉపలక్షణం. భూమిలోనే కాక, సత్యలోకంలో కూడా బ్రహ్మ, అటువంటివాడైన నారదభగవానుడు భూలోకానికి వచ్చి వాల్మీకిని ఉద్దేశించి నియమించి, ఉపదేశించినందువల్ల దీని కీర్తి ఊర్ధ్వలోకాలలో కూడా ప్రసిద్ధమై ఉన్నది - అని అన్నారు.

ఇటువంటి శ్రీరామాయణం సత్యలోకంలో శతకోటి శ్లోక ప్రవిస్తరమై ఉన్నదనికదా సూక్తి. **"శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసంకులమ్, కాండగ్రాహ మహామీనం వందే రామాయణార్ణవమ్"** (శ్లోకాలనే నీటితో నిండినది, సర్గలనే కెరటాలను కల్గినది, కాండలనే మొసళ్ళను, పెద్ద చేపలను కల్గినదైన రామాయణమనే సాగరాన్ని నమస్కరిస్తున్నాను) అనే తనియన్ (ముక్తక) శ్లోకం కూడా శ్రీరామాయణం మహాసముద్రమని తెల్పుతున్నది. ఇటువంటి గంభీరమైన శ్రీరామాయణ రత్నాకరంలో గుప్తంగా ఉండే అనర్ఘాలైన, మనోహరాలైన అర్థరత్నాలను మనపూర్వాచార్యులు ఎంతమందో తమ కృతులలో వ్యక్తం చేశారు. వారు మనకు ఉదారంగా అందించిన శ్రీరామాయణార్థ రత్నాలు అసంఖ్యాకాలు. పెరియవాచ్చాన్ పిళ్ళై ప్రత్యేకంగా శ్రీరామాయణంలోని కొన్ని శ్లోకాలకు అద్భుత వ్యాఖ్యానాన్ని తనిశ్లోకి అనే పేరుతో అనుగ్రహించారుకూడా.

ఇరవైవ శతాబ్దిలో దక్షిణభారతంలోనే కాక, ఆసేతుహిమాచలం వైదిక సిద్ధాంతాన్ని, విశేషించి, భగవద్రామానుజదర్శనాన్ని, ఆ*ళ్వా*ర్ల దివ్యప్రబంధాల మధురిమను అందఱికి సంస్కృతాంధ్ర హింది తమిళ భాషలలో సహస్రాధిక గ్రంథ ప్రచురణ ద్వారా, పలుచోట్ల అసంఖ్యాకాలైన, శ్రోతలను ఉఱ్ఱూతలూగించే మధురోప న్యాసాల ద్వారా ఉదారంగా అందించిన **కీర్తిమూర్తులు, పద్మవిభూషణ, కాంచీ ఉభయవేదాంత మహావిద్వాన్, ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారి** లేఖిని నుండి వెలువడిన కృతిరత్నమే **అపూర్వ రామాయణమ్**. ఇందులో, శ్రీరామాయణం ఆరంభంలో వాల్మీకి మహర్షిచే ప్రస్తావింపబడ్డ పదహాఱు ప్రశ్నల వివరణమే శ్రీరామాయణంలో కన్పించే వృత్తాంతాలు అన్నీ - అనే విషయాన్ని సప్రమాణంగా,

సోదాహరణంగా స్వామివారు చాలా సులభమైన శైలిలో నిరూపించారు. ఇది ఒక పరిశోధనాత్మకమైన సత్కృతి. ఇది ద్రావిడభాషలో రచింపబడి, చాలాకాలం క్రితమే **"రామాయణ రసప్రవాహ"** మనే పేర చాలా భాగం ఆంధ్రీకరింపబడింది. అయితే, ఆ అనువాద గ్రంథాలిపుడు అందుబాటులో లేవు. ఈ కాలంలోని జిజ్ఞాసువులకు ఈ అద్భుత కృతిని పరిచయం చేయాలనే ఉద్దేశ్యంతో పూర్తిగా అనువదింపబడి ఇంతకుముందే దాసుని పితృవ్య కుమారుడు, **పరమపదవాసి, శ్రీమాన్ శ్రీనివాసరంగాచార్యుల** ప్రథమాబ్దిక కార్యక్రమాలలో అతని స్మృతిచిహ్నంగా సహృదయ పాఠకులకు సమర్పింపబడింది. ఇప్పుడు భద్రాచలంలో శ్రీరామచంద్రస్వామి సన్నిధి సమీపంలోని శ్రీచిన్నజీయర్ స్వామివారి ఆశ్రమంలో నవంబరు 6వ తేది నుండి 8వ తేది వరకు మిత్రవర్యులు, సత్సంప్రదాయ ప్రచారణ బద్ధదీక్షులైన శ్రీమాన్ పి.గోపాలకృష్ణమూర్తి గారి నిర్వహించే **దశమ (10వ) ఉభయవేదాన్తపండితసభల సందర్భంలో** తిరిగి ముద్రింపబడుతున్నది. ఈ సత్కార్యాన్ని చేసే **శ్రీమతి అలమేలు మంగ, శ్రీమాన్ పి.గోపాలకృష్ణమూర్తి దంపతులకు** సమస్తసన్మంగళాలు. శ్రీరామ చంద్రస్వామి అనుగ్రహం వల్ల నిరంతరం కలగాలని మనసారా కోరుకుంటున్నాను. శ్రీగోపాలకృష్ణమూర్తిగారి ఈసత్సంప్రదాయ సేవ నిరంతరం కొనసాగాలని ఆశిస్తున్నాను. శ్రీరామచంద్రుని కల్యాణగుణవైభవాన్ని మధురంగా అందించే ఈ గ్రంథం ఆస్తిక జనులందఱికి ఆనందాన్ని కల్గించ గలదని భావిస్తున్నాను.

అనువాదంలో, ముద్రణలో చోటు చేసికొన్న దోషాలను సహృదయ పాఠకులు మన్నిస్తారని భావిస్తాను. అనుబంధంగా **"శ్రీరామాయణంలో నవవిధ సంబంధాలు"** అనే వ్యాసంకూడా ముద్రింపబడినది. డి.టి.పి. చేసి సహకరించిన శ్రీచంద్రశేఖర్‌గారికి, అందంగా ముద్రించిన శ్రీహర్షవర్ధన్ గారికి కృతజ్ఞతలు. ఈ గ్రంథాన్ని తిరిగి ముద్రించడానికి తమ అనుమతిని ఉదారంగా అందించిన శ్రీమాన్ రాజహంసమ్ స్వామివారికి, వారి కుటుంబసభ్యులకు నమఃపూర్వక కృతజ్ఞతలు.

**అపూర్వపూర్వం మధురం గభీరం విగాహ్య రామాయణ మేతదార్యాః ।**
**అణ్ణంగరార్యైః లిఖితం రసజ్ఞాః ముదం లభేరన్నితి మేఽత్ర యత్నః ॥**

ఇట్లు నివేదించు,
భాగవతదాసుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**

తిరుపతి,
28.8.2014



# అపూర్వ రామాయణమ్

## విషయసూచిక

శ్రీమతే రామానుజాయ నమః



# అపూర్వ రామాయణమ్

**(కాంచీ మహావిద్వాన్, ఉ.వే. శ్రీమాన్ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్య స్వామివారి ద్రావిడ కృతికి అంధ్రానువాదం)**

## అవతారిక

**"అపూర్వరామాయణ"** మనే పేరును పెట్టి ఈ గ్రంథాన్ని రచించడం ఆరంభిస్తున్నాను. శ్రీమద్వాల్మీకిరామాయణారంభం ఏవిధంగా జరిగింది? అని అంటే, దేవలోకంనుండి నారదమహర్షి చతుర్ముఖుని ఆజ్ఞానుసారం వాల్మీకిమహర్షి ఆశ్రమానికి వచ్చి చేరాడు. ఆ నారదమునికి వాల్మీకి మహర్షి నమస్కరించి, అంజలి చేసి సేవించి **"కో ను అస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్** (ఇపుడు ఈ లోకంలో గుణవంతుడెవడు? వీర్యవంతుడెవడు?) అని ఆరంభించి, పదహారు కల్యాణ గుణాలను ప్రస్తావించి, ఈ కల్యాణ గుణాలు ఉండే ఏమానవుడైనా ఇపుడు ఉంటే, అతనినిగూర్చి నాకు తెలియజేయాలి. మీవద్ద దీనిని అడిగి తెలిసికోవాలని నాకు చాలా కుతూహలంగా ఉన్నది" - అని విన్నపించాడు.

ఆపైన, ఆ నారదముని చాలా ఆనందించి, సమాధానం పల్కడానికి ఆరంభించాడు, "ఇక్ష్వాకువంశంలో పుట్టి శ్రీరాముడనే పేరును కలవాడొకడున్నాడు. అతడు లోకం అంతా నిండిన కీర్తిని కలవాడు. అంతు లేని శక్తిని కలవాడు. అతని కల్యాణగుణాలను నేను పూర్తిగా ప్రస్తావించి పలుకలేను. అతడే కోసలప్రభువు కుమార్తె అయిన కౌసల్యాదేవియొక్క గర్భంలో పుట్టిన దశరథపుత్రుడు. సముద్రం వలె మహాగంభీరుడు. మహావీరుడు. చాలా సహనాన్ని కలవాడు. సత్యశీలుడు" అని పల్కి, వెంటనే అతని చరిత్రను సంగ్రహంగా ఉపదేశించి ముగించాడు.

తరువాత, తనవద్దకు సాక్షాత్తు వచ్చిన చతుర్ముఖుని అనుగ్రహాన్ని పొంది, వాల్మీకిముని శ్రీరామాయణాన్ని రచించి ముగించాడు - అనేది శ్రీరామాయణం ఆరంభంలో తెలుపబడింది. నారదమునిని ఉద్దేశించి వాల్మీకి మహర్షి ప్రశ్నించిన



కల్యాణగుణాలు లెక్కలో పదహారుగా ఉన్నందున, "శ్రీరామచంద్రుడు" అని చంద్రుడుగా చెప్పబడే వాని పదహారు కళలా ఇవి! అనే రీతిలో ఆ కల్యాణగుణా లున్నాయి. ఆ పదహారు కల్యాణగుణాలను వివరించి, వాటిలోనే శ్రీరామకథ అంతా అంతర్భవించి ఉన్నదని నిరూపణం చేయడంకోసమే ఇపుడు నేను ముందుకు వస్తున్నాను. ప్రయత్నిస్తున్నాను.

వాల్మీకిముని నారదమునివద్ద ఉపదేశాన్ని ఆలకించిన తరువాతనే శ్రీరాముని గూర్చి తెలిసికొన్నాడు - అని చెప్పడానికి లేదు. అంతకుముందే, అతడు శ్రీరామ మంత్రాన్ని నిరంతరం అనుసంధానం చేసేవాడని, చతుర్ముఖుడు తనలోకంలో శతకోటి ప్రవిస్తరమైన ఒక రామాయణాన్ని రచించి, నారదుడు మొదలైన మును లకు దానిని ప్రవచించి, రామభక్తుడైన వాల్మీకిముని ద్వారా ఈ భూలోకంలో కూడా శ్రీరామకథను సంగ్రహంగా ప్రవర్తింపజేయడంకోసం వాల్మీకిముని ఆశ్రమానికి నారదుని పంపించాడు - అనే చరిత్ర కన్పిస్తున్నందున, నారదమునిని చూచి వాల్మీకి ముని ప్రశ్నించిన కల్యాణగుణాలు శ్రీరాముని చరిత్రలో వ్యక్తమయే గుణాలే తప్ప వేఱుకావు - అనే విషయాన్ని బాగా అర్థం చేసికోవాలి.

భగవానుడు శ్రీరాముడుగా ఈలోకంలో అవతరించడం తన కల్యాణ గుణాలను ఆవిష్కరించడం కోసమే - అని, రావణ సంహారాదులు వ్యాజమాత్రమైన ప్రయోజనాలు మాత్రమే అనే తెలియదగిన తత్త్వమున్నది. దీనిని శ్రీపరాశరభట్టర్ అనే మహనీయులు **"గుణపరీవాహాత్మనాం జన్మనామ్"** (కల్యాణగుణాల పరీవాహరూపాలైన అవతారాల యొక్క) అనే సూక్తిద్వారా వ్యక్తం చేశారు.

అందువల్ల, శ్రీరామాయణం ఆరంభంలో వాల్మీకిముని ప్రస్తావించిన పదహారు గుణాలలో శ్రీరాముని చరిత్ర పూర్తిగా అణగి ఉన్నదని, ఆ చరిత్రను వాల్మీకి ముని రాత్రి పగలు మననం చేసినందువల్లనే ఆ కల్యాణగుణాలు వారి హృదయంలో ఊటి నిలచి ఉన్నవి - అని, వాటినే ఆ ముని నోరార వర్ణించాడని తెలుస్తున్నది. ఆ పదహారు కల్యాణగుణాలను వరుసగా వివరించి, ఒక్కొక్క గుణంలో అనుసంధింప బడవలసిన చరిత్రలను విస్తృతంగా వివరించగోరుతున్నాను. వాల్మీకిముని చేసిన ప్రశ్నలలో శ్రీరామాయణ కథలను అంతర్భవింపజేసి అనుభవించే ఈ అనుభవం అపూర్వం కనుక, **"అపూర్వ రామాయణమ్"** అని దీనికి పేరు పెట్టబడింది.

## 1. కో గుణవాన్ (శీలగుణం కలవాడెవడు?)

**"గుణవాన్"** - అంటే - శీలగుణం కలవాడనియే అర్థం. **"కః గుణవాన్"** అనేది మొదటి ప్రశ్న. "గొప్ప గుణాలను కలవాడెవడు?" అని సామాన్యంగా ప్రశ్నించినట్లు కొందఱు దీనికి అర్థాన్ని గ్రహిస్తారు. కాని, ఆవిధంగా కాదు. విశేషించి ఒక్కొక్క గుణాన్ని ప్రస్తావించి పలికే ఈ ప్రకరణంలో **"గుణవాన్"** అనే ఈ పదం నిర్దిష్టమైన ఒక గుణాన్ని తెల్పుతున్నదే తప్ప, "సామాన్యంగా కల్యాణగుణాలను కలవాడు ఎవడు?"- అని ప్రశ్నించినట్లు కాదు.

భగవద్యామునులు తమ స్తోత్రరత్నంలో భగవానుని పలు కల్యాణ గుణాలను కూర్చి ఒక శ్లోకాన్ని అనుగ్రహించారు. అది **"వశీ వదాన్యః"** అనేది పద్దెనిమిదవ శ్లోకం. అందులో, **"వశీ వదాన్యః"** అనే రెండు గుణాలను పల్కిన తరువాత **"గుణవాన్"** అని పల్కి, అనంతరం **"ఋజుః, శుచిః"** అని ఆరంభించి పలు గుణాలను ప్రస్తావించి, చివరలో **"సమస్తకల్యాణగుణామృతోదధిః"** అని చెప్పబడింది. ఇందువల్ల, ఈ స్తోత్రరత్న శ్లోకంలో మూడవ పదమైన **"గుణవాన్"** అనే దానికి (ఆ పదానికి ముందు నిర్దేశింప బడిన విశేషగుణాలవలె) ఒక విశేషగుణమే అర్థమని గ్రహించాలి-అనేది స్ఫుటపడు తున్నది.

### శీలగుణంయొక్క స్వరూప - స్వభావాలు

ఆ విశిష్టగుణం ఏది? అంటే, సౌశీల్యగుణమేనని పూర్వాచార్యులు భావించారు. తన గొప్పతనాన్ని గమనించకుండా, తనకంటే తక్కువవారితో ఏ సంకోచం లేకుండా కలసి వర్తించే శీలగుణానికే సౌశీల్యమని మాఱుపేరు. అన్ని గుణాలకంటే ఈ గుణం చాలా గొప్పది. కనుక దీనికి గుణమనే విశిష్టనామం పెట్టబడింది. ప్రస్తుతం, వాల్మీకి మునిప్రశ్నలోని **"కో గుణవాన్"** అనే దానికి "శీలగుణాన్ని కలవాడెవడు? - అంటే - తన గొప్పదనాన్ని కొంచెంకూడా లెక్కించకుండా తక్కువవారితో కలసి వర్తించే వాడెవడు?" అని ప్రశ్నించినట్లు తాత్పర్యం. ఈ కల్యాణగుణానికి తగినట్లుగా మనం అనుసంధించదగిన శ్రీరామచరిత్రలను ఇక ఆలకించండి.

### అవతారమే శీలగుణాన్ని వివరిస్తున్నది

శ్రీమన్నారాయణమూర్తి శ్రీరాముడుగా ఈ లోకంలో అవతరించాడు - అనే ఈ విషయమే శీలగుణంయొక్క పరీవాహమై ఉన్నది. కూరత్తాళ్వాన్ అతిమానుష స్తవంలోని పదవ శ్లోకాన్ని **"శీలః క ఏష తవ హంత!"** (ఆహా! నీ ఈ శీలగుణం ఎటువంటిదో గదా!) అని ఆరంభిస్తున్నారు. "ఆహా! ఇదేమి శీలగుణం! దీనినిగూర్చి ప్రస్తావించి వర్ణించడానికి ఎవరికి సాధ్యం!" అని అంటున్నారు. ఆ శీలగుణాన్ని కూరేశులు దేనిని పురస్కరించుకొని నిరూపిస్తున్నారు? అని అంటే, **"అత్రావతీర్య నను లోచనగోచరో౽భూః"** (ఈలోకంలో అవతరించి అందరి నేత్రాలకు కన్పించేవాడవు అయినావు) అనేదే ఆ శ్లోకంలోని ప్రాణ స్థానీయమైన సూక్తి. **"కట్కిలీ"** (**"కణ్‌కు-ఇలీ"** మాంసచక్షువులకు గోచరం కానివాడు) అయిన భగవానుడు ఆసురస్వభావాన్ని కల్గినవారి నడుమకు వచ్చి, వారి నేత్రేంద్రియానికి లక్ష్యభూతుడై అవతరించాడు- అనే విషయాన్ని భావించినపుడు", ఆహా! ఇదేమి శీలగుణం! గుణాలను గ్రహించి ఆనందించకుండా, (**"ఎదిరమ్బు కోప్పదుమ్"** - ఎదురు బాణాన్ని సంధించడం) ఎదురు తిరగడం కూడా చేసే అసురులు, రాక్షసులవంటి మానవుల మధ్యకు వచ్చి జన్మించే రీతిలోని ఈ శీలగుణాన్నిగూర్చి ఏమని పల్కడం?" అని కూరేశులు ద్రవిస్తున్నారు, **"పిఱన్ద వాఱుమ్"** (భగవానుడు జనించిన ప్రకారం ఏమి ఆశ్చర్యం!) అని పల్కి ఆళ్వార్లు ఆఱునెలల కాలం మోహాన్ని పొంది పడి ఉండే రీతిలోని భగవదవతారా లనుగూర్చి భావించగానే "ఇదేమి శీలగుణం! ఆహా!" అని మనస్సులో ద్రవించడం తప్ప వేఱేమీ చేయగల్గినది లేదుకదా!

### అవతారశబ్దవివరణం

అవతారమనే సంస్కృతశబ్దానికి - ఉన్నతస్థానంనుండి కిందకు దిగడం - అని అర్థం. పరమపదమనే ఉన్నతస్థానంనుండి ఈలోకమనే అధమస్థానానికి వచ్చాడు - అనేదే అవతారశబ్దార్థమని భావించవద్దు. గొప్పవైన తన స్థితులను విడచి పెట్టి, తక్కువ స్థితులను స్వీకరించడం కూడా అవతారమనబడుతుంది. ఎవరి కంటికీ గోచరం కానివాడు, అన్ని చోట్ల ఉండేవాడు, అన్ని కాలాలలోను ఉండేవాడు, అన్ని వస్తువులుగా ఉండేవాడు - అనే ఇవి భగవానుని ఉన్నత స్థితులు. ఇటువంటి ఉన్నతస్థితులను పూర్తిగా విడచి పెట్టి, వీటికి విరుద్ధాలైన తక్కువ స్థితులను స్వీకరించికదా భగవానుడు జన్మిస్తాడు.

### ఉన్నతస్థితులు - అధమస్థితులు

ఎవరికంటికీ కన్పించకుండా ఉండేవాడు - రాక్షసులు, అసురులవంటివారి కంటికి కూడా కన్పించాడు; అన్నిచోట్ల ఉండేవాడు "ఇపుడు అయోధ్యలో ఉన్నాడు,

ఇపుడు కిష్కింధలో ఉన్నాడు, ఇపుడు సముద్రతీరంలో ఉన్నాడు" అనే రీతిలో ఏదో ఒకచోట ఉండేటప్పుడు ఇంకొక చోట లేడు - అని తలచే రీతిలో అయినాడు. అన్ని కాలాలలో ఉండేవాడు "ఒక నిర్దిష్టమైన కాలంలోనే శ్రీరాముడై ఉండి, వేఱొకకాలంలో లేడు" అని తలచేటట్లుగా వెళ్ళిపోయాడు. **"నీరాయ్ నిలనాయ్ త్తీయాయ్ కాలాయ్ నెడు వానాయ్ శీరార్ శుడర్‌కళ్ ఇరణ్డాయ్ శివనాయ్ అయనానాయ్"** (నీరై, భూమియై, అగ్నియై, వాయువై, విశాలమైన ఆకాశమై, గొప్ప జ్యోతిస్సులైన సూర్యచంద్రులై, శివుడై, బ్రహ్మయై), **"తాయాయ్ తన్దైయాయ్ మక్కళాయ్ మ*ఱ్ఱు*మాయ్ ము*ఱ్ఱు*మాయ్"** (తల్లియై, తండ్రియై, సంతానమై, ఇంకా అన్ని విధాలైన బంధువై) అని ఆ*ళ్వా*ర్లు అనుసంధించేటట్లుగా అన్నివస్తువులుగా ఉండే భగవంతుడు శ్రీరాముడనే ఒక పేరుకు మాత్రం అర్థంగా ఉన్నాడు - అని ఈరీతిలోని ఉన్నతమైన స్థితులను వీడి తక్కువ స్థితులను స్వీకరించి, ఇక్కడకు వచ్చి జన్మించిన రీతి ఏమి ఆశ్చర్యం! - అని అభినివేశాన్ని పొందే రీతిలో శీలగుణం చేస్తుంది.

## గుహప్పెరుమాళ్‌పట్ల శ్రీరాముడు చూపిన శీలగుణం

శ్రీరాముని శీలగుణానికి విశేషంగా లక్ష్యభూతులైనవారు గుహప్పెరుమాళ్ వంటివారు. తిరుమంగై ఆ*ళ్వా*ర్లు తమ పెరియ తిరుమొ*ళి* ప్రబంధంలో **"ఏ*ళై* ఏదలన్ కీ*ళ్*మకన్ ఎన్నాదు ఇరఙ్గి"** (5-8-1) అని ఆరంభించి పల్కిన పాశురంలో ఈ శీల గుణం చాలా అద్భుతంగా అనుభవింపబడినది. గంగలో పడవను నడపుకొనే వాడు, వేయి పడవలకు అధిపతి, గంగాతీరంలోని శృంగిబేరపురానికి ప్రభువు అయిన ఒక కోయరాజు గుహుడు. ఇతని వద్దకు శ్రీరాముడు సీతాదేవితో, లక్ష్మణునితో పాటు వెళ్ళినపుడు, ఇతడు ఆ శ్రీరాముని రూపసౌందర్యంలో అభినివేశాన్ని పొంది, ఎంతో ప్రేమతో తిరుమేనిని సంరక్షించిన రీతి చాలా ఆశ్చర్యకరమైనది (దీనిని శ్రీవచన భూషణమ్‌లోని 247వ చూర్ణికలో దర్శించవచ్చు).

శ్రీరాముడు శృంగిబేర పురానికి వేంచేసి, లక్ష్మణుడు చక్కగా నిర్మించిన పర్ణశాలలో సీతాదేవితో పాటు శయనించాడు. అపుడు ఆ దివ్యదంపతుల చేరికకు ఏమి అపాయం కల్గుతుందో! ఏమో! అనే అతిశంకను పొందిన లక్ష్మణుడు వీపుపై ధరించిన అంబులపొదితో, చేతిలో ధరించిన వింటితో "నడిచే కోటవలె" రక్షిస్తూ తిరుగుతూ ఉన్నాడు. దీనిని గమనించిన గుహుడు "ఒక తమ్ముడు (భరతుడు) తల్లిద్వారా శ్రీరాముని నగరంనుండి అడవులకు తరిమివేశాడు. ఈ తమ్ముడు



(లక్ష్మణుడు) ఈ ఏకాంతంలో ఇంకా ఏమి చేయాలని చూస్తున్నాడో!" అని ఆ లక్ష్మణుని పట్ల కూడా అతిశంకను (సందేహాన్ని) పొంది, "ఇతడు ఆవిధంగా ఏదయినా హానిని చేస్తే ఇతనినే వధిస్తాను" అని భావించి, తాను కూడా వింటిని, బాణాలను ధరించి నిలచినట్లు శ్రీరామాయణంలో కన్పిస్తుంది. అయితే, ఇది ఏ సమయంలో జరిగిందో, ఆ సమయంలో వాల్మీకిచే చెప్పబడలేదు. తరువాత, భరతుడు చిత్రకూటానికి బయలు దేరి వచ్చేటపుడు, ఆ భరతునితో గుహుడు దీనికి చెప్పినట్లుగా కథలో కన్పిస్తుంది (అయోధ్యా కాండ-87వ సర్గలోని 23, 24వ శ్లోకాలను గమనించాలి).

తొట్టిలో నిద్రించే పరువంనుండి శ్రీరామునిపై అంతు లేని ప్రేమను కల్గి ఉండే లక్ష్మణునిపై అతిశంక (సందేహం) కల్గి, శ్రీరాముని పట్ల అభినివేశాన్ని చూపిన ఈ గుహుని ప్రేమ ఎంతటిదని చెప్పగలం! ఇతనికి ఇంతటి ప్రేమ ఉండడంవల్లనే శ్రీరాముడు ఇతనిపట్ల మొట్టమొదటగా తన శీలగుణాన్ని ప్రదర్శించాడు.

## తిరుమంగై ఆళ్వార్ పాశురంలోని రసానుభవం

గుహుని నైచ్యాన్ని ఉదాహరించే తిరుమంగై ఆళ్వార్ **"ఏ*ళై* ఏదలన్ కీ*ళ్*మకన్ ఎన్నాదు ఇరఙ్గి"** (దరిద్రుడు, జ్ఞానహీనుడు, నీచజాతివాడు - అని భావించకుండా దయచూపి) అని అన్నారు. శ్రీరాముడు గుహుని విడచిపెట్టడానికి ఈ నిమ్న గుణాలలో ఏదో ఒకటి అయినా సరిపోతూ ఉండగా, అవి చాలా ఉన్నాయి - అని గమనించినా, కరుణాసింధువైన శ్రీరాముడు గుహుని పట్ల ఉపేక్షను కల్గి ఉండ కుండా ఉండడమే కాక, తన పరిమితిని దాటి అతనితో ఒకటిగా కలసి వర్తించాడు.

క్షత్రియజాతిలో, సూర్యకులంలో, ఇక్ష్వాకు వంశంలో అవతరించినవాడు, చక్రవర్తికుమారుడు, సకలైశ్వర్యసంపన్నుడు, మహాబుద్ధిశాలి, శత్రువులపట్ల కూడా కరుణను చూపేవాడైన శ్రీరాముడు గుహుని చూచినపుడు "ఇతడు నిమ్న జాతికి చెందిన బోయవాడని, అందువల్ల వివేకం లేనివాడని, ఆ జాతికి సహజమైన క్రూరత్వంచేత అన్ని ప్రాణులతో శత్రుత్వాన్ని పొందేవాడని - అనే అధమ స్వభావాలను చూచి, అతనిపట్ల అనాదరాన్ని పొందవలసి ఉన్నా, తన గొప్పగుణాలను, అతని చిన్నతనాన్ని (తక్కువ స్థితిని) చూడకుండా, అతనితో కలసి వర్తించిన తీరు ఎటువంటిది? అంటే, **"శీరణిన్ద తో*ళ*మై"** (పెరియా*ళ్వా*ర్ తిరు-3-10-3) (గొప్పదైన స్నేహం) అనే రీతిలో కదా కలసి వర్తించాడు.

గుహుని అంతులేని ప్రేమను చూచి శ్రీరాముడు అతనితో స్నేహాన్ని చేశాడా! లేక, శ్రీరామునితో **"శీరణిన్ద తోழమై"**ను (గొప్పదైన స్నేహాన్ని) పొందడంకోసం గుహుడు ప్రేమను చూపాడా? అనే ప్రశ్న వచ్చినపుడు, భగవానుని మనస్సుకు మాత్రమే సమాధానం తెలియడానికి సాధ్యమైన ఈ విషయంలో మనం ఏమని సమాధానం పలుకగలం!

## శ్రీరామాయణశ్లోకవిశేషానుభవం

శ్రీరాముడు గంగాతీరాన్ని చేరగానే, ఆ విషయాన్నిగూర్చి వినిన గుహుడు తన సహచరులతో కలసి శ్రీరామునివద్దకు వచ్చి చేరాడు - అనే విషయాన్ని తెలిపే వాల్మీకిముని **"తత్ర రాజా గుహో నామ రామస్యాత్మసమః సఖా"** (అక్కడ శ్రీరాముని ప్రాణస్నేహితుడు, గుహుడనే పేరు గల రాజు) అని అన్నాడు. గుహుని గూర్చి మొట్టమొదటగా ప్రస్తావాన్ని చేసేటపుడే **"రామస్యాత్మసమః సఖా"** అని అనడం చాలా విస్మయాన్ని కల్గిస్తుంది. శ్రీరాముని ప్రాణస్నేహితుడైన గుహుడు శ్రీరాముని రాకనుగూర్చి విని వచ్చాడని పల్కినందున ఈ ఇద్దఱికి స్నేహం అంతకు ముందే ఉన్నట్లుగా స్ఫురిస్తున్నది. గుహుడు వచ్చేటపుడే శ్రీరాముని ఆలింగనం చేసి కొన్నట్లుగా **"తం మార్త స్సంపరిష్వజ్య గుహో రాఘవ మబ్రవీత్"** (ఆర్తిని కలవాడై శ్రీరాముడు ఆ గుహుని కౌగలించుకొని ఈవిధంగా అన్నాడు) అనే తరువాత శ్లోకంలో చెప్పబడింది.

## ఆళ్వార్లయొక్క, కంబమహాకవియొక్క విశేషానుభవం

అయితే, ఆళ్వార్ల శ్రీసూక్తులవల్ల, కంబునిసూక్తివల్ల ఈ స్నేహం అపుడే ఏర్పడినదని చక్కగా తెలుస్తున్నది. **"కుకనోడుమ్ కజ్గై తన్నిల్ శీరణిన్ద తోழమై కొణ్డుమ్ ఓరడైయాళమ్"** (గంగానదీ తీరంలో గుహునితో గొప్ప స్నేహాన్ని చేయడం ఒక గుర్తు) అనేది పెరియాழ్వార్ల సూక్తి. కంబరామాయణం **"విబీడణన్ అడైక్కలప్పడలమ్"**లో

**కుకనొడుమ్ ఐవరానేయ్ మున్బు, పిన్ కున్రు శూழ்వాన్**
**మకనొడుమ్ అఱువరానేమ్ ఎమ్ముழை యన్బిన్ వన్ద**
**అకనమర్ కాదలైయై నిన్నొడుమ్ ఎழுవరానేమ్**
**పుకలరుమ్ కానమ్ తన్దు పుదల్వరాల్ పొలిన్దానున్దై**



అనే పాశురం చాలా రసవంతమైనది. దీని భావం ఏమంటే - "నగరంలో నల్గురం మేము దశరథచక్రవర్తికుమారులుగా జన్మించాము. నల్గురు పుత్రులు జన్మించినా తృప్తిని పొందని దశరథుడు ఇంకా పుత్రులను కొంతమందిని పొందాలని కోరి మమ్ములను అడవికి పంపించాడు. "మీరు ఇద్దఱు అడవికి పోయి ఇంకా కొంతమంది తమ్ములను సంపాదించుకొని రండి" అనే మమ్ములను అడవికి పంపించాడు. అడవికి వచ్చిన మేము పలువురు తమ్ములను సంపాదించుకొన్నాము. గంగాతీరంలో గుహుని తమ్మునిగా పొందాము. పంపాతీరంలో సుగ్రీవుని తమ్మునిగా పొందాము. విభీషణా! సముద్రతీరంలో నిన్ను తమ్మునిగా పొందాము. ఈవిధంగా మాతండ్రి ఏడుగురు పుత్రులను పొందినవాడయ్యాడు - అనేది ఈ పాశురభావం.

ఈ విధంగా పలికే శ్రీరాముడు గుహునిపట్ల, సుగ్రీవుని పట్ల, విభీషణుని పట్ల తోడబుట్టిన తమ్ముల విషయంలో వలె తాను ప్రేమను (సోదర్యాన్ని) కల్గి ఉన్నాడు- అనే విషయాన్నికదా వ్యక్తం చేసినవాడయ్యాడు. ఇంతే కాక, ఇక్కడ, దశరథుని **"ఎన్దై"** అని అనకుండా **"ఉన్దై"** (మన తండ్రి) అని అనడంకూడా నిశితంగా గమనించ దగినది. విభీషణుని తండ్రిగానే కదా దశరథుడు చెప్పబడ్డాడు. ఇందువల్ల శ్రీరాముడు విభీషణునివంటివారితో ఒకే నీరుగా (శీలగుణంతో) కలసి వర్తించిన మహాగుణాన్ని ఉద్దేశించియే **"కః గుణవాన్"** అని ప్రశ్నింపబడింది.

## హీనులతో కలసి వర్తించడంలో తోచే సందేహం

ఇక్కడ ఒక సందేహం కలిగే అవకాశం ఉన్నది. అది ఏమంటే - **"హీన ప్రేక్ష్యం హీనసఖ్యం హీనగేహనిషేవణమ్"** (హీనులచే చూడబడడం, హీనులతో స్నేహం చేయడం, హీనుల ఇంటిలో నివసించడం) అనేవి ఉపపాతకాలలో లెక్కింప బడ్డాయి. నీచులకు సేవచేయడం, నీచులతో స్నేహం చేయడం, నీచుల గృహాలలో నివసించడం - అనే ఇవి పాతకాలుగా చెప్పబడుతూ ఉండగా, వీటిని శ్రీరాముడు చేయవచ్చునా? వీటిని చేయడం అతిశయాన్ని కల్గిస్తుందా? - అనేది ఆ సందేహం.

## ఈ శంకకు సమాధానం

సమాధానం వినండి. మనవంటివారు వీటిని చేస్తే అవద్యకరం. గొప్పవారిలో సాటి లేనివాడైన శ్రీరాముడు వీటిని చేస్తే అతని గౌరవం మఱింత అతిశయించి ప్రకాశిస్తుంది. పాండవదూత, పార్థసారధి - వంటి తిరునామాలు అన్నీ భగవానుని గొప్పతనాన్ని కొండపై పెట్టిన దీపంవలె స్పష్టంగా ప్రకాశింపజేస్తాయి కదా!

## దయాశతకశ్రీసూక్తిప్రకారం శబరినికూడా గ్రహించడం

శ్రీరాముని శీలగుణాన్ని ప్రకాశింపజేసే సందర్భాలు అనేకం ఉన్నా, గుహుడు, సుగ్రీవుడు, విభీషణుడు - అనే మూడు ఉదాహరణలను ప్రస్తావించి పల్కడమే చాలు. శ్రీవేదాంతదేశికులు దయాశతకంలో **"నిషాదానాం నేతా కపికులపతిః కాఽపి శబరీ"** (కిరాతరాజు గుహుడు, వానర ప్రభువు సుగ్రీవుడు, గొప్పదైన శబరి) అనే శ్లోకంలో శబరిని ఉదాహరించినందున ఆ ఉదాహరణాన్నికూడా గ్రహిద్దాం. వాల్మీకి రామాయణంలో ఎక్కడా శ్రీరాముడు శబరితో కలసి వర్తించిన వృత్తాంత విశేషించి స్పష్టంగా తెలుపబడకపోయినా, ఇతర రామాయణాలలోఉండే దానిని బట్టిగాని, వాల్మీకి రామాయణాన్ని నిశితంగా గమనించిగాని మన ఆచార్యులు అనుగ్రహించిన విశేషం గ్రహించదగినది.

## శబరివద్ద శ్రీరాముడు ఆరగించిన (భుజించిన) రీతి

శ్రీవచనభూషణంలో **"పెరుమాళ్ శ్రీశబరికైయాలే అముదు శెయ్దరుళినార్"** (శ్రీరాముడు శబరిచేతిద్వారా భుజించాడు) అనేచోట వ్యాఖ్యానంలో శ్రీమణవాళ మహామునులు **"రఘుకులపతిలకరాయ్, ఆచారప్రధానరాన పెరుమాళ్ - శబర్యా పూజిత స్సమ్యక్ రామో దశరథాత్మజః" ఎన్నుమ్బడి వేడువిచ్చియాయ్‌వైత్తే గురు శుశ్రూషైయిలే పఌత్తు, జ్ఞానాధికైయాయ్, తన్ నావుక్కు ఇనిదాయిరున్ద ఫలమూలాది కళెల్లామ్ "ఇజ్గుత్తైక్కు" - ఎన్ను సంచయిత్తుక్కొణ్డు వరవు పార్‌త్తిరున్ద శబరి, తన ఆదరానుగుణమాక త్తన్ కైయాలే అముదుశెయ్యప్పణ్ణి, అతిసంతుష్టరాయ్ అముదు శెయ్దార్"** - (రఘుకులతిలకుడై, ఆచారప్రధానుడైన శ్రీరాముడు **"శబర్యా పూజిత స్సమ్యక్"** - (శబరిచే చక్కగా పూజింపబడ్డాడు) - అనే రీతిలో కోయవనిత అయినా గురుశుశ్రూషలో పరిణతిని పొంది, జ్ఞానాధికయై, తన జిహ్వాకు తీయగా ఉండే ఫలమూలాదు లను అన్నిటిని శ్రీరాముని కోసమని సేకరించి, శ్రీరాముని రాకకోసం వేచి ఉండే శబరి, తన ఆదరానుగుణంగా తన చేతిలో భుజింపజేయగా, మిక్కిలి సంతోషించిన వాడై భుజించాడు) అని పల్కిన శ్రీసూక్తులు విశేషించి అనుసంధించ దగినవి. ఇందులో, "తన జిహ్వాకు తీయగా ఉండే" అనే మాటను శ్రీవరవరమునులు మూలప్రమాణం ఏమీలేకుండానే పలికారు. వాల్మీకి (సంక్షేపరామాయణంలో) **"శబర్యా పూజిత స్సమ్యక్"** (శబరిచేత చక్కగా పూజింపబడ్డాడు) అనే ప్రయోగంలోని అంతరార్థమే ఇది - అనికూడా గ్రహించవచ్చు.



## గుహునకు, శబరికిమధ్య గల తారతమ్యాన్ని వివరించడం

ఆమెతో శ్రీరాముడు ఇంతగా కలసి వర్తించడానికి గల కారణమేమి? అని కొందఱు విమర్శించవచ్చు కూడా. సమాధానాన్ని వినండి. గుహునితో శ్రీరాముడు కలసి మెలిగేటపుడు, అతడు కొన్ని భోజ్యపదార్థాలను తీసుకొని వచ్చి ఇచ్చి, "వీటిని స్వీకరించి నన్ను అనుగ్రహించాలి"- అని వేడాడు. అపుడు దానికి శ్రీరాముడు పల్కిన సమాధానం ఏమంటే - **"యత్త్విదం భవతా కించిత్ ప్రీత్యా సముపకల్పితమ్, సర్వం తదనుజానామి న హి వర్తే ప్రతిగ్రహే... అశ్వానాం ఖాదనేనాహ మర్థీ వన్యేన కేనచిత్, ఏతావదత్ర భవతా భవిష్యామి సుపూజితః"** (నీవు ప్రీతితో నాకోసం ఏర్పాటు చేసిన దీనిని అంతటినీ నేను అంగీకరిస్తున్నాను. కాని, నేను దీనిని స్వీకరించలేను.... నా గుఱ్ఱాలు చాలా అలసిపోయినందున వాటి శ్రమను తీర్చాలని నేను కోరుతున్నాను. ఇంతమాత్రం నీవు చేసినట్లయితే నేను నీచేత చక్కగా పూజించినవాడను కాగలను) అనేది. నేను వనవాసంలో ఎవరి దగ్గరనుండి దేనినీ స్వీకరించరాదనే వ్రతాన్ని కల్గి ఉన్నాను. ఇదిగో, నా రథాశ్వాలు బాగా ఆకలితో, దాహంతో ఉన్నాయి. వాటికి కావలసిన ఆహారాన్ని, నీటిని మాత్రమే నేను కోరుతున్నాను" అని పల్కి, గుహుడు సమర్పించిన భోజ్య పదార్థాలను శ్రీరాముడు స్వీకరించకుండా ఉండిపోయాడు.

ఇక్కడ శ్రీరాముడు **"న హి వర్తే ప్రతిగ్రహే"** (నేను దానం పరిగ్రహించకూడదనే నిశ్చయంతో ఉన్నాను) అనేది తప్పక చెప్పవలసిన మాటయేనా? గుహుడు మధుపర్కం మొదలైన కొన్ని ఆహారపదార్థాలను తీసికొని వచ్చాడే తప్ప, తన ధాన్య వస్త్రాదులలో దేనినీ దానం చేయాలని రాలేదు కదా! వాటిని ఇవ్వాలని వస్తే, అపుడు "నేను ప్రతిగ్రహాన్ని చేయడం లేదు" అని పల్కి తిరస్కరించడంలో న్యాయమున్నది. తేనె మొదలైన వన్యభోజ్య పదార్థాలనుమాత్రమే ఇవ్వాలని వచ్చినపుడు **"న హి వర్తే ప్రతిగ్రహే"** అని పల్కి తిరస్కరించడం అవశ్యం పరిశీలించదగనది కదా! గుహునితో ఈవిధంగా పల్కిన శ్రీరాముడే శబరివద్ద తిరస్కరించకుండా **"అర్చితోఽహం త్వయా భక్త్యా"** (నీచేత భక్తితో అర్చింపబడ్డాను) అని సంతోషించి పల్కి ఆమె సమర్పణలను పరిగ్రహించాడు.

## శబరినిగూర్చి శ్రీమణవాళమహామునుల శ్రీసూక్తి

శబరివిషయంలో పూర్వం ప్రస్తావింపబడిన శ్రీవచనభూషణవ్యాఖ్యాన శ్రీసూక్తిలో **"గురుశుశ్రూషైయిల్ పఌత్త జ్ఞానాధికైయాయ్"** (గురుశుశ్రూషలో పరిణతిని పొందిన

జ్ఞానాధికురాలై) అని మర్మంగా పల్కిన సూక్తిని ఇక్కడ వివరిస్తున్నాను. శబరి వద్ద చాలా గొప్పదైన ధర్మం ఒకటి - గురుశుశ్రూష అనేది - ఉన్నది. దీనిని గూర్చి కబంధుడు శ్రీరామునకు తెలిపాడు. **"శ్రమణీ శబరీ నామ కాకుత్థ్స! చిరజీవినీ, త్వాం తు ధర్మే స్థితా నిత్యమ్"** (శ్రీరామా! సన్న్యాసిని, చిరంజీవిని, నిత్యం ధర్మాన్ని అనుష్ఠించేది అయిన శబరి నిన్ను దర్శించగోరుతున్నది) అని, **"శ్రమణీం ధర్మ నిపుణా మభిగచ్ఛ"** (ధర్మాచరణలో నైపుణ్యాన్ని కల, సన్న్యాసిని అయిన శబరి వద్దకు వెళ్ళు) అని గల కబంధుని మాటలలో ధర్మశబ్దంతో తెలుపబడినది గురుశుశ్రూషయే. శ్రీరాముడు కూడా శబరిని చూడగానే క్షేమాన్నిగూర్చి ప్రశ్నించేటపుడు **"కచ్చి త్తే గురు శుశ్రూషా సఫలా చారుభాషిణి!"** (చక్కగా భాషించే శబరీ! నీ గురుశుశ్రూష సఫల మైనదా?) అని ప్రశ్నించాడు. ఆమెకూడా తాను చేసిన గురుశుశ్రూషను గూర్చి ఆనందంగా బదులు పల్కింది. "ఇక్కడ నా సేవలను స్వీకరించిన ఆచార్యులు పరమపదాన్ని అలంకరించారు. వారి శ్రీచరణసాన్నిధ్యాన్ని చేరడానికి నాకు నీవు అనుమతిని ఇవ్వాలి" అని ప్రార్థించింది. ఇటువంటి ధర్మం గుహునివద్ద లేనందు వల్లనే అతడిచ్చిన భోజ్యాలను శ్రీరాముడు స్వీకరించలేదు - అని మహాచార్యులంటారు.

## ఇక్కడ కొందఱి ఉక్తులు పొసగవు

ఈ సందర్భంలో కొందఱు ఇంకొక రీతిలో పల్కుతారు. ఏవిధంగా? అంటే, గుహుడు శబరివలె ఫలాలను ఇచ్చి ఉంటే శ్రీరాముడు వానిని స్వీకరించేవాడు. అతడు ఫలాలను సమర్పించ లేదు - అనేది ఆ ప్రకరణంలో స్పష్టంగా తెలుస్తున్నది. అందువల్ల గుహునివద్దనుండి స్వీకరించకపోవడానికి, శబరి దగ్గరనుండి స్వీకరించ డానికి ఇక్కడ చెప్పిన కారణం యుక్తం కాదు - అని కొందఱు అనవచ్చు. వారు **"న హి వర్తే ప్రతిగ్రహే"** అని అంటూ గుహునితో శ్రీరాముడు పల్కినదానిని బాగా గమనించాలి. "ఓ గుహా! నీవు కాయలనుగాని, పండ్లను గాని తీసికొని వచ్చి ఇస్తే వాటిని నేను స్వీకరిస్తాను" అని శ్రీరాముడు పలికి ఉండాలి కదా! ఆవిధంగానే పలుక కుండా, తాను ఊరికి తిరిగి వెళ్ళి చేరేవరకు ఎవరి దగ్గర ఏమీ గ్రహించరాదు- అని ఒక వ్రతాన్ని పరిగ్రహించినట్లుగా పల్కడం ఏదో ఆరోపణం చేసి చెప్పినట్లుగా కదా కన్పిస్తుంది. భోజ్యాలను (ఆహారాన్ని) స్వీకరించే రీతిలోని అధికార (యోగ్యతా) పూర్తి గుహుని వద్ద లేదు - అనేదే శ్రీరాముని అభిప్రాయం. ఆ భావాన్ని శ్రీరాముడు ఈరీతిలో నేరుగా తెలుపకుండా, **"న హి వర్తే ప్రతిగ్రహే"** అని గూడంగా పల్కి తిరస్కరించడం, శ్రీరాముని మహాగుణానికి లోటుగా కదా కాగలదు - అని కొందఱు



శంకించవచ్చు. దీనికి సమాధానం ఏమంటే - **"న హి వర్తే ప్రతిగ్రహే"** అని పల్కిన దానికి ఎవరి వద్దనుండి దేనినీ నేను గ్రహించను - అనే అర్థం రావాలనే నియమం లేదు. "నీ దగ్గరనుండి గ్రహించడంలో నాకు ఉద్దేశ్యం లేదు" అని అంటున్నట్లుగా కూడా అర్థం కావచ్చు. ఆవిధంగా ఉద్దేశ్యం లేకపోవడానికి కారణం ఇతః పూర్వం నేను వివరించినదే.

## శ్రీవేదాంతదేశికుల శ్రీసూక్తి ఒకటి

శ్రీవేదాంత దేశికులు సంకల్పసూర్యోదయమనే రూపకంలోని ఆఱవ అంకంలో వివేకుడు ఆనందంతో పాడేటట్లుగా ఒక అద్భుతమైన శ్లోకాన్ని రచించారు. **"భగవతి భరద్వాజే భుక్తిః తథా శబరీగృహే"** అనేది ఆ శ్లోకంలోని మొదటి పాదంలో "శ్రీరాముడు పరమ పవిత్రమైన భరద్వాజాశ్రమంలో ఆరగించాడు - అని వింటున్నట్లే, శబరి తిరుమాళిగలో కూడా భుజించాడు - అనే మాటను వింటున్నాము. ఇదేమి సౌలభ్యం!" అని అభినివేశాన్ని పొంది పల్కడం గమనార్హం.

## "ఈనాటికి వెళ్ళి రేపు రా" అని పలికే శీలగుణానుభవం

**"కః గుణవాన్"** అనే వాల్మీకి ముని ప్రశ్నకు తగినట్లుగా శ్రీరాముని వేఱొక గుణవిశేషంకూడా అనుసంధేయం.

కూరేశులు అతిమానుషస్తవంలో **"కోஉయం గుణః కతరకోటిగతః కియాన్ వా కస్య స్తుతేః పద మహో బత! కస్య భూమిః"** (ఇది ఏమి గుణం! ఏ ప్రకారంలోకి చేరుతుంది? ఎంతటిది! ఎవరికి స్తుతించడానికి విషయమవుతుంది? ఆహా! స్తుతిం ఎవరికి సాధ్యం) అనే గుణవిశేషాన్ని ప్రస్తావించి పల్కి మోహాన్ని పొందారు. అంటే- **"యత్రా దృశాగస మరిం రఘువీర! వీక్ష్య! విశ్రమ్యతా మితి ముమోచిథ ముగ్ధ మాజౌ"** - యుద్ధభూమిలో **"చచాల చాపం చ ముమోచ వీరః"** (వీరుడైన రావణుడు చలించిపోయాడు, వింటినికూడా జారవిడిచాడు) అనే రీతిలో స్థైర్యాన్ని కోల్పోయిన రావణుని చూచి "ఈనాటికి పోయి రేపు రా" అని రాముడు పల్కి అనుమతించిన వృత్తాంతం ఒకటి ఉన్నది కదా! ఇది చాలా గొప్ప గుణంగా గౌరవింపబడుతున్నది. **"తిరువినై ప్పిరిత్త కొడుమైయిఱ్కొడువిశై యరక్కన్"** (సీతాదేవిని విడదీసిన, క్రూరత్వంలో మించినవాడైన రాక్షసుడు రావణుడు) అని అంటూ తిరుమఙ్గై ఆழ్వార్లు పల్కిన రీతిలో, **"పఞ్జిన శివక్కు మెన్ కాల్ పావైయై ప్పిరిత్త పావి వఞ్జన్"** (ప్రత్తిని తొక్కినా కందిపోయే సుకుమారమైన పాదాలను కల సీతాదేవిని విడదీసిన పాపి,

వంచకుడు) అని కంబమహాకవి పల్కిన రీతిలో, మహాపరాధులలో అగ్రేసరుడైన అతనిని ఒకక్షణంలో వధించివేయవలసి ఉండగా, ఆ విధంగా చేయకుండా **"గచ్ఛాను జానామి రణార్దితస్త్వం ప్రవిశ్య రాత్రించరరాజ! లంకామ్, ఆశ్వాస్య నిర్యాహి"** (రావణా! వెళ్ళు. నిన్ను అనుమతిస్తున్నాను. మళ్ళీ నీవు మళ్ళీ యుద్ధాన్ని చేయగోరితే, ఓ రాక్షసరాజా! లంకలోకి పోయి విశ్రాంతి తీసికొని మళ్ళీ రేపు రా) అని అనుమతినిచ్చి పోనిచ్చిన మహాప్రభావాన్ని కల ఈ గుణం శ్రీరామాయణంలో కన్పించే సకలగుణాల లోను చాలా గొప్పది కనుక, దానినికూడా ఇక్కడ గ్రహించవచ్చు.

## శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుభవించిన శీలగుణం

అష్టాదశ రహస్యాలలోని తనిద్వయమనే రహస్యంలో **"కో న్వస్మిన్ సాంప్రతం... గుణవాన్"** అనేదానిని ప్రస్తావించి వివరించేటపుడు **"శీలవత్తై యాకిఱదు - అభిషేక విఘ్నమ్ పిఱన్దదెన్ఱు వెఱుప్పిన్ఱియే" "వనవాసో మహోదయః" ఎన్ఱు కాడేఱప్పుఱప్పట్టు ప్పోవదు, "ఆవాసం త్వహ మిచ్ఛామి" ఎన్ఱు ఋషికళ్ పక్కలిలే శెన్ఱు తాழనిఱ్పదు, "కింకరౌ సముపస్థితౌ" ఎన్బదు, జన్మవృత్తజ్ఞళిల్ కుఱైయ నిఱ్కిఱవర్కళై "ఉకన్ద తోழనీ" ఎన్బదు - ఇప్పడికళాలే శీలవత్తైయే మూదలిత్తదు"** (శీలగుణాన్ని కల్గి ఉండడం అంటే - పట్టాభిషేకానికి విఘ్నం కల్గిందని ఏవిధమైన అతృప్తిని పొందకుండా, వనవాసం గొప్ప ఫలం - అని తలచి వనానికి బయలుదేరి వెళ్ళడం, "అరణ్యంలో నివాసాన్ని కోరుతున్నాను" - అని ఋషులవద్దకు పోయి, వారికంటే తక్కువవాడుగా మెలగడం, "మేమిద్దరం సేవకులం వచ్చాము" అని విశ్వామిత్రునితో పల్కడం, జన్మలో, ప్రవర్తనలో చాలా తక్కువగా ఉండేవారిని "నీవు నా ప్రియస్నేహితుడవు" అని అనడం - ఈ రీతులలో శీలగుణాన్ని కల్గిన స్వభావాన్ని నిరూపిస్తున్నది) అనే శ్రీసూక్తి ఉన్నది. దానినికూడా కొంచెం ఇక్కడ వివరిస్తాను,

జన్మ-వృత్తాలలో చాలా తక్కువ ఉండేవారిని **"ఉకన్ద తోழనీ"** (నాకు ప్రియ మిత్రుడవు) - అని అనడాన్నిగూర్చి ఇతఃపూర్వమే విస్తృతంగా వివరింపబడినది. దశరథ చక్రవర్తి శ్రీరాముని ఒకసారికి రెండు మార్లు పిలచి, "నీకు రాజ్యాన్ని ఇచ్చాను; పట్టాభిషేకానికి ప్రయత్నించు" అని పల్కి, ఆ విధంగా సన్నాహాలు అన్నీ చేసిన తరువాత, ఒక స్త్రీమాటకు అంగీకరించి, "నీకు రాజ్యం లేదు. అరణ్యమే" అని పల్కగా, అపుడు శ్రీరాముడు కొంచెంకూడా మనస్సులో వేదనను పొందకుండా "నగరాన్ని పాలించడంకంటే అరణ్యానికి పోయి నివసించడమే నాకు గొప్ప ఆనందం"



అని మనస్సులో పొంగి పల్కినది మహాగుణం - అని ఆచార్యవర్యులు భావిస్తున్నారు. ఈ విషయాన్నిగూర్చి కంబమహాకవి పల్కుతూ -

**ఇప్పొழுదు ఎమ్మనోరాల్ ఇయమ్బుదఱ్కెళిదో? యారుమ్**
**శెప్పరుమ్ గుణత్తిరామన్ తిరుముకచ్చెవ్వి నోక్కిన్**
**ఒప్పదే మున్బు పిన్బవ్వాశక ముఱైక్క క్కేట్ట**
**అప్పొழுదు అలర్న్ద శెన్దామరైయిణై వెన్ఱదమ్మా**

అని అన్నారు. "నీకు రాజ్యం లేదు. నీవు అరణ్యానికే పోవాలి" అని పల్కినపుడు శ్రీరాముని ముఖకమలంలో తోచిన వికాసాన్ని అపుడు సాక్షాత్తుగా దర్శించినవారు చెప్పవలసినదే తప్ప, మనమా దానిని చెప్పగల్గినవారం! అని పల్కి, వర్ణించడం మానివేసి, "అయినా, కొంచెం చెబుతాను" అని అంటూ ఒకరీతిలో కంబకవి పల్కు తున్నారు. "అరణ్యానికి వెళ్ళు" అనే మాట చెవికి సోకడానికి ముందు శ్రీరాముని ముఖం పద్మంవలె ఉన్నదట. ఆ మాట చెవిన పడగానే అది తామరను మించి ప్రకాశించినదట.

ఇందువల్ల అరణ్యగమనాన్నిగూర్చి ఏవిధమైన బాధలేదు - అనేది మాత్రమే కాక, అంతులేని ఆనందంకూడా కల్గిందని తాత్పర్యం. ఇంత ఆనందం ఎందుకోసం? అంటే, నగరంలో ప్రభువై సింహాసనంపై వేంచేసి ఉంటే, పరత్వగుణాన్ని మాత్రమే వ్యక్తం చేయవచ్చు తప్ప, శీలగుణాన్ని ప్రదర్శించే అవకాశమే దొరుకదు. అధికంగా ఆ గుణాన్ని ప్రదర్శించడంకోసమే అవతరించిన తనకు ఆ గుణం మిక్కిలిగా ప్రకాశించడానికి తగిన వనవాసమే కదా ఆనందకందమవుతుంది. అందువల్లనే **"వనవాసో మహోదయః"** అని అన్నాడు.

## మహర్షులపట్ల చూపిన శీలగుణం

ఋషుల దగ్గరకు పోయి చాలా నైచ్యాన్ని ప్రదర్శిస్తూ వర్తించిన శీలగుణం మనస్సును ద్రవింపజేస్తుంది. మహర్షుల ఆశ్రమాలకు స్వయంగా తానే వెళ్ళి వారికి నమస్కరించి, కుశలప్రశ్నలను చేయాలని తాను భావిస్తూ ఉండగా, వారు ముందు గానే తనవద్దకు వచ్చి తమ తమ కోరికలను విన్నపించినపుడు, **"ప్రసీదంతు భవంతో మే హ్రీ రేషా హి మమాతులా, యదీదృశై రహం విప్రై రుపస్థేయై రుపస్థితః"** (మీ వద్దకే నేను రావలసి ఉండగా, విప్రులైన మీరే నావద్దకు వచ్చారు - అనే ఈ విషయం

నాకు చాలా సిగ్గును కల్గిస్తున్నది. నా పట్ల అనుగ్రహించండి) అని వారి దగ్గర శ్రీరాముడు తాను క్షమను అర్థించడం తన గొప్ప శీలగుణాన్ని ప్రదర్శించడమే. **"అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్"** (సత్యపరాక్రముడైన శ్రీరాముని నేను మహాత్మునిగా తెలిసికొంటున్నాను) అని పల్కిన విశ్వామిత్రమునిని చూచి, **"ఇమౌ స్మ మునిశార్దూల! కింకరౌ సముపస్థితౌ, ఆజ్ఞాపయ యథేష్టం వై శాసనం కరవామ కిమ్"** (ఓ మునిశ్రేష్ఠా! మేమిద్దరం నీకు సేవకులమై నీ దగ్గరకు వచ్చాము. మమ్ములను యథేచ్ఛగా ఆజ్ఞాపించు. ఏ ఆజ్ఞను నిర్వహించాలో తెలుపు) అని అంటూ తనను, తమ్ముని అతనికి సేవకులుగా తెలుపడం, "మీకు అభీష్టమైనవానిని అన్నిటినీ మాకు ఆజ్ఞాపించి, మానుండి కైంకర్యాన్ని స్వీకరించాలి" - అని అనడం సాటి మేటి లేని మహాగుణంకదా, ఇంకా వివరిస్తే గ్రంథం పెరిగి పోతుందని ఇంతటితో నిలుస్తాను.

## 2. కః వీర్యవాన్ (వీర్యవంతుడెవడు?)

**"వీర్యవాన్ కః"** - వీర్యగుణాన్ని కలవాడెవడు? అనే రెండవ ప్రశ్నను ఇక వివరిస్తాను. భగవానుని కల్యాణగుణాలలో వీర్యం, శౌర్యం, పరాక్రమం - అనే మూడు గుణాలను చేర్చి అనుసంధించడంకూడా ఉన్నది. ఈ మూడు పదాలు అర్థంలో తేడా లేనట్లుగా తోచినా, భేదాన్ని గమనించవచ్చు.

(1) శత్రువుల సేన ఎంత బలంగా ఉన్నా, దానిని చూచి కొంచెంకూడా భయం పడకపోవడం (వీర్యం), (2) ఆ సేనలోపలకు ఒంటరిగానే ప్రవేశించి శత్రువులను అనాయాసంగా సంహరించగల్గిన సామర్థ్యం (శౌర్యం), (3) ఆవిధంగా చేసేటపుడు తనకు కొంచెంకూడా భంగం కలుగని రీతిలో, సకలవిధభంగాలు శత్రువులకు కల్గించడం (పరాక్రమం) - అని ఈరీతిలోని మూడువిధాలైన సామర్థ్యాలు మహావీరులకు ఉండవలసినవి ఉన్నాయి. ఈ మూడిటిని తెలిపే పదాలుగా వీర్య-శౌర్య- పరాక్రమ పదాలను గ్రహించవచ్చు.

ఇక్కడ **"కః వీర్యవాన్"** అని అంటూ వీర్యగుణం మాత్రమే చెప్పబడినా, మిగిలిన రెండు కూడా ఉపలక్షణంగా గ్రహించవచ్చు. లేక, వీర్యమనే పదంలోనే ఈ మూడు అర్థాలను చేర్చి అనుసంధానం చేయవచ్చు.

పూర్వం **"గుణవాన్ కః?"** అనేచోట భగవానుని సౌలభ్యగుణాన్ని తలచి, ద్రవించి మనస్సు నీటిబుడగవలె ఉండేవారికి వెంటనే ఈ వీర్యగుణాన్ని అనంతరగుణంగా



కూర్చడం చాలా యుక్తమైనది. ''సౌలభ్యాన్ని అనుసంధించి ద్రవించేవారు నిస్సమాభ్యధిక మైన పరత్వాన్ని అనుసంధించే ఒకవిధంగా ప్రాణాన్ని నిలుపుకోవాలి"- అనేది ఆచార్యుల అరుదైన ఔషధంవంటి శ్రీసూక్తి.

### శ్రీరాముని మహావీరత్వం

శ్రీరామాయణంలోను, ఇంకా మిగిలిన శ్రీరాముని గూర్చి పలికే పలు గ్రంథాల లోను శ్రీరాముడు వీరుడని, శూరుడని, పరాక్రమశాలి అని కీర్తిస్తూ పల్కడం విశేషంగా కన్పిస్తుంది. శ్రీరామునకు మహావీరుడు - అనే ఒక తిరునామం ఉన్నది. **"జయ జయ మహావీర"** అనే రఘువీరగద్య ఆరంభ మవుతున్నది. వీరరాఘవుడనే ఒక దివ్యదేశంలోని తిరునామాన్ని పొంది భగవానుడు వెలిగే విషయం ప్రసిద్ధం. భవభూతి మహాకవి మహాచరితమనే పేరును పెట్టి నాటకాన్ని రచించాడు. ఆళ్వార్లు శ్రీరాముని లీలనుగూర్చి **"వీరన్"** అనే నోరార పల్కుతున్నారు. **"ఇలజ్గై మన్ననై న్దొడైన్దు పైన్దలై నిలత్తుకక్కలజ్గ వన్దు శెన్దు కొన్దు వెన్దికొణ్డ వీరనే!"** (రావణుని పది శిరస్సులు భూమిపై పడేటట్లు, ఆ రాక్షసులు భయపడేటట్లు, లంకలో ప్రవేశించి వధించి విజయాన్ని పొందిన మహావీరా!) అని, **"మాఱు శెయ్ద వాళరక్కన్ నాళ్ ఉలప్ప అన్ఱిలజ్గై నీఱు శెయ్ద శెన్దు కొన్దు వెన్ఱి కొణ్డ వీరనార్"** (శత్రుత్వాన్ని కల్గిన, చేతిలో కత్తిని కల రాక్షసుని ఆయుస్సు తీరేటట్లుగా అపుడు లంకను భస్మం చేసి జయాన్ని పొందిన వీరుడు) అనే (తిరుచ్చన్దవిరుత్త) పాశురాలను గమనించవచ్చు.

### రావణుడు పొగడిన రామవీర్యం

వీటి అన్నిటికంటే, శత్రువు తన చేతితో తీసే దిష్టి - అనే రీతిలో రావణుడే ఆశ్చర్యపడి పొగడిన వీర్యం శ్రీరామునకున్నది. **"శత్రోఃప్రఖ్యాత వీర్యస్య రంజనీయస్య విక్రమైః"** (గొప్ప వీర్యాన్ని కలవాడు, శత్రువును కూడా తన విక్రమ కార్యాలతో రంజింపచేసేవాడు) అనేది రావణుని మాట. శ్రీరాముని **"ప్రఖ్యాత వీరు"**డని రావణుడు తన నోటితో యుద్ధరంగంలో పల్కడం - ఆ వీర్యగుణాన్ని అతడు చాలా బాగా అనుభవించినందువల్లనే కదా! **"విక్రమైః రంజనీయస్య"** అనికూడా వెంటనే రావణుడు పలికాడు.

### మూలబలయుద్ధంలో శ్రీరాముడు చూపిన వీర్యగుణాతిశయం

ఈవిధంగా పలికే రీతిలో శ్రీరాముడు చేసిన వీర్యకృత్యాలు అనేకం ఉన్నా, వాటిలో ఒక కృత్యాన్ని మాత్రం ఇక్కడ ఉదాహరిస్తాము. దీనిని యుద్ధకాండలోని

94వ సర్గలో గమనించవచ్చు. అక్కడ, మూలబలం ఎదిర్చినపుడు శ్రీరాముని అతిమానుషమైన యుద్ధసామర్థ్యాన్నిగూర్చి పల్కడంలో వాల్మీకిమహాముని సైతం తడబడ్డాడు. **"ఛిన్నం భిన్నం శరైర్దగ్నం ప్రభగ్నం శస్త్రపీడితమ్, బలం రామేణ దదృశుః న రామం శీఘ్రకారిణమ్"** అని అంటూ "శ్రీరామునిచే పలుమార్లు గాయపడిన రాక్షససేనలను చూచారే తప్ప, రణరంగంలో మహావేగంగా పరిభ్రమించే శ్రీరాముని ఎవరూ చూడలేకపోయారు"- అని అంటున్నాడు, వాల్మీకి ముని. తరువాత **"తే తు రామ సహస్రాణి రణే పశ్యంతి రాక్షసాః"** అని అంటూ వేలాదిసంఖ్యలో శ్రీరాముని రూపాలను రాక్షసులు చూచారు - అని అంటున్నాడు. ఆ తరువాత **"పునః పశ్యంతి కాకుత్థ్సమేక మేవ మహాహవే"** (మళ్ళీ రాక్షసులు యుద్ధంలో శ్రీరాముని ఒక్క రూపాన్నే దర్శించారు) అని అంటూ ఆ యుద్ధరంగంలో శ్రీరాముని ఒక్కని మాత్రమే దర్శించారు- అని అంటున్నారు.

శ్రీరాముని చూడనే లేదు - అని అనడం, వేలాది సంఖ్యలో శ్రీరాముని రూపాలను చూచారని అనడం, ఒకే శ్రీరాముని చూచారని అనడం - ఈవిధంగా ఒకదానితో ఇంకొకటి పొసగని రీతిలో పలికే రీతిలో కదా శ్రీరాముడు చాలా విచిత్రమైన యుద్ధకృత్యాన్ని చేశాడు.

తిరువాయ్మొఴిలో (8-6-5) **"ఒరువర్ ఇరువర్ ఓర్ మూవరెన నిన్టు ఉరువు కరన్దు ఉళ్ళుమ్ తోఱుమ్ తిత్తిప్పాన్"** (ఒకడుగా, ఇద్దరుగా, ముగ్గురుగా కనిపించి, ఆ తర్వాత అదృశ్యుడైన శ్రీరాముడు మనస్సుకు మధురంగా సాక్షాత్కరించాడు) అనే పాశురానికి పూర్వాచార్యులు అర్థాన్ని నిర్వహించే విధం ఇతరపండితుల బుద్ధికి కొంచెంకూడా అందనిది. ఒకరుగా, ఇద్దరుగా, ముగ్గురుగా కన్పించడం, రూపం అదృశ్యం కావడం ఎపుడు? అని తెలిసి కోవడానికి సాధ్యం కానట్లుగా ఆఴ్వార్ల పాశురం ఆవిర్భవించింది. దీనికి ముందు పాశురాన్ని **"శెరుక్కడుత్తన్టు తికైత్త అరక్కరై ఉరుక్కెడ వాళి పొఴిన్ద ఒరువనే"** (బాగా మదించిన రక్కసులను ఆనాడు రూపు మాసిపోయేటట్లుగా బాణాలను వర్షించిన అద్వితీయుడు) అని ముగించిన తర్వాత, ముందు పాశురం చివరి పాదానికి, తరువాతి పాశురం మొదటి పాదానికి ఒక అన్వయాన్ని గమనించి, వ్యాఖ్యానించారు.

ఇక్కడ పెరియవాచ్చాన్పిళ్ళై పల్కిన వ్యాఖ్యానశ్రీసూక్తులను దర్శించండి - **(ఒరువరిరు వరోర్ మూవరెన నిన్టు ఉరువు కరన్దు. ఉరుక్కెడ వాళి పొఴిన్ద ఒరువనే)**



అని అంటూ ముందు పాశురంతో అన్వయించాలి. **(ఉరుక్కెడ వాళి పొఴిన్ద ఒరువన్)- ఎన్టు కీఴోడే అన్వితమాకక్కడవదు. మూలబలమ్ శామ్బడి అరుళుకిఱ అన్టు మున్దుఱ ఒరువనాయ్ త్తోన్ఱి, శారికైయిల్ వేగమ్ మికమిక ఇరువరుమ్, మూవరుమాయ్ తోన్ఱి, వేగమ్ మిక్కవాఱే ఇంద్రియసంయోగత్తుక్కు ఇడమిల్లాదపడియాకైయాలే రూపగ్రహణమ్ అరిదాకి, ఉరుక్కెడ వాళి పొఴిన్ద ఒరువనెన్టు అన్వయమ్. వ్యాపరిత్త శడక్కాలే రూపమ్ కణ్ణుక్కు ప్పిడిపడాదొఴికై)** మూలబలం నశించేటట్లుగా చేసేటపుడు శ్రీరాముడు ముందుగా ఒకడై తోచి, పరిభ్రమణంలో వేగం ఎక్కువకాగా, ఇద్దఱుగా, ముగ్గురుగా తోచి, వేగం ఇంకా ఎక్కువ అయినపుడు ఇంద్రియ సంయోగానికి అవకాశం లేని రీతిలో ఉన్నందున రూపగ్రహణం దుర్లభమై, రూపం అదృశ్యమయే రీతిలో బాణవృష్టిని కురిపించిన అద్వితీయుడు-అని అన్వయం. వ్యాపరించే శైఘ్ర్యం చేత రూపం కంటికి చిక్కకుండా ఉండడం - దీనివల్ల శ్రీరాముని వీర్యగుణం వాచామగోచరమని ఏర్పడుతున్నది.

## శ్రీరామవీర్యంలో తోచే సందేహం, దానికి సమాధానం

శ్రీరాముడు ఇంతటి వీరుడైనపుడు, రావణుని ఒక్కక్షణంలో వధించి ఉండవచ్చుకదా! ఆవిధంగా వధించకుండా, చాలా ప్రయాసపడినట్లుగా తెలుస్తున్నదే! అది ఏమి? - అని కొందఱు ప్రశ్నించవచ్చు. వినండి. **"పొల్లా అరక్కనై క్కిళ్ళి క్కళైన్దానై"** (దుష్టరాక్షసుని గిల్లి పారవేసినవానిని) అని గోదాదేవి, **"శదుర మామదిళ్ శూఴ్ ఇలజ్జైక్కు ఇఱైవన్ తలై పత్తు ఉదిర వోట్టి ఓర్ వెఙ్కణై ఉయ్త్తవన్"** (నాల్గు వైపుల గొప్ప ప్రాకారాలచే చుట్టబడి ఉండే లంకకు ప్రభువైన రావణుని పది తలలు రాలిపడేటట్లుగా ఒక అద్వితీయమైన, క్రూరమైన శరాన్ని ప్రయోగించిన వీరుడు) అని తిరుప్పాణ్ ఆఴ్వార్లు అనుగ్రహించిన రీతిలో రావణసంహారాన్ని శ్రీరాముడు అవలీలగానే చేశాడు. ఇందులో ఏ సందేహం లేదు.

ఏవిధంగా అయినా రావణుడు తనను అంగీకరించి, దారిలోకి వచ్చి ఉజ్జీవించడం అనేది సంభవిస్తుందనే పేరాశ శ్రీరామునకు ఉన్నందువల్ల, అతనిని సంహరించడం లో కాలతామసాన్ని (ఆలస్యాన్ని) చేశాడనే తత్త్వం తెలియ దగినది. రావణుని కంటే పెక్కు రెట్లు బలిమిని కలవాడనే ప్రసిద్ధిని పొందిన వాలిని అనాయాసంగా పరిహరించినవాడు - శ్రీరాముడు. రావణునకు హనుమానుడు హితోపదేశాన్ని చేసేటపుడు **"త్వయా విజ్ఞాతపూర్వశ్చ వాలీ వానరపుంగవః, రామేణ నిహతః సంఖ్యే**

**శరేణైకేన వానరః"** (నీకు ఇంతకుముందే బాగా తెలిసినవాడు, వానరులలో శ్రేష్ఠుడైన వాలి యుద్ధంలో రామునిచేత ఒకే ఒక్కబాణంతో సంహరింప బడ్డాడు) అని (సుందరకాండ-51-11) "నాయనా! రావణా! వాలి అనే వానరేశ్వరుని ఇతః పూర్వమే నీకు తెలుసు కదా! అతడు రామునిచే ఒకే బాణంతో సంహరింప బడ్డాడు" అని అన్నాడు.

అంతేకాక, రావణుని పలుమార్లు అవమానించినవాడు కార్యవీర్యార్జునుడు. అటువంటివానిని పరశురాముడు తన గండ్రగొడ్డలి ఆయుధంతో అతని వేయి బాహువులను నఱికి వధించాడు. ఆ పరశురాముడు శ్రీరామునివద్ద పడిన భంగపాటు తెలిసినదే. ఇటువంటి నిస్సమాభ్యధికమైన సామర్థ్యాన్ని కల్గిన శ్రీరాముడు రావణుని సంహరించడంలో శ్రమపడాలా? శ్రమపడినట్లు కథలో కన్పిస్తే "సత్యసంకల్పుడు, మహావీరుడైన శ్రీరాముడు ఎందుకోసం ఇంత శ్రమపడ్డాడు?" - అని గమనించాలి కదా! గమనించి చూచినపుడు పూర్వ మనం తెలిపిన కారణమే ఊర్జితం (బలమైనది) అవుతున్నది.

శూర్పణఖ నాసికా భంగాన్ని పొంది, జనస్థానంలో ఉండే తన అన్న ఖరుని దగ్గరకు పోయి, జరిగిన సంగతిని వివరించి, దొర్లి దొర్లి ఏడ్చి, అతనికి శ్రీరామునిపై కోపాన్ని కల్గించింది, అతడు పధ్నాలుగు వేలమంది సేనాధిపతులను, సేనలను శ్రీరామునితో యుద్ధం చేయడానికి పంపగా, రాఘవుడు వారిని అంతమందిని తానొక్కడే వధించి జయించాడు. తరువాత, ఖరుడు తానే స్వయంగా వచ్చి ఎదరించాడు. శ్రీరాముడు **"అసహాయశూర"** అని రఘువీరగద్యలో సంబోధించి నట్లుగా, లక్ష్మణుని సహాయంగా లేకుండానే ఏకాకిగా అతని శిరస్సును ఖండించడం ప్రసిద్ధం.

**"చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్, ఏకశ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి"** (భయంకరమైన చేష్టలను చేసే రాక్షసులు పదహాఱువేలమంది. ధర్మాత్ముడైన శ్రీరాముడొక్కడే. వీరి మధ్య యుద్ధం ఏవిధంగా జరుగుతుందో!) అని భయపడే మహర్షులుకూడా ఆశ్చర్యపడేటట్లుగా అవలీలగా కదా భస్మం చేశాడు. అటువంటి గొప్ప సామర్థ్యాన్ని కల్గిన మహావీరునకు రావణుడు ఒక పదార్థమా! ఒకే ఒక్క దెబ్బతో అతనిని వధించలేకపోవడమనేది లేదు. "ఏవిధంగా అయినా అతడు తనపట్ల అభిముఖుడుగా కాగలడా!" అని ఎదురు చూచాడు, అంతే. ఇది శ్రీరాముని మాటల వల్లనే చక్కగా వ్యక్తమయేటట్లు ఇక్కడ నిరూపిస్తాను.



శ్రీరామాయణం యుద్ధకాండలో **"మరణాంతాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్, క్రియతామస్య సంస్కారో మమాప్యేష యథా తవ"** అనేది విభీషణుని ఉద్దేశించి శ్రీరాముడు పల్కిన శ్లోకం. రావణుడు మరణించిన తరువాత, "ఈ మహాపాపికి నేను ఉత్తరక్రియలను చేయను" అని పట్టుదలతో ఉండే విభీషణ*ర్వా*న్ను చూచి పల్కిన మాట ఇది. సాధారణంగా సంస్కృతభాషను తెలిసిన అందఱు శ్రీరామాయణంలోని శ్లోకాలకు అర్థాన్ని చెప్పడం అలవాటు కనుక, అటువంటివారు దీనికి చెప్పే అర్థం ఏ విధమైనది? అంటే, "లోకంలో ఒకనిపట్ల ఇంకొకనికి ఉండే పగ, మరణంవరకు మాత్రమే. అందువల్ల, ఇక రావణుడు మరణించిన తరువాత కూడా ఇతనిపట్ల మనం పగను కల్గి ఉండడం ఎందుకు? ఇతనిని వధించడం, సీతాదేవిని పరిగ్రహించడమే మనకు ప్రయోజనం కనుక, అది నెఱవేఱిన తరువాత కూడా ఇక ఇతనిపై మనం పగను కల్గి ఉండవచ్చునా? పగను మఱచి ఇక ఇతనికి చేయవలసినదానిని చేయాలి" అని శ్రీరాముడు పల్కుతున్నాడని పలువురు చెప్పే అర్థం.

ఈ అర్థం పొందికను కల్గినది కాదని, ఇది శ్రీరాముని మనస్సుకు పొసగనిది అని నమ్పిళ్ళై భావించి, చాలా రస్యమైన వ్యాఖ్యానాన్ని చేశారు. ఆ వ్యాఖ్య ఇక్కడ వివరింపబడుతున్నది.

ఇంతవరకు శ్రీరామునిపై రావణుడు పగను కల్గి ఉన్నాడే తప్ప, రావణునిపై శ్రీరాముడు కొంచెం కూడా పగను కల్గినవాడు కాదుకదా! విభీషణుని పరిగ్రహించాలా? వద్దా? అనే విచారం జరిగి, పరిగ్రహించాలి- అని నిశ్చయించి, **"ఆనయైనం హరిశ్రేష్ఠ! దత్తమస్యాభయం మయా"** (ఓ వానరరాజా! ఇతనిని నాదగ్గరకు తీసుకొని రా! ఇతనికి నేను అభయాన్ని ఇచ్చాను) అని సుగ్రీవుని నియోగించి విభీషణుని తీసికొని రమ్మని ఆజ్ఞాపించినపుడు, **"విభీషణో వా సుగ్రీవ! యది వా రావణ స్స్వయమ్"** (సుగ్రీవా! వచ్చినవాడు విభీషణుడు అయినా, లేక, స్వయంగా రావణుడైనా) అని శ్రీరాముడు పలికాడు. వచ్చినవాడు విభీషణుడైనా సరే; రావణుడే మాఱువేషం వేసికొని వచ్చినా సరే. తప్పకుండా అతనిని నీ వెంట తీసికొనిరా" అని అన్నాడు. ఆవిధంగా పల్కిన శ్రీరాముని మనస్సుకు అనుకూలంగా ఉండే అర్థాన్ని కదా చెప్పాలి.

ఈ సంగతిని గమనించండి. "విభీషణా! ఈ రావణుడు జీవించి ఉండే కాలంలోనే ఇతనికి ఏమయినా కొన్ని హితాలను నేను చేయగోరాను. అవి సాధ్యం

కాని రీతిలో ఇతడు పలు విధాలుగా ద్వేషకార్యాలనే చేస్తూ వచ్చాడు. మహర్షులను సుఖంగా జీవించలేకుండా చేశాడు. సీతాదేవిని విశ్లేషింపజేశాడు. నాకు ప్రాణస్థానీయుడైన శ్రీజటాయుమహారాజును వధించాడు. ఇటువంటి వైరకృత్యాలను ఇతడు తాను చనిపోయేవరకు చేసి తీరినవాడైనా, ఇక అటువంటి పనులను చేయలేడు కదా!" అనేదే **"మరణాంతాని వైరాణి"** అనే దానియొక్క అర్థం (ఇక్కడ **"వైరాణి"** అంటే వైరకృత్యాలని భావం.)

ఇక, **"నిర్వృత్తం నః ప్రయోజనమ్"** అనేది ఇక్కడ ప్రాణస్థానీయమైన వచనం. దీని అర్థాన్నే ఋజువుగా గ్రహించాలి. "ఇతనిని సంహరించడం మనకు ప్రయోజనం; అది నెఱవేరింది" అని శ్రీరాముడు పల్కుతున్నట్లుగా అర్థాన్ని గ్రహించకూడదు. ఆ అర్థం మనస్సులో కూడా భావించదగినది కానేకాదు. ప్రస్తావించి ఖండించడానికి కూడా తగని అర్థం అది. ఈ ప్రయోగానికి నమ్పిళ్ళై అనుగ్రహించిన వ్యాఖ్యాన శ్రీసూక్తి యథాతథంగా ఉట్టంకింపబడుతున్నది.

**(నిర్వృత్తం నః ప్రయోజనమ్) - "ఇవన్ జీవిత్తిరుక్కిఱనాళిలే నామ్ శెయ్యుమ్ నన్మైయై ఇవన్ విలక్కాదొழియ వేణుమెన్ఱు ఇత్తనైయే ప్పార్త్తిరున్దోమ్. అదు అన్నాళిలే పెఱ్ఱిలోమ్. నామ్ తేడియిరున్ద అదు మున్దుఱ మున్నమ్ సిద్ధిక్క ప్పెఱ్ఱోమిఱే".** (ఇతడు జీవించియుండే కాలంలో "నేను చేసే హితాన్ని ఇతడు అడ్డుపెట్టకుండా ఉండాలి"- అని ఇంతమాత్రమే నేను ఎదురుచూశాను. దానిని ఆ సమయంలో పొంద లేకపోయాను. నేను ఎదురుచూసే దానిని ఇపుడు మునుముందుగా పొందగలిగాను కదా!)

ఈ సూక్తిని కొంచెం వివరిస్తాను. భగవానుడు చేతనులకు హితాన్ని చేయడంలో బాధ్యతను కలవాడు. తాను చేయదలచిన హితాలను నిర్హేతుకంగా తానే చేయ గల్గినా, **"సర్వజ్ఞోఽపి హి దేవేశ స్సదా కారుణికోఽపి సన్, సంసారతంత్రవాహిత్వాత్ రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే"** (భగవానుడు సర్వజ్ఞుడైనా, కరుణను కలవాడైనా, సంసార తంత్రాన్ని నిర్వహించేవాడు అయినందున, రక్షింపబడదగిన జీవునినుండి రక్షణలో అపేక్షను ఎదురుచూస్తాడు) అని శాస్త్రాలలో చెప్పబడినందువల్ల, చేతనుల వద్దనుండి కొంచెం ఎదురు చూస్తాడు - అని తెలుస్తున్నది. ఆ విధంగా భగవానుడు ఎదురు చూచేది ఏది? - అని అంటే, దానిని మనం ఒక విధంగా ఇదమిత్థమని నిష్కర్షించి చెప్పలేము. కర్మయోగం, జ్ఞానయోగం, భక్తియోగం మొదలైనవానిలో ఏదైనా



ఒకదానిని ఎదురుచూడవచ్చు. "మనం చేసే మంచిని ఇతడు అడ్డు పెట్టకుండా ఉండాలి" అని ఇంతమాత్రమే ఎదురుచూడడంకూడా ఉన్నది. దీనికి అప్రతిషేధం- అని పేరు. ప్రతిషేధం - అంటే అడ్డుకోవడం. అప్రతిషేధం- అడ్డుకోకుండా ఉండడం. భగవానుడు తన కరుణను మనపై ప్రసరించలేకుండా ఉండేటట్లు మనమే మన తలను ఖండించుకొనేవారమై తిరిగే రీతి ఒకటి ఉన్నది కదా. అదే ప్రతిషేధం - అంటే.

మనం చేసే ప్రవృత్తులను (ప్రయత్నాలను) చూచి భగవానుడు - "అయ్యో! నా కరుణ ప్రసరించడానికి కూడా అవకాశం ఇవ్వకుండా ఈవిధంగా అడ్డుపెడు తున్నాడే! ఈ పాపిష్ఠివాడు!" అని కన్నీరు విడుస్తాడు. చేతనుడు అనుకూలప్రవృత్తిని దేనినీ చేయకపోయినా, విపరీత ప్రవృత్తులను చేయకుండా ఉంటే, భగవానుని కరుణప్రవాహం అడ్డు లేకుండా ప్రవహించి తీరుతుంది. దీనిని కూరేశులు శ్రీవైకుంఠస్తవంలో అద్భుతంగా (61వ శ్లోకంలో) అనుగ్రహించారు - **"యత్ బ్రహ్మకల్ప నియతానుభవేఽప్యనాశ్యమ్"** అనే శ్లోకంలో. ఈ శ్లోకంలో - **"క్షామ్యస్యహో! తదభిసంధివి రామమాత్రాత్"** (జీవుడు నీ రక్షణ ప్రయత్నాన్ని అడ్డుకోవడం నిలిపినంత మాత్రంలోనే అతనిని నీవు క్షమిస్తావు కదా! ఆహా!) అనేది ప్రాణ సమానమైన ఉక్తి. చేతనుడు సుకృతవిశేషాలను ఏమీ చేయకపోయినా, దుష్కృతమైనా చేయకుండా ఉంటే, అంతమాత్రమే ఆలంబనంగా చేసికొని భగవానుడు అనుగ్రహించి తీరుతాడు- అనేదే ఈ కూరేశుల శ్రీసూక్తిలో తెలుపబడిన విషయం. మనం స్వయంగా ఏ సుకృతం చేయక పోయినపుడు, దానినిగూర్చి కొంచెం కూడా బాధ లేదు. భగవానుని కరుణ ప్రవహించ డానికి అడ్డుగా మనం ప్రవర్తించకపోతే చాలు. అతడే స్వయంగా రక్షించాలని అభిప్రాయపడినా, దానిని అడ్డుకొనేటట్లే, మనం విపరీత - ప్రతికూల ప్రవృత్తులలో ప్రయత్నిస్తే దానిని చూచి అయ్యో! అని అతడు శోకించవలసి వస్తుంది.

రావణుడు సీతాదేవిని అపహరించడం, జటాయువును వధించడం, పరమ భాగవతులైన మహర్షులను సుఖంగా నివసించనీయకుండా వారికి అనేక కష్టాలను కల్గించడం - మొదలైనవానిని చేసినా- వీటిని ఏమీ పట్టించుకోకుండా కరుణా సముద్రుడైన కాకుత్స్థుడు **"ఇన్ఱు పోయ్ నాళై వా"** -(ఈనాడు పోయి రేపు రా) ఇత్యాది వచనాలతో దయ చూపాలనే తన అభిప్రాయాన్ని సూచించాడు. కాని అయ్యో! అతడు శ్రీరాముని మనోగతాన్ని తెలియలేకపోయాడు. **"గచ్ఛానుజానామి"** అని పల్కిన శ్రీరాముని నియమనాన్ని పొంది, ఇంటికి పోయినవాడు తిరిగి యుద్ధానికి

రాకుండా ఉండి ఉంటే శ్రీరాముడు అతనినే లంకకు ప్రభువుగా చేసి ఉండేవాడే. ఈప్రాప్తికి అతడు అవకాశం ఇవ్వలేదు. అందువల్లనే అతని విషయంలో శ్రీరాముడు చేయగోరిన హితం అతని ప్రాతికూల్యంవల్ల అడ్డగింపబడి పోయింది. అతడే ఇపుడు మరణించి నందువల్ల దానిని పరమప్రయోజనంగా తలచి, **"నిర్వృత్తం నః ప్రయోజనమ్"** అని అన్నాడు. "నేను చేయదలచిన మంచికి ఏ అడ్డు చేయకపోవడమనే ఈ స్థితిలో నేను ఇతనికి చేయగల్గిన మంచి ఏమి? అంటే, ఇతని శరీరాన్ని కాకులు, గద్దలు తినకుండా పెద్దలకు చేసే క్రమంలో సంస్కారం చేయడమే. విభీషణా! నీవు దానిని చేయాలి. నీవు చేయకపోతే, ఇదిగో, నేనే చేసి తీరుతాను - అని శ్రీరాముడు పల్కడమే - **"మరణాంతాని వైరాణి"** అని ప్రస్తావించిన ఈ శ్లోకంవల్ల తేలిన విషయం. ఇటువంటి శ్రీరాముడు రావణుని ఒకే బాణంతో వధించకుండా చాలా ఆలస్యం చేయడం తన శౌర్యవీర్య పరాక్రమాలలోని కొఱత వల్లకాదు- అని చక్కగా గ్రహించాలి-

### "రామం సత్యపరాక్రమమ్" అనే సూక్తిలోని తాత్పర్యం

విశ్వామిత్ర మహర్షి తన యాగాన్ని పూర్తిచేయాలని శ్రీరాముని కోరి దశరథ చక్రవర్తి వద్దకు వచ్చినపుడు, **"అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్"** అని అన్నాడు. ఇందులో **"సత్యపరాక్రమమ్"** అనే దానిలోని అంతరార్థాన్ని నిశితంగా గమనించాలి. శత్రువు అలసిపోవడం గమనించి, అతనిని వధించడం కాకుండా, సాధ్యమైనంతవరకు అతడు తనపట్ల ఆభిముఖ్యాన్ని పొందాలని చూసి, అది చేజిక్కకపోతే, చివరగా సంహరించడమే సత్యపరాక్రమాన్ని కల్గి ఉంచడం - అని పెద్దలు వివరించారని తెలియాలి.

### షాడ్గుణ్యంలో ఒకటైన వీర్యగుణంయొక్క వివరణం

**"కః వీర్యవాన్"** అనే వాల్మీకి ప్రశ్నను ఇంకొక రీతిలో కూడా వివరించవచ్చు. భగవానుని షాడ్గుణ్యపరిపూర్ణుడని అనేటపుడు, జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు - అనే ఆఱు విధాలైన గుణాలు గ్రహింపబడుతున్నాయి. వీటిలో వీర్యమంటే ఏమి? అనే విషయాన్ని భట్టర్ - **"మృగనాభి గంధ ఇవ యత్ సకలార్థాన్ నిజసన్నిధే రవికృతో వికృణోషి, ప్రియరంగ! వీర్యమితి తత్తు వదంతే"** అనే శ్లోకంలో నిరూపించారు. కస్తూరి పరిమళం తాను కొంచెంకూడా వికారాన్ని పొందకుండా ఇతరుల మనస్సులను ఏవిధంగా వికారాన్ని పొందిస్తుందో, ఆ రీతిలోనే భగవానుడు తాను వికారాన్ని



పొందకుండా, సకలపదార్థాలను వికారాన్ని పొందేటట్లు చేయడమే వీర్యం - అని దీనిద్వారా తెలుపబడినట్లయినది.

ఈ గుణాన్ని శ్రీరామునిలో బాగా గమనించవచ్చు. సుమంత్రుడు శ్రీరాముని గంగాతీరంలో విడచిపెట్టి రథంతో తిరిగి బయలుదేరి వచ్చి, దశరథుని వద్దకు పోయినపుడు శ్రీరాముని విశ్లేషంవల్ల వృక్షాలు, చెట్లు, లతలు మొదలైనవి వాడి పోయినవని అంటూ, **"విషయే తే మహారాజ! రామవ్యసనకర్శితాః అపి వృక్షాః పరిమ్లానాః సపుష్పాంకురకోరకాః"** (మహారాజా! నీరాజ్యంలోని వృక్షాలు పూలు, మొగ్గలు, చిగుళ్ళతో పాటు అన్నీ శ్రీరాముని విశ్లేషంవల్ల వాడిపోయాయి), **"ఉపతప్తోదకానద్యః పల్వలాని సరాంసి చ, పరిశుష్కపలాశాని వనాన్యుపవనాని చ"** (నదుల లోని, గుంటలలోని, సరస్సులలోని నీరు సలసల కాగిపోయింది. వనాలు, ఆ వనాల సమీపంలో ఉండే ఉపవనాలలోని వృక్షాలు చిగుళ్ళు వాడిపోయాయి) అని అన్నాడు. "రాజా! నీ రాజ్యంలో ఉండే వృక్షాలు కూడా శ్రీరాముని విశ్లేషాన్ని సహించలేక వాడిపోయి, పూలతో, చిగుళ్ళతో, మొగ్గలతో శుష్కించిపోయాయి. కొలనులలోని చల్లటి నీరు కాలు పెట్టడానికి వీలు లేనట్లుగా కాగిపోతున్నది. అరణ్యాలలో, ఉద్యానవనాలలోని చెట్లలోని ఆకులు ఎండిపోతున్నాయి" అని అన్నాడు.

దీనిని కూరేశులు అతిమానుషస్తవంలో **"వంశం రఘో రనుజిఘృక్షు రిహావ తీర్ణః"** అనేశ్లోకంలో **"త్వత్సన్నిధి ప్రభవశైత్యజుషో యదా హి వృక్షాశ్చ తాంతి మలభంత భవద్వియోగే"** (నీ సాన్నిధ్యం వల్ల కల్గిన చల్లదనాన్ని పొందిన వృక్షాలు నీ విరహక్లేశం వల్ల దుఃఖాన్ని పొందాయి) అని అన్నారు. ఈవిధంగా చేతనాలు, చేతనాలు - అనే భేదం లేకుండా సకలపదార్థాలను వికారాన్ని పొందించడమనే గుణం శ్రీరామునిలో ఉన్నదనే విషయాన్ని మననం చేసిన వాల్మీకిముని **"కః వీర్యవాన్"** అని ప్రశ్నించాడు- అనేది చాలా యుక్తం.

## 3. కః ధర్మజ్ఞః? (ధర్మజ్ఞుడెవడు?)

ఇక, **"కః ధర్మజ్ఞః"** అనే మూడవ ప్రశ్నను వివరిస్తాము.

**"ధర్మజ్ఞః"** అనే పదానికి - ధర్మాన్ని తెలిసినవాడని అర్థం. గోదాదేవి, నాచ్చియార్ తిరుమొழి ప్రబంధంలో (14-16). **"తరుమ మఱియా క్కుఱుమ్బన్"** (ధర్మాన్ని తెలియని తుంటరి) అని అంటూ శ్రీకృష్ణుని ధర్మాన్ని తెలియనివాడని అన్నది. ఆ స్వభావానికి సాక్షాత్తు విరుద్ధంగా శ్రీరాముడు ధర్మాన్ని తెలిసినవాడనబడుతున్నాడు.

ధర్మమంటే ఏమి? అనే విషయాన్ని గమనించాలి. శాస్త్రాలలో పలువిధాలైన ధర్మాలు చెప్పబడి ఉన్నా, శ్రీరాముడు తెలిసినట్లుగా చెప్పబడే ఏమయి ఉంటుంది? అని గమనించాలి.

సుందరకాండలో **"ఆనృశంస్యం పరో ధర్మః త్వత్త ఏవ మయా శ్రుతః"** (జాలి అనేది గొప్ప ధర్మం. దానినిగూర్చి నీ దగ్గరే విన్నాను) అనే సీతాదేవి సూక్తి కన్పిస్తున్నది. ఆ నృశంస్యం అంటే - జాలి. అదే పరమధర్మమని శ్రీరాముని అభిప్రాయమట. అందువల్ల జాలిని తెలిసినవాడు - అనే అర్థాన్ని గ్రహించవచ్చు. అంటే - జాలిని కలవాడని భావం. శ్రీవేదాంతదేశికులు దశావతారస్తోత్రంలో ఒక్కొక్క అవతారానికి ప్రత్యేక ప్రత్యేకంగా ఒక్కొక్క శ్లోకాన్ని రచించి, చివరలో పది అవతారాలను కలిపి ఒకే శ్లోకంలో (**"ఇచ్ఛామీన విహారకచ్ఛప"** - ఇత్యాదిశ్లోకంలో) పలికేటపుడు ఒక్కొక్క అవతారానికి ఒక్కొక్క విశేషణం ప్రయోగించి పల్కుతూ, శ్రీరామావతార ప్రస్తావంలో **"కరుణాకాకుత్స్థ!"** అని అన్నందున శ్రీరాముడు కరుణయే మూర్తీభవించినవాడని చెప్పదగినవాడు. కరుణ అంటే ఏమి? - అనే దానిని, శ్రీరామునిలో దర్శించిన కరుణ ఎటువంటిది? అనేదానిని ఇక్కడ వివరించవలసి ఉన్నది. అమరకోశంలో **"కారుణ్యం కరుణా కృపా దయా అనుకంపా స్యాత్, అనుక్రోశోఽపి"** (1-7-18) అని అంటూ ఏడు పదాలు (కరుణా) పర్యాయపదాలుగా ప్రయోగింపబడ్డాయి. వీటిలో **"అనుకంపా, అనుక్రోశః"** అనే పదాలు కూడా పర్యాయాలుగా చేర్చబడినందున, ఆ పదాలలోని అర్థమే కరుణయొక్క అర్థంగా చెప్పాలి. దుఃఖంతో బాధపడేవానిని చూచి,తాను కూడా బాధపడడం - అనుకంప. దుఃఖంతో ఏడ్చేవానిని చూచి తానుకూడా ఏడవడం - అనుక్రోశం - అనేది. లోకంలో అందఱు అంగీకరించవలసిన అర్థం. ఇదే కరుణ అనబడుతుంది. అందువల్ల ఇతరులు పడే దుఃఖాన్ని చూచి, తానుకూడా "అయ్యో! అని దుఃఖాన్ని పొందడం - కరుణ. దానిని చక్కగా తెలిసికొని, ఆవిధంగానే ప్రవర్తించేవాడు శ్రీరాముడు - అని భావం.

ఈ గుణం శ్రీరామాయణంలో పలు చోట్ల కన్పించినా, కొన్న సందర్భాలను మాత్రమే ఇక్కడ ప్రస్తావించి, అనుభవిద్దాం (ఆనందిద్దాం).

## ధర్మమంటే కరుణ-అని పల్కి వివరించడం

దశరథచక్రవర్తి శ్రీరాముని కల్యాణ గుణాలను, అతనికి ప్రజలపట్ల, ప్రజలకు అతనిపట్ల ఉండే అంతు లేని ప్రేమను చూచి, అతనిని యువరాజుగా పట్టాభిషేకం



చేసి, రాజ్యపరిపాలనాలక్ష్మిని అతనికి అప్పగించి, తాను విశ్రాంతి తీసికోవాలని భావించాడు. మంత్రులతో కలసి ఆలోచించి, తన భావాన్ని దృఢం చేసికొని వేగంగానే ఆ పనిని చేసి ముగించాలని తలచి, ఆ దేశంలో ఉండే రాజులను, మహాజనులను అందఱిని పిలిపించి గొప్ప సభను చేశాడు, వారికి తన అభిప్రాయాన్ని ప్రకటించాడు. అపుడు వారందరూ అంతులేని ఆనందాన్ని పొంది, "ఓ ముసలివాడా! నీవు వెళ్ళిపో. శ్రీరామునకే పట్టాభిషేకాన్ని చేయి" అని చాలా పెద్ద ఘోషగా పలికారు. తన కోరికను అందరు ఆమోదించడం చూచి మనస్సులో ఉప్పొంగిపోయిన దశరథుడు, శ్రీరాముని పట్ల సకలజనులకు ఈవిధమైన ప్రేమ నిండి ఉండడానికి గల కారణాన్ని తెలిసిన వాడైనా, వారి నోటితోనే దానిని శ్రావ్యంగా, చెవులారా వినాలని కోరి, వారిని చూచి, "ఓ రాజులారా? మహాజనులారా! నామనస్సులో కల్గిన కోరికను నేనే స్వతంత్రంగా చేసి ముగించ గల్గిన సమర్థుడను. అయినప్పటికీ, మీ అభిప్రాయాన్ని అనుసరించి, నడచుకోవాలని తలచి మిమ్ములను పిలిపించి అడిగాను. అడిగిన వెంటనే మీరు, "ఓ ముసలివాడా! వెళ్ళిపో, ముసలివాడా! వెళ్ళిపో" శ్రీరామునకే పట్టాభిషేకం చేయాలి" అని పెద్ద ఘోషచేసి పల్కడం చూస్తే, నా పరిపాలనలో మీరు అందఱు చాలా కష్టాలను పడినట్లుగా, ఆ కష్టాన్ని ఎపుడు తీర్చుకొంటామా! - అని సమయం కోసం ఎదురు చూస్తూ ఉన్నట్లుగా భావించవలసినట్లుగా ఉన్నదే! "చక్రవర్తి అయిన నీవు నీ ఇష్టానుసారం చేయవచ్చు. మమ్ములను అడగాలా!" అని మర్యాదగా ఒక మాటను పల్కి ఉండవచ్చుగదా! ఆవిధంగా అనకుండా, నాపట్ల చాలా వెగటు స్ఫురించే టట్లుగా పలికారే! దీనికి కారణమేమి?" అని అన్నాడు.

దానిని బదులుగా అందఱు "ప్రభూ! నీలో మేము ఏ దోషాన్ని భావించలేదు. నీవు పొందిన కుమారుడు అంతు లేని సద్గుణాలు నిండినవాడైనందున, అతని కల్యాణగుణాలను పట్ల ప్రీతిని పొందిన మేము అతనిని ప్రభువుగా పొంది అతని పరిపాలనలో సుఖించాలని అభిలషించాము. అతని కల్యాణగుణాలను గూర్చి నీవు వినాలనే కోరిక ఉంటే, పల్కుతాము. రాజా! విను" అని ఉపక్రమించి, శ్రీరాముని కల్యాణగుణాలు పెక్కింటినిగూర్చి పలికే క్రమంలో- **"వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః, ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి"** (అయో.-2-40) అని అన్నారు. ఇతరులు దుఃఖపడం చూస్తే, తాను వారికంటే ఎక్కువగా దుఃఖాన్ని పొందుతాడు, ఇతరులకు ఏదయినా ఆనందం కల్గితే, తాను వారికంటే ఎక్కువగా ఆనందిస్తాడు- అనేది ఈ ప్రస్తావించిన శ్లోకం యొక్క భావం.

ఇతరుల ఆనందం చూచి ఆనందిస్తాడు - అనే విషయం అటు ఉండనీ, ఇతరులు దుఃఖించడం చూస్తే తాను అపరిమితంగా దుఃఖిస్తాడు - అని అన్నారు కదా! ఇదే దయాస్వభావుడైన పురుషుని చాలా గొప్ప స్వభావం. ఇక్కడ శ్రీరాముని కల్యాణ గుణాలనుగూర్చి పల్కడం ఉపక్రమించినపుడు, **"బహవో నృప! కల్యాణ గుణాః పుత్రస్య సంతి తే"** (అయోధ్యా-2-26) (రాజా! నీ కుమారునకు పలు కల్యాణ గుణాలున్నాయి.) అని అంటూ కల్యాణగుణాలనుగూర్చి పల్కు తున్నట్లుగా ఉపక్రమించి వాటిని పల్కుతూ ఆ గుణాల నడుమ పరదుఃఖదుఃఖిత్వ మనే ఈ గుణాన్ని ప్రస్తావించినందువల్ల ఇది చాలా గొప్ప కల్యాణగుణమే తప్ప, దోషం కాదనే విషయం సుస్పష్టం.

కొందఱు, ''దుఃఖపడడం - అనేది ఏరీతిలో అయినా దోషమే కదా'' - అని భ్రమపడి ఆక్షేపిస్తారు. సహస్రనామాలలో **"వికర్తా"** అనే తిరునామానికి భాష్యాన్ని అనుగ్రహించే భట్టర్ వారి భ్రాంతి (అజ్ఞానం) తీరేటట్లు ఆక్షేపపరిహారాన్ని సాక్షాత్తుగా పల్కినందున, ఇక్కడ దానిని గూర్చిన వివరం చేయబడడం లేదు.

అఖిలహేయప్రత్యనీక - కల్యాణగుణనిధి అయిన భగవానుని దుఃఖించే వాడని అనడమే తగదు - అని, దుఃఖపడడం - అనేది హేయగుణమే కాగలదు - అని భావించేవారికి సంగ్రహంగా ఇక్కడ తెల్పుతున్నాను. దుఃఖపడడం అనేది స్వార్థమని, పరార్థమని రెండు విధాలు. తనకొక కష్టం కల్గిందని దుఃఖపడడం - అనేది స్వార్థదుఃఖమనబడుతుంది. ఇతరులకు సంభవించిన కష్టాన్నిగూర్చి దుఃఖ పడడం అనేది పరార్థ దుఃఖమనబడుతుంది. మొదటి దుఃఖాన్ని (స్వార్థ దుఃఖాన్ని) హేయగుణమని భావించినా, రెండవ దుఃఖాన్ని (పరార్థదుఃఖాన్ని) హేయగణంగా భావించడం చాలా భ్రమ. గుణాలలో గొప్పగుణం ఇదే. లోకంలో ఒకడు దుఃఖించే టపుడు, ఆ దుఃఖాన్ని చూస్తున్న వేఱొకడు. తానుకూడా దుఃఖించకుండా ఊరికే ఉంటే, అతనిని రాతిగుండెవాడని నిందిస్తారు. ఇతరులు దుఃఖించడాన్ని చూచి ఒకడు మిక్కిలిగా దుఃఖించేవాడైతే, అతనిని ఆర్ద్రహృదయు డని, కరుణను కలవాడని అంటాము. ఈ వివరణం ఇవి ఇంతవరకు ఎవరిచేత కాదనబడనది. అందువల్ల కరుణ - అనే పదంయొక్క అర్థమైన పరదుఃఖదుఃఖిత్వమనేది చాలా గొప్ప గుణాలలో మొదటిదిగా లెక్కింపబడదగినదే తప్ప, దోషంగా ఎవరిచేత చెప్పబడలేదు. భగవానునిలో ఒక్క గుణాన్నిమాత్రం కాదని మిగిలిన పలు పలు గుణాలను అంగీకరించినా ఉపయోగం లేదు.



అయితే, ఇక్కడ ఒకటి చెప్పవచ్చు. ఇతరులు పడే దుఃఖాన్ని తీర్చగల్గిన శక్తి మనకు లేనందువల్ల, మనం ఇతరుల దుఃఖాన్ని చూచి దుఃఖపడడం సహజం. ప్రణతార్తిహరుడని పేరు పొంది, పరిపూర్ణశక్తియుక్తుడైన భగవానుడు ఇతరుల దుఃఖాన్ని చూచి, తానుకూడా దుఃఖాన్ని పొందడానికి కారణమనేదే లేదు - అని అనవచ్చు. ఇక్కడ అవశ్యం గ్రహించవలసిన విషయాలను స్ఫుటంగా తెల్పుతున్నాను. ఇతరులు పడే దుఃఖాన్ని చూచి దుఃఖాన్ని పొందడం - అనే స్వభావం, ఇతరులు పడే దుఃఖాన్ని తీర్చదగిన శక్తిని కల్గి ఉండడం - అనే స్వభావం-అనే ఈరెండు పరస్పరం విరుద్ధస్వభావాలని భావించరాదు. అశక్తుడే దుఃఖాన్ని పొందుతాడు. శక్తిని కలవాడు దుఃఖాన్ని పొందడు-అని భావించడం అజ్ఞానం. తన బిడ్డలకు ఏదయినా కష్టం కల్గితే దానిని వెనువెంటనే పరిహరించగల్గిన శక్తి తల్లికి ఉన్నప్పటికీ, ఆవిధంగానే ఆ కష్టాన్ని ఆమె తీర్చినప్పటికీ, బిడ్డకు కష్టం కలుగకుండా ముందుగానే రక్షించ వలసినది తన బాధ్యత అయినా, అజాగ్రత్తను - ఏమరుపాటును - పొందానే! - అయ్యో! అన్యాయంగా బిడ్డను బాధపడనిచ్చానే! - అని పలుమార్లు ఆక్రందించి దుఃఖించే రీతిని లోకంలో చూడనివారున్నారా?

దుశ్శాసనుని చేతిలో ద్రౌపది పరాభవాన్ని పొంది, ఆక్రందించినపుడు, శ్రీకృష్ణుడు ఒక రీతిలో ఆమె దుఃఖాన్ని తీర్చినప్పటికీ, ''అయ్యో! ఆమె ఎలుగెత్తి పిలిచినపుడు నేను నేరుగా వెళ్ళి, సహాయపడడలేకపోయానే! అయ్యో! ఆమెకు అవమానం కల్గి ఆమె ఆక్రందించిన తరువాత, నేను సహాయపడ్డానే తప్ప, మును ముందుగానే అవమానం ఆమెకు కలుగని రీతిలో జాగరూకుడను కాకపోయానే! ఆమెకు నేను చాలా పెద్ద ఋణగ్రస్తుడను అయ్యానే! నా జన్మ ఏమయినది? (నిష్ఫలమైనది)'' అని తన కావలిలోని లోటును తలచి, మనస్సులో బాధపడి దుఃఖించిన రీతి ఉన్నది కదా! **"గోవిందేతి యదాక్రందత్ కృష్ణా మాం దూరవాసినమ్, ఋణం ప్రవృద్ధమివ మే హృదయా న్నాపసర్పతి"** (గోవిందా! అని అంటూ దూరం ఉండే నన్ను ఉద్దేశించి ద్రౌపది చేసిన ఆక్రందన ఈనాటికీ నా హృదయం నుండి వడ్డీతో పెరిగిన అప్పువలె తొలగకున్నది) అనేది కదా శ్రీకృష్ణుని సూక్తి.

మడుగు తీరంలో మొసలిచేత బాధను పొందిన శ్రీగజేంద్రాళ్వాన్ దుఃఖాన్ని భగవానుడు తీర్చినవాడైనా, అతడు పడిన పరితాపం మాటకు అందనిది కదా! కూరేశులు, భట్టరేకదా దానినిగూర్చి ప్రస్తావించి, ద్రవించారు. ''అయ్యో! చెడ్డాను!

చెడ్డాను!'' అని బాధపడుతూ భగవానుడు, తన కొప్పు ముడివీడగా, నడుమున వస్త్రం జారగా, పరుగెత్తి వచ్చాడని **(అరై కులైయ త్తలై కులైయ)** అంటారు కదా! ఈవిధంగా పలు వేలసందర్భాలు ఉదాహరించదగినవి ఉన్నాయి. వీటివల్ల పరదుఃఖ దుఃఖిత్వ రూపమైన భగవానుని కారుణికత్వం అవిచాల్యంగా (కాదనడానికి వీలులేనట్లుగా) స్ఫుటపడుతుంది. దీనిని శ్రీరామాయణంలో అనుభవించ దగిన సందర్భాలను చూపిస్తాను. చూడండి.

## వాలి మరణించిన తరువాత శ్రీరాముడు చూపిన కరుణ

శ్రీరాముడు సుగ్రీవునికోసం వాలిని వధించాడు. వాలి మరణించిన తరువాత సుగ్రీవుడు చాలా దుఃఖించాడు. అతని దుఃఖాన్ని చూచి శ్రీరాముడు సహించలేక తాను కూడా అపరిమితంగా, బాధపడి దుఃఖించాడు - అని పలికే వాల్మీకి **"ఇత్యేవ మార్తస్య రఘుప్రవీరః కృత్వా వచో వాల్యనుజస్య తస్య, సంజాతబాష్పః పరవీరహంతా రామో ముహూర్తం విమనా బభూవ"** (ఆర్తిని పొందిన సుగ్రీవుని ఉద్దేశించి ఈవిధంగా పలికిన తర్వాత శత్రువులను సంహరించే ఆ శ్రీరాముడు కన్నీటిని కలవాడై క్షణకాలం మనస్సును కోల్పోయాడు) అని అన్నారు. ఈ శ్లోకంలో **"సంజాతబాష్పః"** అనేది, **"ముహూర్తం విమనా బభూవ"** (క్షణకాలం దుఃఖంతో వివశుడు అయ్యాడు.) అనేది రాతిగుండెను సైతం ద్రవింజేసే మాటలు. సుగ్రీవుని దుఃఖం ఉపశమించినా, శ్రీరాముని దుఃఖం ఉపశమించలేదు- అనే విషయాన్ని **"సంజాతబాష్పః"** అనేది తెల్పుతున్నది. కొందఱు, మనస్సు లోపల ప్రేమలేక పోయినా, బయటకు మాత్రం కన్నీటిని కార్చి దుఃఖాన్ని అభినయిస్తారు. ఆ విధంగా కాకుండా, **"మది ఎల్లామ్ ఉళ్ కలఙ్గి"** (మనస్సంతా కలతచెంది) నిలిచాడు - అనే విషయాన్ని **"రామో ముహూర్తం విమనా బభూవ"** అనే ప్రయోగం తెల్పుతున్నది. తరువాత, ఇరవై అయిదవ సర్గలోని మొదటి శ్లోకం **"సుగ్రీవం చైవ తారాం చ చాంగదం సహలక్ష్మణః, సమానశోకః కాకుత్స్థః సాంత్వయ న్నిద మబ్రవీత్"** (సుగ్రీవుని, తారను, అంగదుని వారికి కల్గిన శోకంవంటి శోకాన్ని కలవాడై లక్ష్మణునితో కూడిన శ్రీరాముడు వారిని ఓదారుస్తూ ఈ మాటలను పలికాడు) అని ఉన్నది. వాలి మరణం వల్ల తారకు, అంగదునకు ఎంత శోకం కల్గిందో, అంత శోకం శ్రీరామునకు కూడా ఉన్నదని ముని అన్నారు - **"సమానశోకః కాకుత్స్థః"** అని అనడంద్వారా. ఆ సర్గం చివరలో కూడా 52వ శ్లోకంలో **"సుగ్రీవేణైవ దీనేన దీనో భూత్వా మహాబలః, సమానశోకః కాకుత్స్థః ప్రేతకార్యాణ్యకారయత్"** (దీనుడైన సుగ్రీవునితోపాటు దైన్యాన్ని పొందినవాడు, అతనితో సమానమైన శోకాన్ని కల్గినవాడైన శ్రీరాముడు వాలికి ప్రేతకార్యాలను సుగ్రీవునిచేత చేయించాడు) అని అంటూ ఆ విషయాన్నే పలికాడు (వాల్మీకి మహర్షి).



## "ఇయం సీతా... సహధర్మచరీ తవ" అనేసూక్తియొక్క వివరణం

ఇంతవరకు ఈవిధంగా **"ఆనృశంస్యం పరో ధర్మః"** (జాలి అనేది గొప్ప ధర్మం) అనే శ్రీరామాయణ ప్రమాణానుసారం **"ధర్మజ్ఞః"** అనేదాని అర్థం వివరింపబడింది. ఇక, **"ఇయం సీతా"** అనే శ్లోకంలో **"సహధర్మచరీ తవ"** అని పల్కిన సూక్తిలోని భావాలకు అనుగుణంగా కొన్ని నిరూపణాలను చేస్తాము. మనం అంతా వివాహం చేసికొనేటపుడు **"ఇమాం కన్యాం ధర్మప్రజార్థం వృణీమహే"** (ఈ కన్యను ధర్మానుష్ఠానంకోసం, సత్సంతానవృద్ధికోసం పరిగ్రహిస్తున్నాను) అని పల్కి కన్యాపాణి గ్రహణం చేస్తాము. మనవంటి వారి ధర్మానుష్ఠానం ఏది? అంటే, గృహస్థధర్మం - అనబడే ధర్మంయొక్క అనుష్ఠానమే. ఈ జీవితానికి సహాయంగా ఉండే భార్యతో కలసి శాస్త్రోక్తాలైన ధర్మాలను గృహస్థాశ్రమంలో ఉండేవారు ఆచరిస్తారు. శ్రీరామునకు సీతాదేవిని జనకచక్రవర్తి కన్యాదానాన్ని చేసేటపుడు **"ఇయం సీతా సహధర్మచరీ తవ"** (శ్రీరామా! నీవు అనుష్ఠించే ధర్మంకోసం ఈ సీత సహచారిణి కాగలదు) అని పల్కి కన్యాదానం చేశాడు. శ్రీరాముడు అనుష్ఠించే ధర్మం ఏది? అనేది గమనించాలి. సీతాదేవి రావణునకు హితోపదేశం చేసేటపడు **"విదిత స్స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః"** (ఆ శ్రీరాముడు శరణాగతవత్సలుడుగా ప్రసిద్ధుడు గదా!) అని అన్నది. శ్రీరాముని ధర్మజ్ఞుడని పల్కి, వెంటనే దానిని వివరించే మాటగా **"శరణాగతవత్సలః"** అని పల్కింది. ఇందువల్ల శ్రీరాముడు ఈ అవతారంలో పరిగ్రహించిన ధర్మం-శరణాగత పరిత్రాణమే. (అంటే - తనను శరణు పొందినవారిని రక్షించడమే) అని స్ఫుటపడు తున్నది. వేదాంత దేశికులు కూడా దశావతారస్తోత్రంలోని శ్రీరామావతారాన్ని స్తుతించే శ్లోకంలో **"సర్వావస్థ సకృత్ప్రపన్న జనతాసంరక్షణైకవ్రతీ, ధర్మో విగ్రహవాన్"** (ఏ అవస్థలో ఉన్నవాడైనా, అతడు ఒక్కసారి ప్రపత్తిని చేస్తే అతనిని రక్షించడమనే అద్వితీయ వ్రతాన్ని కలవాడు, ధర్మమే మూర్తీభవించినవాడు.) అని ఈ మర్మాన్ని వ్యక్తంచేశారు.

ప్రపన్నజనసంరక్షణమే శ్రీరామునకు పరమధర్మం. ఈ ధర్మానికి సహాయకురాలుగానే సీతాదేవి ఉన్నది. అందువల్లనే తిరుమంత్రార్థం (ముముక్షుప్పడి) లో

శ్రీపిళ్ళైలోకాచార్యులవారు **"రక్షిక్కుమ్పోదు పిరాట్టిసన్నిధి వేణ్డుకైయాలే ఇదిలే శ్రీసంబంధ మనుసంధేయమ్"** (రక్షించేటప్పుడు లక్ష్మీసాన్నిధ్యం ఆవశ్యకం కనుక ఇందులో లక్ష్మీసంబంధాన్ని అనుసంధించుకోవాలి.) అని, **"ఇవళ్ సన్నిధియాలే కాకమ్ తలై ప్పెఱ్ఱదు, అదిల్లామైయాలే రావణన్ ముడిన్దాన్"** (ఈమె సాన్నిధ్యంవల్ల కాకా సురుడు బతికాడు, అది లేనందువల్ల రావణుడు నశించాడు.) అని అనుగ్రహించారు. ఇది శ్రీరామాయణంలో పలు సందర్భాలలో గోచరిస్తుంది. **"కంబరామాయణం - వాలివదప్పడలమ్"** లోని ఒక పాశురంతో ఇది నిరూపింపబడుతున్నది.

## కంబుని పాశురం తెలిపే సీతాదేవి మహత్త్వం

**కోవియల్ తరుమ ముజ్ఞళ్ కులత్తుదిత్తార్‌కట్కెల్లామ్**
**ఓవియ త్తెళుద వొణ్ణా ఉరువత్తాయుడైమై యన్నో**
**ఆవియై చ్చనకన్ పెఱ్ఱ వన్నత్తై అమిళ్ తిన్ వన్ద**
**తేవియై ప్పిరిన్ద పిన్నై త్తికైత్తనైప్పోలుమ్ శెయ్‌కై**

ఈ పాశురం మాధుర్యమే మూర్తీభవించినట్లున్నది. సీతాదేవి సమీపంలో లేనందు వల్లనే శ్రీరాముడు వాలివధను చేయడం జరిగింది - అనే తత్త్వం ఇక్కడ స్థాపింప ఈ పాశురంలో **"తేవియై ప్పిరిన్ద పిన్నై త్తికైత్తనైప్పోలుమ్ శెయ్‌కై"** (సీతాదేవిని విశ్లేషించిన తర్వాత నీవు చేసిన పనులన్నీ తికమకగా ఉన్నాయి.) అనేది శ్రీరామాయణ సముద్రంలో మిక్కిలి ముఖ్యంగా గ్రహించదగిన మహారత్నంవంటి ఒక సంప్రదాయార్థాన్ని తెల్పుతున్నది. దానిని కొంచెం వివరిస్తాము. భగవద్గీతలో శ్రీకృష్ణుడు తన అవతార ప్రయోజనాన్ని గూర్చి పలికేటపుడు - **"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్"** (సాధువులను రక్షించడం కోసం, దుర్మార్గులను నశింపచేయడం కోసం.) అని అన్నాడు. సాధువులను సంరక్షించడం, దుష్టులను సంహరించడం- అనే కృత్యాలను అవతారానికి ప్రయోజనాలుగా పలికాడు. ఈ రెండు కృత్యాలను గూర్చి శ్రీరామావతారంలో గమనిద్దాం. ఇందులో అరుదైన ఒక గొప్ప విశేషం తెలుస్తున్నది. అది ఏమి? అంటే, సీతాదేవి శ్రీరామునితో కలసి ఉన్న కాలంలో ఎటువంటి అపరాధులకైనా వినాశం కలుగలేదు. శ్రీరాముడామెను విడచి ఉన్న సమయంలోనే అపరాధంలో తక్కువగా ఉండేవారిని కూడా వధించాడు - అనేదే. ఇది శ్రీరామాయణంలో ఆదినుండి అంతంవరకు గల కథలవల్ల చక్కగా తెలుస్తున్నది.



## శ్రీరాముడు చేసిన వధలు సీతాదేవి లేని సమయంలోనే

శ్రీరాముడు ప్రప్రథమంగా చేసినది తాటక, సుబాహువు మొదలైన రాక్షసుల యొక్క వధ. మునుముందుగా స్త్రీ వధను చేశాడనే అపవాదం ఈనాటికీ తీరలేదు. అటువంటి వధను చేసిన కాలంలో శ్రీరామునకు సీతాదేవితో సంబంధం లేదు. బ్రహ్మచారిగా ఉండేటపుడు కదా **"మత్తై మునివేళ్వి"** (విశ్వామిత్ర మునియాగాన్ని) ని రక్షించాడు. అపుడు సీతాదేవి సమీపంలో ఉండి ఉంటే తాటకావధ సంభవించి ఉండేది కాదు. ఆమె సమీపంలో లేనందువల్లనే శ్రీరాముడు "స్త్రీవధ" - అనికూడా చూడకుండా తాటకా వధను చేయడం జరిగింది.

తరువాత, మిథిలాపురికి వెళ్ళి, సీతాదేవిని వివాహమాడాడు. అప్పటి నుండి సీతాదేవితో కలసి ఉండేవరకు ఏవిధమైన వధ జరుగలేదు. (కాకాసురుని వంటి) తీవ్రమైన అపరాధం చేసినవారికికూడా రక్షణ జరిగినదే తప్ప, వధ అనేది ఎవరికీ సంభవించలేదు. ఈ విషయాన్నిగూర్చి కొందఱు పలికే ఆక్షేపణలను ప్రస్తావించి, వానిని పరిహరిస్తాము.

## విరాధవధలోని మర్మాన్ని తెలియజేయడం

విరాధుడనే రాక్షసుని సంహరించినది - శ్రీరాముడు, సీతాదేవి కలసి ఉండే సమయంలోనే కదా!

ఖరుడు, దూషణుడు మొదలైన పధ్నాలుగు వేలమంది రాక్షసులవధ కూడా సీతాదేవితోకూడి ఉండేకాలంలోనేకథా సంభవించింది. అందువల్ల, సీతాదేవి సమీపంలో ఉండేటపుడు శ్రీరాముడు ఎవరినీ వధించలేదు - అని అనడం ఏవిధంగా పొసగుతుంది? - అని కొందఱు ప్రశ్నించవచ్చు. వారికి బదులు పల్కుతున్నాము. విరాధుని ప్రస్తావం ఆరణ్య కాండలోని రెండవ సర్గలో వస్తుంది. అక్కడ కథాగమనాన్ని గూర్చి జాగ్రత్తగా గమనించాలి.

విరాధుడు వచ్చిన వెంటనే సీతాదేవిని వధించాలని చూచాడు. తర్వాత ఆమెను విడచిపెట్టి, శ్రీరాముని, లక్ష్మణుని మోసికొని పోయి అరణ్యంలో వేఱొక చోటికి వెళ్ళాడు. అపుడు సీతాదేవి తాను ఒంటరిగా ఉన్న విషయాన్నిగూర్చి విలపించింది. ఈ విషయం అరణ్యకాండం మూడవ సర్గ చివరలోను, నాల్గవ సర్గ ఆరంభంలోను స్పష్టంగా ఉన్నది. సీత, తనను ఒంటరిగా విడచి పెట్టి, శ్రీరామలక్ష్మణు

లను విరాధుడు వేఱొక అరణ్య ప్రాంతానికి మోసికొని వెళ్ళినపుడు, "ఓ రాక్షసా! నన్ను ఎఱ్ఱ కుక్కలు, పులులు, చిఱుతలు చంపి తినివేస్తాయి! వారిద్దరిని విడచిపెట్టి నన్ను నీవు తీసికొని పోకూడదా!" అని ఆక్రందించింది. ఇందువల్ల విరాధవధ చేయబడిన కాలంలో, చేయబడిన చోట సీతాదేవి సాన్నిధ్యం లేదు- అనేది స్పష్టంగా తెలుస్తున్నది.

ఇక్కడ ఇంకొక విషయం ముఖ్యంగా గమనించవలసినది ఉన్నది. శ్రీరామ లక్ష్మణులు విరాధుని ఎంతగా బాధించినా అతడు చావలేదు. దీనిని వాల్మీకి మహర్షియే పలికాడు. **"స విద్ధో బహుభి ర్బాణైః ఖడ్గాభ్యాం చ పరిక్షతః, నిష్పేష్టో బహుధా భూమౌ న మమార స రాక్షసః"** అని అన్నాడు. పలు బాణాలను ప్రయోగించినా, ఇద్దఱు రెండు కత్తులతో నఱికినా, భూమిపై పడదోసి పలుమార్లు గుద్దినా కూడా ఆ రాక్షసుడు మరణించలేదు - అనేది ఈ ప్రస్తావించిన శ్లోకంలోని భావం. తరువాత అతడు ఏ రీతిలో మరణించాడంటే -

అతడు తన వృత్తాంతాన్ని గూర్చి తానే పల్కుతూ, "శ్రీరామా! ఇపుడు నీచే నేను ఒక శాపంనుండి విడువబడినవాడనయ్యాను. భూమిలో గోయి తవ్వి దానిలో నన్ను తోసి పూడ్చి పెట్టు"అని అన్నాడు. తరువాత ఆ విధంగానే చేయబడింది. దీనివల్ల విరాధుడు తన వధను తానే కోరి చేయించుకొన్నాడు - అనేది తెలుస్తున్నది. ఇదికూడా సీతాదేవి సమక్షంలో జరుగలేదు - అనేది తెలుస్తున్నది. అందువల్ల విరాధ వధ వృత్తాంతాన్ని ఉదాహరిస్తూ చేసే ఆక్షేపం పస లేనిది - అని నిరూపింపబడింది.

## ఖరదూషణాదుల వధలోని మర్మాన్ని వివరించడం

ఇక, సీతాదేవి సమక్షంలోనే ఖరదూషణాదుల వధ జరిగింది - అనే ఆక్షేపానికి పరిహారాన్ని వినండి. జనస్థానంలోని రాక్షససేనలు శ్రీరాముని వద్దకు వచ్చినపుడు, శ్రీరాముడు లక్ష్మణుని చూచి పల్కిన మాట ఏమంటే - "లక్ష్మణా! నీవు వింటిని, బాణాలను తీసికొని, సీతతో ఆవలకు పో. అదిగో, వృక్షాలతో ఆవరింపబడి, ప్రవేశించ డానికి వీలుకాకుండా ఉండే గుహలోపలకు సీతను తీసికొని పోయి, అక్కడ ఆమెను కాపాడుతూ ఉండు. ఆలస్యం చేయకుండా వెంటనే వెళ్ళు. ఇంతమంది రాక్షసులను నీవు సంహరించగల్గినా, ఇపుడు నేనే వీరిని అందఱిని వధిస్తాను. నీవు ఈ చోటును విడచి బయలుదేరివెళ్ళాలి", అని అన్నాడు. ఆ తరువాత, లక్ష్మణుడు సీతతోపాటు



బయలుదేరి వెళ్ళి గుహలోపల ప్రవేశించిన తరువాతనే, శ్రీరాముడు కవచాలను, ధరించి, వింటిని, బాణాలను గ్రహించి, యుద్ధానికి పోయాడు - అని ఆరణ్యకాండ లోని ఇరవై నాల్గవ సర్గలో చెప్పబడింది. **"తస్మాత్ గృహీత్వా వైదేహీం చాపబాణీ ధనుర్ధరః, గుహ మాశ్రయశైలస్య దుర్గాం పాదపసంకులామ్, ప్రతిపాలితు మిచ్ఛామి న హి వాక్యమిదం త్వయా, శాపితో మమ పాదాభ్యాం గమ్యతాం వత్స! మా చిరమ్, "తస్మిన్ ప్రవిష్టే తు గుహాం లక్ష్మణే సహ సీతయా"** ఇత్యాది వాల్మీకి శ్లోకాలు గమనించ దగినవి. దీనినిబట్టే శ్రీవేదాంతదేశికులు రఘువీరగద్యలో ఖరవధను పలికే ప్రకరణంలో **"అసహాయశూర"** అని అన్నారు. అందువల్ల, సీతాదేవి సన్నిధానం లేనిచోటనే ఖరదూషణాదుల వధ జరిగింది - అనేది వ్యక్తమవుతున్నది.

## మారీచవధలోని అరుదైన ఒక రహస్యం

దీనికి తరువాత, మారీచవధ జరిగింది. అపుడు సీతాదేవిని విడచిపెట్టి శ్రీరాముడు మారీచుని వెంట చాలా దూరం వెళ్ళాడు - అనేది అందఱు తెలిసిన విషయం. అతనిని వధించగోరినందున, సీతాదేవి సమీపంలో ఉంటే అతడు వధింపబడడు కనుక, ఇందుకోసమే, అతనిని చాలా దూరం శ్రీరాముడు తీసికొని పోయాడు - అనే మర్మం ఇక్కడ గమనించదగినది.

## శూర్పణఖాభంగంలోని మర్మం

విరాధవధకు, ఖరదూషణాదుల వధకు మధ్యలో శూర్పణఖాభంగం జరిగింది. శ్రీరాముడు తాటకను వధించినట్లుగా శూర్పణఖనుకూడా వధించి ఉండవచ్చు. ఆ విధంగా చేయలేదు. అంగభంగాన్ని చేసి, ఆమెను ప్రాణాలతో విడచిపెట్టినందు వల్ల కదా ఆమె లంకకు చేరి, మొఱపెట్టి, సీతాపహరణానికి కారణమైనది. ఆమెను పంచవటిలోనే వధించి ఉంటే చాలా మంచిదై ఉండేదికదా! సమర్థుడైన శ్రీరాముడు ఎందువల్ల ఆ పనిని చేయలేదు? - అని ప్రశ్నిస్తే, సీతాదేవి సమీపంలో ఉండడమే దీనికి అంతరాయమైనది - అనేది ముఖ్యహేతువు.

ముఖ్యహేతువు - అని అన్నందున, అముఖ్యమైన హేతువు ఒకటి ఉన్నదని తెలుస్తున్నదే! అది ఏది? అంటే, తాటకావధను, విశ్వామిత్రముని ఆజ్ఞాపించినందున చేశాడు. ఆ విధంగా శూర్పణఖయొక్క వధను ఆజ్ఞాపించడానికి ఎవరూ లేనందువల్ల అది సంభవించలేదు - అనేదే (అముఖ్యమైన హేతువు). ఇదికూడా ఒక సమాధానం- అని పల్కినా, సీతాదేవి సమీపంలో ఉండడమే తాటకను వధించకపోవడానికి ముఖ్యకారణం - అని గ్రహించాలి.

## వాలివధలోని విశేషమర్మం

సీతాదేవి శ్రీరాముని విశ్లేషించి, లంకలో ప్రవేశించిన తరువాత, వాలివధ అనే చాలా పెద్ద కార్యం సంభవించింది. ఇది (వాలివధ) న్యాయమా? అన్యాయమా? అనే విచారణ ఈనాటికీ ఆగకుండా అనువర్తిస్తూనే ఉన్నది. శ్రీవేదాంతదేశికులు సంకల్పసూర్యోదయంలో **"నిరవధిగుణగ్రామే రామే"** అనే శ్లోకంలో దీనిని ప్రస్తావించాడు. వాలివధ న్యాయమైనదే - అని పండితులు ఎంతగా యుక్తియుక్తాలైన సమాధానాలను పల్కినా, వాటిని అంగీకరించడం మిట్టగానే (అసంభవంగానే) కన్పిస్తున్నది.

నన్ను నీవు ఏవిధంగా సంహరించావు? - అని బలంగా ఆక్షేపించిన వాలియే తనను వధించడానికి బలమైన కారణం ఉండడాన్ని గమనించి, దానిని తానే పల్కినట్లుగా కంబకవి పలికారు. **"తేవియై ప్పిరిన్దపిన్నై త్తికైత్తనై పోలుమ్ శెయ్కై"** అనేదే - అది. "శ్రీరామా!" ఇపుడు సీతాదేవి నీ సమీపంలో ఉండి ఉంటే అన్యాయ మైన ఈ వధను నీవు చేసి ఉండవు. ఆమె సమీపంలో లేకపోవడంవల్లనే దీనిని చేయాలని నిశ్చయించుకొన్నావు" అని వాలి పల్కినమాట చాలా యుక్తి యుక్తంగా ఉన్నది కదా! ఇది ఒక చమత్కారమైన మాట కావచ్చు - అని భావించకుండా, ఇదే పరమార్థం - అని భావించదగినది కదా! సీతాదేవి సమీపంలో ఉండేటపుడు జరిగిన కొన్ని సందర్భాలను గమనిద్దాం.

## కాకాసురుని రక్షించిన వృత్తాంతంలోని రహస్యాలు

శూర్పణఖావృత్తాంతం ఇంతకు ముందు తెలుపబడింది. దానికి ముందు సంభవించిన కాకాసురకథను గమనిద్దాం. ఇది చిత్రకూటపర్వత సానువులలో సంభవించింది. అయోధ్యాకాండలో తెలుపబడివలసిన కథ ఇది. అయితే, ఇది అక్కడ చెప్పబడలేదు.

సుందరకాండలోని ముప్పై ఎనిమిదవ సర్గలో సీతాదేవి హనుమానుని వద్ద గుర్తుగా చెప్పి పంపినట్లుగా ఈ వృత్తాంతం కూర్చబడింది. అక్కడ చెప్పబడిన రీతి ఏది? అంటే, "హనుమా! పూర్వం చిత్రకూటంలోని ఈశాన్యమూలలో గల కొండచరియలో ఒక ఏకాంత ప్రదేశంలో నివసించేటపుడు, ఒక వృత్తాంతం జరిగింది. ఒకానొక సమయంలో నేను శ్రీరామునితో క్రీడించి, అలసి శ్రీరాముని ఒడిలో కూర్చుని ఉండగా, ఒక కాకి, మాంసంపై గల ఆశతో నా వక్షఃప్రదేశంలో ముక్కుతో పొడిచింది. నేను దానిని ఎన్నిమార్లు ఎంతగా అదిలించినా అది వెళ్ళిపోకుండా నా స్తనాలను గుచ్చి ఎక్కడికో ఎగిరిపోయింది. దానిని చూచి, శ్రీరాముడు నాకు పరిచర్య చేయగా, నేను లజ్జను, కోపాన్ని పొందాను. తర్వాత అలసట పొంది శ్రీరాముని ఒడిలో పరుండి నిద్రించాను.

నిద్రనుండి నేను లేచిన తరువాత, శ్రీరాముడు నా ఒడిలో పరుండి నిద్రించాడు. అపుడు ఆ కాకి మళ్ళీ అక్కడకు వచ్చి నా వక్షస్సులో మిక్కిలిగా గీఱి గాయ పరచింది. ఆ గాయనుండి కారిన రక్తంతో శ్రీరాముడు తడసిపోయాడు. అపుడు నాచే నిద్రలేపబడిన శ్రీరాముడు నా బాధను చూచి వానిపై చాలా కోపించి తన దర్భాసనం నుండి ఒక దర్భను తీసికొని, దానిని బ్రహ్మాస్త్రమంత్రంతో అభిమంత్రించి, ఆ కాకిపై ప్రయోగించాడు. ఆ కాకి ఇంద్రుని కుమారుడు. అతనిని ఆ బ్రహ్మాస్త్రం ఆకాశంలో తఱిమి వెంటాడింది. ఆ కాకి తనను ఎవరైనా కాపాడగలరా!- అని ముల్లోకాలలో తిరిగింది. తల్లి, తండ్రి దేవతలు, మునులు మొదలైన అందఱు అతనిని విడచి పెట్టినందున చివరకు శ్రీరామునివద్దకే వచ్చి చేరింది. శరణ్యుడైన శ్రీరాముడు కరుణతో దానిని చంపకుండా విడచిపెట్టాడు. అయినా, తాను ప్రయోగించిన బ్రహ్మాస్త్రం వ్యర్థం కారాదు కనుక, ఆ కాకి కోరిక ప్రకారం, దాని కుడి కంటిని గుడ్డిగా చేసి, దానిని ప్రాణాలతో విడచిపెట్టాడు. తరువాత కాకి తన నివాసం చేరింది" - అని సీతాదేవి పల్కినట్లుగా చెప్పబడింది.

## కాకిని రక్షించిన వృత్తాంతంలోని పురాణభేదనిరూపణం

ఈ వృత్తాంతం పద్మపురాణంలో కొంచెం మార్పుతో తెలుపబడింది. **"న చాభ్యుపారమన్ మాంసార్థీ బలిభోజనః...... పక్షకృంతేన కాకేన"** అని శ్రీరామాయణంలో కాకి మాంసభక్షణలోని ఆశవల్ల వచ్చినదని తెలుపబడింది. పాద్మపురాణంలో **"స దృష్ట్వా జానకీం తత్ర కందర్పశరపీడితః, విదదార నఖై స్తీక్ష్ణైః పీనోన్నతపయోధరామ్"** (అతడు జానకిని చూచి మన్మథుని బాణాలచే పీడింపబడినవాడై, ఉన్నతమైన, బలిష్ఠమైన వక్షస్సును కల ఆమెను తన పదునైన ముక్కుతో పొడిచాడు.) అని అంటూ కాకి కూడా రావణునివలె కామపీడితుడై వచ్చి అపచారం చేశాడని తెలుపబడింది.

ఈ వృత్తాంతాన్ని సీతాదేవి తానే హనుమానునితో పలికేటపుడు కామపీడితుడై వచ్చాడని చెప్పడానికి సిగ్గుపడి, మాంసార్థియై వచ్చాడని మఱుగుపరచి చెప్పినదని భావించే అవకాశం ఉన్నది.

అంతేకాక, సీతాదేవితానే కాకి తలను ఎత్తి శ్రీరాముని పాదాలతో చేర్చి, అది శరణాగతి చేసినట్లుగా చూపి, "ఇతనిని రక్షించాలి" అని శ్రీరాముని ప్రార్థించినట్లుగా పద్మపురాణంలో స్పష్టంగా తెలుపబడింది. అక్కడ ఉండే శ్లోకాలు ఇవి - **"పురతః పతితం దేవీ ధరణ్యాం వాయసం తథా, తచ్ఛిరః పాదయో స్తస్య యోజయామాస జానకీ, ప్రాణసంశయ మాపన్నం దృష్ట్వా సీతాథ వాయసమ్, త్రాహి త్రాహీతి భర్తార మువాచ దయయా విభుమ్"** (తమ ముందు భూమిపై పడిన కాకాసురుని చూచి సీతాదేవి అతని శిరస్సును శ్రీరాముని పాదాలవద్దకు చేర్చింది. ప్రాణభీతిని పొందిన ఆ కాకాసురుని చూచి దయగలిగినదై సీతాదేవి రక్షించు! రక్షించు! అని భర్తతో పల్కినది.)

ఈ యథార్థాన్ని సీతాదేవి (శ్రీరామాయణంలో) చెప్పక పోవడం ఎందువల్ల? అని అంటే, అక్కడ తన గొప్పతనాన్ని చెప్పుకోవలసిన ఆవశ్యకత లేనందువల్లనే కదా! వాయసాన్ని రక్షించేటట్లుగా నేనేకదా చేశాను - అని అక్కడ పల్కడంలో స్వారస్యం లేదు కదా! అయినా, ఒక విధంగా సూచించింది. ఏవిధంగా? అంటే, **"వధార్హ మపి కాకుత్థ్సః కృపయా పర్యపాలయత్"** (వధింపబడవలసినవాడైన కాకాసురుని కూడా కృపతో రక్షించాడు.) అనే సూక్తిలోని **"కృపయా"** అనే పదం గమనార్హం. శ్రీరాముడు తన కృపతోనే రక్షించాడు - అనేది ఇక్కడ పైపైన స్ఫురించే అర్థం. **"కృపా"** అనేది సీతాదేవికి వాచకం. **"లక్ష్మ్యా సహ హృషీకేశః దేవ్యా కారుణ్యరూపయా"** (హృషీకేశుడు కరుణాస్వరూపని అయిన లక్ష్మితో కూడినవాడై రక్షకుడు అవుతున్నాడు.) అని, **"అనుగ్రహమయీం వందే నిత్యమజ్ఞాత నిగ్రహామ్"** (అనుగ్రహ స్వరూపిణి, ఏనాడూ నిగ్రహించడం తెలియనది అయిన లక్ష్మికి నమస్కరిస్తున్నాను.) అని సీతాదేవిని కృపయే మూర్తీభవించినట్లుగా చెప్పబడింది కదా! అందువల్ల **"కృపయా పర్యపాలయత్"** అని సీతాదేవి పల్కినది "శ్రీరాముడు కాకిని వధించకుండా కాపాడడం నావల్లనే" అని వ్యంగ్యంగా తెలిపిన విధమే. దీనిని మనస్సులో పెట్టుకొనియే తిరుమంత్రంలో శ్రీపిళ్ళై లోకాచార్యుల వారు **"ఇవళ్‌సన్నిధియాలే కాకమ్ తలై పెర్ఱదు"** (ఈమె సాన్నిధ్యంవల్ల కాకాసురుడు బతికాడు.) అని పలికారు.

## కాకి బ్రతికినది సీతాసాన్నిధ్యంవల్లనే

సీతాదేవి విషయంలో కాకాసురుడు చేసిన అపరాధం గొప్పదా! లేక, రావణుని అపరాధం గొప్పదా? - అని విచారించి చూచినపుడు, రావణుని అపరాధం చిన్నది,



కాకాసురుని అపరాధం చాలా పెద్దది - అని నిర్ణయించడంలో అడ్డులేదు. సీతాదేవి తిరుమేనిని బాధించి, రక్తప్రవాహం స్రవించే రీతిలో మహాపరాధాన్ని రావణుడు చేయలేదు కదా! దీనిని శ్రీమణవాళమహామునులు కూడా తిరుమంత్రార్థంలో స్పష్టంగా తెలియజేశారు. సీతాదేవిని అపహరించుకొనిపోయిన రావణుడు శ్రీరామునితో యుద్ధం చేసేటపుడుకూడా సీతాదేవిని అశోకవనంలో ఉంచకుండా, తన దగ్గరలోనే పెట్టుకొని యుద్ధంచేసి ఉంటే, కాకాసురునివలె అతడు కూడా జీవనాన్ని పొంది ఉజ్జీవించి ఉండేవాడు- అని మన ఆచార్యుల దృఢమైన నమ్మిక. అందువల్లనే **"ఇవళ్ సన్నిధియాలే కాకమ్ తలైప్పెర్ఱదు"** అని పల్కిన వెంటనే, **"అదిల్లామైయాలే రావణన్ ముడిన్దాన్"** (ఈమె సాన్నిధ్యం వల్ల కాకాసురుడు బతికాడు, అది లేనందు వల్ల రావణుడు మరణించాడు) అని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అన్నారు.

సీతాదేవి అక్కడ ఉన్నంతమాత్రంతో సరిపోతుందా? శరణాగతి చేస్తే కదా శ్రీరాముడు రక్షిస్తాడు. కాకాసురుడు శరణాగతి చేసినందువల్లనే కదా ప్రాణాలను పొందింది. **"ద్విధా భజ్యేయ మప్యేవం న నమేయం తు కస్యచిత్"** (నన్ను రెండుగా చీల్చినా నేను ఎవరికీ నమస్కరించను.) అని అంటూ ఎవరికీ తలవంచి నమస్కరించను - అని ఖండితంగా పలికే రావణుడు శరణాగతిని చేయడు కదా! అటువంటివానికి దగ్గరే సీతాదేవి ఉంటే మాత్రం ఏమి ప్రయోజనం?- అని ఈ విధంగా కొందఱు అడగవచ్చు.

## కాకాసురుడు జీవనాన్ని పొందినది సీతవల్లనే

వారికి సమాధానం పల్కుతున్నాము. కాకాసురుడు శరణాగతిని చేసినందు వల్లనే ప్రాణాలను పొందింది - అని భావించడం తగనిది. కాకి ముల్లోకాలను తిరిగినా, ఎక్కడా కాలు మోపి నిలిచే అవకాశం పొందకుండా, రక్షణను పొందలేక, కిందకు వచ్చి పడింది, అంతే తప్ప శ్రీరాముని వద్ద శరణాగతి చేయాలనే ఉద్దేశ్యంతో రాలేదు. **"పురతః పతితం దేవీ ధరణ్యాం వాయసమ్"** అని పాద్మపురాణంలో స్పష్టంగా చెప్పబడింది.

## కాకాసురుడు శరణాగతిని చేశాడా?

శ్రీరామాయణంలో **"స తం నిపతితం భూమౌ"** అని కాకాసురుడు నిలువలేక భూమిపై పడిపోయాడు - అని అంతమాత్రమే చెప్పబడింది. ఆళవందార్ స్తోత్రంలో

**"రఘువర! యదభూస్త్వం తాదృశో వాయసస్య ప్రణత ఇతి దయాళుః"** (శ్రీరామా! అంటువంటి చెప్పరాని అపచారాన్ని చేసిన కాకాసురుని విషయంలో అతడు నమస్కరించాడు అనే వ్యాజంతో అతని పట్ల దయగల్గినవాడవు అయినావు.) అనేచోట వ్యాఖ్యానంలో శ్రీవేదాంతదేశికులు కాకాసురుడు నమస్కరించి శరణాగతి చేయలేదు- అని, కరుణాకాకుత్స్థుని అభిప్రాయానుసారంగా అతడు శరణాగతుడని భావింప బడ్డాడని స్పష్టంగా తెలుపబడింది. **"ఎత్తిశైయుమ్ ముఱ్ఱోడి యిళైత్తు వీழ்ఱమ్ కాకమ్ పోల్"** (అన్ని దిక్కులలోను పరిభ్రమించి అలసి క్రిందపడిన కాకాసురునివలె) అని చెప్పబడింది కదా! అలసి సొలసి వచ్చి పడ్డాడు, అంతే తప్ప, శరణాగతి చేయలేదు - అనేదే దీని తాత్పర్యం.

### శరణాగతియొక్క యథార్థతత్త్వం

ఈ రహస్యాన్ని కొంచెం ఇక్కడ వివరిస్తాను. శరణాగతి అంటే ఏమి? అని విమర్శించి చూచినపుడు, దానినిగూర్చి పలువురు పలు రీతులలో పలికారు. భగవానుడు చేయ దలచిన రక్షణకు అడ్డుగా జీవుడు తాను చేసే ప్రవృత్తినుండి విరమించి నిలువడమే శరణాగతి - అనేది ఒక వివరణం. ఇటువంటి శరణాగతియే కాకాసురుని విషయంలో గమనించవచ్చు. ఇందుకోసమే శ్రీరాముడు కాకాసురునకు ప్రాణభిక్షను పెట్టాడు.

### కాకాసురునకు, రావణునకు మధ్య గల తారతమ్యం

ఈ విధంగా శరణాగతినిగూర్చి అనడం వల్ల రావణునివద్ద కూడా ఈవిధంగా పలుకడానికి అడ్డు లేదు. ఏవిధంగా? అంటే, **"ఇన్ఱు పోయ్ నాళై వా"** (ఈనాటికి పోయి, రేపు రా) అనిపల్కి, రావణునకు శ్రీరాముడు నియమనాన్ని ఇచ్చినపుడు, రావణుని స్థితి కాకాసురుని స్థితిలో సమానమైనది కదా! **"చచాల చాపం చ ముమోచ వీరః"** (వీరుడైన రావణుడు మిక్కిలి చెలించాడు, వింటిని కూడా విడచిపెట్టాడు) అనే రీతిలో ఏమీ తెలియని నిశ్చేష్టుడైన స్థితి కదా.

ఈ విధంగా కాకాసురుని విషయంలో శరణాగతి - అని చెప్పదగిన స్థితి ఏది కన్పిస్తున్నదో, అది రావణుని విషయంలోకూడా కన్పిస్తున్నందున, మహాపరాధి అయిన కాకాసురునే కాపాడిన శ్రీరాముడు అంతటి అపరాధం లేనివాడైన రావణుని తప్పక రక్షించే ఉండాలి. మఱి, ఎందుకు రక్షించలేదు? అని అంటే, సీతాదేవి సమీపంలో ఉండడం - అనే స్థితి కాకాసురునకు ఉన్నది. అది రావణునకు లేదు. అందువల్లనే రక్షించలేదు - అని అనడంలో కొఱత లేదు.



ఈ విధంగా, ఏతావన్మాత్రమైన నిరూపణంద్వారా సీతాదేవి రావణునకు ఉపదేశించిన హితవచనాలలో **"ధర్మజ్ఞః శరణాగతవత్సలః"** అని పల్కిన మాటవల్ల సీతావివాహకాలంలో **"మమ సుతా సహధర్మచరీ తవ"** (నా కుమార్తె నీకు సహధర్మ చారిణి) అని జనక చక్రవర్తి పల్కిన మాటవల్ల తేలిన సారార్థం విశదం చేయబడింది.

## 4. కః కృతజ్ఞః (కృతజ్ఞుడెవడు?)

వాల్మీకి - నారద సంవాదంలో ఇది నాల్గవ ప్రశ్న. 1) గుణవంతుడెవడు? 2)వీర్యవంతుడెవడు? 3) ధర్మజ్ఞుడెవడు? - అనే మూడు ప్రశ్నలు గతార్థాలు. కృతజ్ఞుడెవడు? అనే ఈ నాల్గవ ప్రశ్న ఇక వివరింపబడుతున్నది.

### కృతఘ్నుని క్రూరత్వం :

చేసిన మేలును మఱువనివానికి కృతజ్ఞుడని పేరు. మానవులకు ఉండదగిన గుణాలలో ఈ గుణమే ప్రాథమ్యాన్ని పొందుతున్నది. **"ఎన్నన్ఱి కొన్ఱార్క్కుమ్ ఉయ్వుణ్డామ్, ఉయ్విల్లై శెయ్న్నన్ఱి కొన్ఱ మకఱ్కు"** (ఏ పాపానికైనా ప్రాయశ్చిత్తం ఉన్నది. కాని కృతఘ్నతకు మాత్రం ఏ ప్రాయశ్చిత్తం లేదు.) అని కుఱళ్ పల్కింది. సంస్కృత భాషలోని గ్రంథాలుకూడా **"కృతఘ్నే నాస్తి నిష్కృతిః"** (కృతఘ్నునకు నిష్కృతి లేదు.) అని ఘోషిస్తున్నాయి. అన్ని పాపాలకు ప్రాయశ్చిత్తాలతో నిష్కృతి ఉన్నది. చేసిన మేలును మఱువడం- అనే (కృతఘ్నత - అనే) పాపానికి మాత్రం ప్రాయశ్చిత్తమనేది లేనే లేదు - అని సంస్కృత గ్రంథాలు, ద్రావిడ గ్రంథాలు ఏకకంఠంగా పల్కుతున్నాయి.

### శ్రీదేశికుల సంకల్పసూర్యోదయశ్రీసూక్తి :

సంకల్ప సూర్యోదయనాటకంలో శ్రీవేదాంత దేశికులు ఈ విషయాన్ని గూర్చి కొంచెం వివరించి, చాలా ఆశ్చర్యకరంగా పలికారు. అక్కడ పల్కిన శ్లోకం మిక్కిలి మధురం. దాని అర్థం వినండి. ఇతరులు చేసిన మేలును మఱచిపోవడం - అనే అవధిలో నిలువకుండా ఉపకారాన్ని చేసినవారికి బదులుగా అపకారాలను చేసేవాడు కృతఘ్నుడని అనబడుతున్నాడు. ఏనాడో చేసి చాలా కాలం గడచిన ఉపకారాలను మఱచిపోవడం అనేది ఉండ నివ్వండి. చేస్తూ ఉండే ఉపకారాలను మఱచిపోయే వాడు, ఆ ఉపకారాలకు అపకారాన్ని చేసేవాడు. అతని కంటే మించిన పాతకి, ఇంతేకాక, ''ఇతడు రేపు తప్పక మనకొక గొప్ప ఉపకారాన్ని చేయబోతాడు'' అని దృఢంగా తెలిసికొన్నా, దానికంటే ముందుగానే ఆ మహానుభావునకు హాని చేసేవాడు పాతకిజనులలో గొప్ప పాతకుడు - అనేది ఆ శ్లోకభావం.

## అచేతనాలలోను కృతజ్ఞతను చూడడం సులభం

కృతజ్ఞత - అనే గుణం కల్గి ఉండడం అరుదు. ఈ మహాగుణాన్ని మనం చేతనవస్తువులలో చూడడం సులభం తప్ప, అచేతనవస్తువులలో గమనించి గల్గడం చాలా అరుదు - అని పెద్దలంటారు. **"నిన్జు తళరా వళర్ తెజ్గు తాళుణ్ణ నీరై త్తలైయాలే తాన్ తకుదలాల్"** (నేరుగా పెరిగే కొబ్బరిచెట్టు తన పాదాలతో స్వీకరించిన నీటిని తలపై మోస్తూ, అందిస్తున్నందున) అని, నారికేళ వృక్షాలకు మనం ఉప్పు నీరు మొదలైన అల్పమైన నీటిని పోస్తాము. దానికి బదులుగా అవి మనకు ఇచ్చే నీరు చాలా మధురమైనది- అనే విషయాన్ని గమనిస్తున్నాము. ఇటువంటి కృతజ్ఞతాగుణం లోకంలో చాలామంది వ్యక్తులలో చూడవచ్చు. శ్రీరామునిలో కన్పించే ఈ గుణం లోకోత్తరమైనది.

## శ్రీరాముని కృతజ్ఞతనుగూర్చిన ప్రస్తావన

అయోధ్యాకాండలోని **"కథంచిదుపకారేణ కృతేనైకేన తుష్యతి, న స్మరత్యప కారాణాం శతమప్యాత్మవత్తయా"** (1-11) (ఏదో ఒక రీతిలో చేసిన ఒకేఒక్క ఉపకారంతో శ్రీరాముడు తృప్తిపడేవాడు. నూఱు తప్పులను చేసినా వాటిని మరచిపోయేవాడు) అనే శ్లోకం శ్రీరామునకు గల ఈ కృతజ్ఞతా గుణాన్ని చక్కగా వ్యక్తం చేస్తున్నది. ఏదయినా ఒక రీతిలో ఎవరైనా సహాయం చేస్తే, దానివల్ల ఎల్లప్పుడు మనస్సులో ఆనందించేవాడు. వందల కొలది అపకారాలను తనకు చేసినా వాటిని కొంచెంకూడా మనస్సులో పెట్టుకోడు - అని ఈ శ్లోకంలో శ్రీరాముని గుణాతిశయం తెలుపబడింది. ఇందులో **"కథంచిత్"** అని ముందు ప్రయోగింప బడిన పదం గమనార్హం. ఉపకారాన్ని చేయాలి - అనే భావనతో చేయడం కాకుండా అబుద్ధిపూర్వకంగా చేసినా, దానిని మహోపకారంగా గ్రహించి, శ్రీరాముడు ఆనందించేవాడు. మనః పూర్వకంగానే వందలాది సంఖ్యలో అపకారాలను చేసినా, వానిని మనస్సులో పెట్టుకొనేవాడు కాడు.

## శ్రీరాముని కృతజ్ఞతను దర్శించే సందర్భాలు కొన్ని

ఈ మహాగుణాన్ని మనం శ్రీరామాయణంలో ఎక్కడ దర్శించగలం? - అని అంటే, దీనిని పలు చోట్ల దర్శించినా, కొన్ని సందర్భాలు మాత్రం ఇక్కడ ఉదాహరింప బడుతున్నాయి. అయితే, ఇక్కడ, ముందుగా ఒకటి చెప్పవలసినది ఉన్నది. **"వెఱిదే అరుళ్ శెయ్‌వర్"** (నిర్హేతుకంగా అనుగ్రహిస్తాడు) అని అంటూ ఆళ్వార్లు పల్కిన



రీతిలో ఏమీ అనుష్ఠించనివారికి కూడా చాలా గొప్ప కృపను చూపే స్వభావాన్ని కల్గిన శ్రీరాముడు ఒక ఉపకారాన్ని చేసినవానిపట్ల ఆనందపడతాడు - అని అనడం ఆశ్చర్యమా! ఇది శ్లాఘించదగిన ఒక గుణం అవుతుందా? కానేకాదు కదా. అయినా, తనను ఒక మానవునిగా భావించి నటించినందువల్ల, లోకంలోని మానవులలో కన్పించే గుణాలు అన్నీ శ్రీరామునిలో ఉన్నాయి - అని తెలుపడం ఆవశ్యకమై నందున, ఆ క్రమంలో ఈవిధంగా చూప వచ్చు కదా! వినండి. వానరప్రభువైన సుగ్రీవునిపట్ల, రాక్షసరాజైన విభీషణుని పట్ల శ్రీరాముడు ప్రదర్శించిన కరుణ జిహ్వాతో కీర్తించ సాధ్యం కానిది. మనస్సులో భావించడానికి కూడా దుష్కరం. దీనికి బదులుగా వారు చేసిన ప్రత్యుపకారం ఏది? అని చూచినపుడు, విభీషణుడు శరణాగతిని చేశాడు - అని అయినా చెప్పవచ్చు. కాని, **"సుగ్రీవం శరణం గతః"** అనే ప్రమాణాను సారం శ్రీరాముడు సుగ్రీవుని శరణు పొందినట్లుగా చూస్తున్నామే తప్ప, సుగ్రీవుడు శ్రీరాముని శరణు పొందినట్లుగా లేదు. అయినా, శ్రీరాముని మనస్సులో సుగ్రీవుడు గొప్ప ఉపకారం చేసినవాడుగా భావించబడ్డాడు. ఆ ఉపకారం ఏది? అంటే, శ్రీరాముడు సీతను విశ్లేషించి చాలా బాధపడి, ఏమి చేయాలో తోచకుండా ఉండే టపుడు, **"పంపాతీరే హనుమతా సంగతో వానరేణ హ"** (పంపా నదీతీరంలో శ్రీరాముడు హనుమానుడనే వానరంతో కలిశాడు. ఆహా!) అనే రీతిలో పంపాతీరంలో హనుమానుడు వచ్చి కలిశాడు కదా! ఇది సుగ్రీవుని ఆజ్ఞవల్లనే కదా సంభవించింది. హనుమానుడు శ్రీరామునివద్దకు వచ్చి చేరినపుడు కూడా "నేను సుగ్రీవునిచే పంపబడి, మిమ్ములను చూడాలని ఇక్కడకు వచ్చాను" అని అన్నాడు. ఇటువంటి మహాగుణశాలి అయిన ఆంజనేయుని పంపడం సుగ్రీవుడు స్వకార్యార్థమే అయినా, శ్రీరాముడు ఆవిధంగా భావించకుండా, దానిని తనకోసం చేసిన గొప్ప ఉపకారంగా గ్రహించి, సుగ్రీవునకు మహోపకారాన్ని చేశాడు.

విభీషణుడు **"సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే"** (సమస్త లోకాలకు గొప్ప శరణం, మహాత్ముడు అయిన శ్రీరామునకు నా రాకను గూర్చి చెప్పండి.) అని అంటూ తానుండే చోటును వెదుకుతూ రావడమనే ఒక చిన్న కార్యాన్నే గొప్ప ఉపకారంగా తలచి, అతనిపట్ల గొప్ప ప్రేమను శ్రీరాముడు ప్రదర్శించాడు. ఆ ఆదరం ఎటు వంటిది? అనేదానిని శ్రీవచనభూషణంలోని ఒక వాక్యంలో గమనించవచ్చు. ఆ వాక్యం ఏది? అంటే, **"విభీషణనై రావణన్ కులపాంసన్ - ఎన్ఱాన్; పెరుమాళ్ ఇక్ష్వాకు వంశ్యరాక నినైత్తు వార్త్తై అరుళిచ్చెయ్‌దార్"** (విభీషణుని

రావణుణు కులభ్రష్టుడా! అని అన్నాడు. శ్రీరాముడు అతనిని ఇక్ష్వాకు వంశంలో పుట్టినవానినిగా భావించి పలికాడు) అనేదే. శ్రీరాముడు విభీషణుని ఇక్ష్వాకు వంశంలోని వారిలో ఒకనిగా భావించి పలికాడు - అనేది. శ్రీరామాయణంలో ఎక్కడ కన్పిస్తుంది? అని అంటే, విభీషణుని శ్రీరాముడు అంగీకరించిన తరువాత లంకలో ఉండేవారి బలాబలాలను గూర్చి తెలియజేయమని అడిగే శ్రీరాముడు - **"ఆఖ్యాహి మమ తత్త్వేన రాక్షసానాం బలాబలమ్"** (రాక్షసుల బలాబలాలను గూర్చి నాకు యథార్థంగా తెలుపు.) అని అన్నాడు. రాక్షసుల బలాబలాలను యథాతథంగా నాకు తెలుపు - అనేది దీని అర్థం. "విభీషణా! నీ వారి బలాబలాలను గూర్చి పల్కు" అని కాని,"రావణుని బలాబలాలను తెల్పు" అని కాని చెప్పవలసిన చోట ఆవిధంగా అనకుండా, రాక్షసుల బలాబలాలనుగూర్చి పల్కు - అని అనడం విభీషణుని రాక్షసజాతినుండి వేఱుచేసి పల్కడాన్నే తెల్పి తీరుతుంది - అని మన పూర్వాచార్యులు అభిప్రాయపడ్డారు **"శెల్వ విబీడణఱ్కు వేఱాక నల్లానై"** అని తిరుమఙ్గై ఆళ్వార్లు పెరియతిరుమొళిలో అన్నారు. శ్రీరామునకు మిగిలిన భక్తులంతా ఒక ఎత్తు అయితే, విభీషణాళ్వాన్ ఒక్కడు మాత్రం ఒక ఎత్తు - అనేది ఈ సూక్తిలోని తాత్పర్యం.

## "న స్మరత్యపకారాణామ్" అనే సూక్తిలోని శంకా - సమాధానాలు

ఈ రీతిలో, విభీషణుడు, సుగ్రీవునివంటివారు చేసిన పనులను గొప్పగా భావించి, వారికి ఉపకరించిన విషయం ఉండనివ్వండి. ఇతరులు ఎన్ని అపకారాలను చేసినా, వాటినిగూర్చి కొంచెంకూడా భావించడం లేదు - అనే ఈ మాట కూడా ఒక గొప్ప గుణంగా శ్రీరామునకు చెప్పబడింది కదా! సుగ్రీవుని విషయంలో ఇది వ్యత్యస్తంగా కన్పిస్తున్నదే! ఏవిధంగా? అంటే, వాలిని వధించి, సుగ్రీవునకు మకుటాభిషేకాన్ని చేసి, వర్షాకాలం గడచిపోగానే శ్రీరాముడు అతనిని కిష్కింధకు పంపించాడు, పోయిన సుగ్రీవుడు మన్మథలీలలతో ఆలస్యం చేశాడు. తానిచ్చిన మాట తప్పిపోయిన సంగతి కూడా సుగ్రీవుడు స్మరించలేదు. అపుడు శ్రీరాముడు తమ్ముడు లక్ష్మణుని చూచి "లక్ష్మణా! ప్రభువులు యుద్ధానికి బయలు దేరవలసిన ఈకాలంలో సుగ్రీవుడు నన్ను పూర్తిగా మఱచిపోయి, ఊరికే ఉన్నాడే! చేసిన మేలును మఱచిన పాపిష్ఠివాడు మానవులలో అధముడు. మాంసాన్ని తినే జంతువులుకూడా అతని మాంసాన్ని ముట్టవని పల్కు. లక్ష్మణా! నా పరాక్రమాన్ని అతడు బాగా తెలిసినా, వర్షాకాలం గడచిన తరువాత కూడా, ఏ కొంచెంకూడా భయం లేకుండా కామపర



వశుడై ఉన్నాడే? వాలి పోయిన దారి అతనికోసం తెఱచి ఉన్నదని అతనితో చెప్పు. అతనిని బంధుమిత్రాదులతో పాటుగా యమపురికి పంపడానికి సిద్ధమై ఉన్నానని తెలుపు. అటువంటి గతిని ఆహ్వానించవద్దనికూడా పల్కు" అని శ్రీరాముడు లక్ష్మణునితో అన్నాడు. ఇంతటి కోపం శ్రీరామునకు ఎందుకు కల్గింది? **"న స్మరత్యపకారాణాం శతమప్యాత్మవత్తయా"** (నూర్ల సంఖ్యలో అపకారాలను చేసినా మనస్సులో కోపించడం లేదు) అని పొగడబడిన శ్రీరామునకు ప్రాణసఖుడైన సుగ్రీవునిపట్ల ఇంతటి లోపం తగునా! ఇది గుణలోపమే కదా! అనే ప్రశ్న కలుగవచ్చు.

దీనికి బదులు పల్కుతున్నాము, వినండి. ముందు పల్కిన రీతిలో శ్రీరాముడు లక్ష్మణునితో పల్కినపుడు ఆ లక్ష్మణుడు - "మాట తప్పిన సుగ్రీవుని ఇపుడే వధిస్తాను. వాలిపుత్రుడైన అంగదుడు మనకు సహాయం చేస్తాడు. సుగ్రీవుని వధించే తీరుదాం" అని అన్నారు. దీనికి శ్రీరాముడు "లక్ష్మణా! సత్ప్రవర్తన కల నీవు ఇటువంటి స్నేహితుని పరిశీలించకుండా వధించరాదు. అతనిపట్ల పూర్వం రీతిలో మంచి, చల్లని మాటలను పలుకు. అతడు మన విషయంలో కృతఘ్నుడే - అనేది నిశ్చయంగా తెలిస్తే, తర్వాత నీ ఇష్టానుసారం చేయి" అని అన్నాడు. దీనివల్ల మనం గ్రహించేది ఏమి? అని అంటే, లోకంలో చేసిన మేలును మఱచిపోవడం-అనేది చాలా పాతకం. అ పాతకిని ఏమి చేసినా తప్పు లేదు - అనే శాస్త్రాభిప్రాయాన్ని వివరించడమే శ్రీరాముని లక్ష్యం. **"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి"** (ధర్మాన్ని చక్కగా స్థాపించడం కోసం అవతరిస్తాను.) అని పల్కి, ధర్మమార్గాన్ని సుస్థాపించడం కోసమే అవతరించిన శ్రీరాముడు ఇటువంటి మంచి శాస్త్రార్థాలను తెలిపే రీతిలో ధర్మసంస్థాపనాన్ని చేయగోరడం ఆవశ్యకం కనుక, దీనివల్ల శ్రీరామునకు ఏ గుణహాని కొంచెంకూడా లేదు - అని గ్రహించాలి.

లంకకు పోవడానికి దారిని ఇవ్వాలి - అని సముద్రరాజును ఉద్దేశించి శ్రీరాముడు శరణాగతిని చేశాడు. అతడు (సముద్రుడు) తన ముఖాన్ని చూపించ లేదు - అని కోపించాడు. వెంటనే సముద్రుడు వినయంతో వచ్చి నిలువగా, అతనిపై ప్రయోగించాలని సంధించిన బాణాన్ని అతని విరోధులపై ప్రయోగించి, పరమకృపను చూపాడు - అనే శ్రీరామాయణవృత్తాంతం. దీనిపట్ల శ్రీరాముని కోపంకూడా మంచికే కారణమవుతున్నది - అని చక్కగా తెలుస్తున్నది కదా! కరుణామూర్తి అయిన రాఘవునకు కోపం కలిగే అవకాశమే లేదు. కోపం కల్గినట్లుగా కన్పించే సందర్భాలలో ధర్మసూక్ష్మం ఏదయినా స్ఫురించి తీరుతుంది.

## శ్రీమన్నారాయణమూర్తి విషయంలో కృతజ్ఞతాగుణవివరణం

కృతజ్ఞత - అనే మహాగుణాన్ని మానుషరూపి అయిన శ్రీరామునిలో మనం నిరూపించడం - అనేది ఒకవైపు ఉండనివ్వండి. పరంధాముడైన శ్రీమన్నారాయణ మూర్తిలో ఈ గుణం ఉండడాన్ని మన ఆచార్యులు చాలా అద్భుతంగా నిరూపించి చూపించారు. మానవుల కృతజ్ఞతా గుణం ఒక విధమైనది. ఆచార్యులు నిరూపించే రీతి చాలా అద్భుతమైనది. అది ఇక్కడ వివరింపబడుతున్నది.

**"కృతజ్ఞః"** అనే పదం - (**"కృతం జానాతి ఇతి - కృతజ్ఞః)** అనే వ్యుత్పత్తినిబట్టి "చేసిన కార్యాలను తెలిసికొనేవాడు" - అనే అర్థాన్ని ఇస్తుంది. జీవులమైన మనం చేసే కార్యాలను గ్రహించేవాడు భగవానుడని తాత్పర్యం. అనంతకోటి జీవరాశులు ఒక్కొక్కరు ఒక్కొక్క క్షణంలోను చేసే కార్యాలను భగవానుడు తన గొప్ప శక్తి విశేషం ద్వారా గ్రహించి తెలిసికొంటున్నాడు - అనేది ఆశ్చర్యపడదగిన విషయం కదా! అదేనా ఇక్కడ చెప్పబడేది? అని అంటే, వినండి.

సర్వేశ్వరుడు మనవంటి జీవులను తన కృపకు లక్ష్యంగా చేయడానికి తగినట్లుగా మనం చేయవలసిన కార్యాలనుగూర్చి శాస్త్రాలలో తెలుపబడడం అందఱు తెలిసినదే. అవి సుకృతమనే సాధారణనామంతో వ్యవహరింపబడుతున్నవి. చక్కగా చేయబడినవి - అనేది దీని అర్థం. మనం చేసే కార్యాలలో చక్కగా చేయ బడేవి, చెడ్డగా చేయబడేవి - అనే రెండు రీతులున్నాయి కదా! అవి సంస్కృతభాషలో **"సుకృత-దుష్కృత"** పదాలతోను, ద్రావిడభాషలో **"నల్వినై-తీవినై"** పదాలతోను వ్యవహరింపబడతాయి. సుకృతాన్నిగూర్చియే ఇక్కడ ప్రస్తావిస్తున్నాము. ఇది సాధారణంగా జ్ఞాతసుకృతం-అని, అజ్ఞాత సుకృతం-అని రెండు విధాలుగా ఉంటుంది. మనఃపూర్వకంగా తెలిసి చేసే మంచి పనులు జ్ఞాతసుకృతాలనబడతాయి. మనకు తెలియకుండా సంభవించే మంచి పనులు అజ్ఞాతసుకృతాలనబడతాయి. వీటిలో, మొదటి వర్గమైన జ్ఞాతసుకృతాలు పలు పలు విధాలుగా ఉంటాయి. తపస్సు చేయడం, దానం చేయడం, యజ్ఞ యాగాదులను చేయడం, గంగ, యమున, కావేరి మొదలైన పుణ్యనదులలో స్నానమాడడం, కోయిల్ (శ్రీరంగం), తిరుమలై, పెరుమాళ్ కోయిల్ (చిన్నకంచి), తిరునారాయణపురం (మేల్కోటై) మొదలైన దివ్యదేశాలకు పోయి భగవానుని సేవించడం, **"పేరాయిరము మోదుమిన్కళ్"** అనే ఆజ్ఞకు లోబడి సహస్రనామం మొదలైన భగవానుని స్తుతులను నోరార పల్కడం,



దీపాలను వెల్గించడం, పూమాలికలను కూర్చడం - ఇత్యాదిగా చెప్పబడే పలువిధాలైన కైంకర్యాలను చేయడం - అనే ఇటువంటి కార్యాలను "వీటిని చేద్దాం" అని సంకల్పించి మనఃపూర్వకంగా చేయడం - అనేవి జ్ఞాతసుకృతాలనబడతాయి.

## అజ్ఞాతసుకృతప్రస్తావం

పూర్వం తెల్పిన రీతిలో, "ఈ సుకృతాన్ని చేయాలి - అని మనం సంకల్పించి చేయకపోయినా, యాదృచ్ఛికంగా సుకృతంగా పరిణమించే సుకృతాలు అజ్ఞాత సుకృతాలనబడతాయి. మంచి పనిని చేయాలి - అని మనం భావించి చేయని వానిని సుకృతమనే పదంతో వ్యవహరించవచ్చునా? శాస్త్రాలలో విధింపబడినవై, కర్తలైన చేతనులచేత బుద్ధిపూర్వకంగా అనుష్ఠింపబడిన కార్యాలనే కదా సుకృతమని వ్యవహరించవచ్చు, "ఈ సుకృతాన్ని చేద్దాం" అని కర్త అయిన చేతనునకు తెలియని దానిని సుకృతమని ఏవిధంగా చెప్పవచ్చు? అని ఆక్షేపించే అవకాశం ఉన్నది. దీనికి మన పూర్వాచార్యులు పలికే సమాధానాన్నే ఇక్కడ తెల్పుతున్నాము.

శ్రీవచనభూషణంలో భగవన్నిర్హేతుకకృపావైభవ ప్రకరణంలో **"శాస్త్రముమ్ విధియాదే, నాము మఱియాదే యిరుక్కిఱ ఇత్తై సుకృతమెన్ను నామ్ పేరిడుకిఱపడి ఎన్? ఎన్నిల్, నామన్ను, ఈశ్వరనెన్ను కేట్టిరుక్కైయాయిరుక్కుమ్"** (శాస్త్రం విధించకుండా, మనకు తెలియకుండా ఉండే దీనిని సుకృతమని మనం ఏవిధంగా అనగలం? అని అంటే, మనం కాదు, దానిని సుకృతమని భగవానుడు భావిస్తాడు.) అనే సూత్రం (396) ఉన్నది. మనకు తెలియకుండా జరిగిన సత్కార్యానికి సుకృతమనే పేరు పెట్టడం మనం చేసినది కాదు, సర్వముక్తి ప్రసంగం రాకుండా ఉండడంకోసం సర్వజ్ఞుడైన సర్వేశ్వరుడే సుకృతమనే పేరును పెట్టాడు - అని ఆచార్యులు అన్నారు. ఇందువల్ల ఏమి తెలుస్తున్నది? అని అంటే, మనకు అజ్ఞాతంగా ఉన్నా, భగవానునకు జ్ఞాతంగా ఉన్నందువల్ల సుకృతమని అనడంలో కొఱత లేదు - అని తెలుస్తున్నది.

## ప్రసంగవశాత్తు భగవానుని పరమకృపానిరూపణం

దీనికి తర్వాత ఒక ప్రశ్న కల్గుతుంది. భగవానుడు యథార్థజ్ఞాననిధి. అతనికి అన్యథాజ్ఞాన - విపరీతజ్ఞానాలు బొత్తుగా లేవు - అని శాస్త్రాలవల్ల తెలిసికొంటున్నాము. మనం మనఃపూర్వకంగా చేయనిదానిని అతడు సుకృతమని గ్రహిస్తే, అది యథార్థ జ్ఞానం అవుతుందా? ఒకడు, సన్నిపాతజ్వరం మొదలైన తీవ్రమైన వ్యాధులతో

బాధపడే సమయాలలో, తనకు తెలియకుండా ఏమేమో ప్రలపిస్తాడు. అబుద్ధి పూర్వకంగా వెలువడే ఆ ప్రలాపాలలో ఎవరైనా అర్థం గ్రహిస్తారా! లేదుకదా! ఆ రీతిలోనే మనకు తెలియకుండా మనం చేసే కార్యాలను భగవానుడు సుకృతమని ఏవిధంగా గ్రహించవచ్చు? - అనే ప్రశ్న కల్గుతుంది. దీనికి సమాధానాన్ని వినండి. భగవానుడు జీవులపట్ల సహజమైన కృపను కలవాడు. ఇతని ఏరీతిలో అయినా తాను అనుగ్రహించడానికి ఆ స్వామి దారిని అన్వేషిస్తాడు. ఈ జీవుడు బుద్ధిపూర్వకంగా చేసే సత్కార్యాలను పురస్కరించుకొనే ఇతనిని అంగీకరించాలనే నియమాన్ని భగవానుడు పెట్టుకొంటే ఎవనినీ ఒక్కని కూడా అంగీకరించే అవకాశం ఉండదు. ఎందుకు? అంటే, మనం బుద్ధిపూర్వకంగా చేసే పనులు దుష్కార్యాలే అయినందున, సత్కార్యాలను మనం మనస్సులో కూడా భావించము కనుక, మనలను అంగీకరించ డానికి భగవానునకు అవకాశం ఏముంటుంది? అతని ప్రాప్తిని మనం కోల్పోయి, మన ప్రాప్తిని అతడు కోల్పోవలసి వస్తుంది. అంతే. మన నష్టం అటు ఉండనివ్వండి.

కోల్పోయామే - అనే దుఃఖం లేకుండా ఉండే మనం మన నష్టాన్ని గూర్చి బాధపడ కుండా ఉన్నప్పటికీ, సొత్తును కలవాడైన స్వామి అనే పేరును పొందిన భగవానుడు సహించి ఉండలేదు కదా! "సుకృతాన్ని చేసినవారిని తప్ప మిగిలిన వారిని నేను అంగీకరించను" - అని శాస్త్రాలలో అతడు నియమించినందువల్ల, సుకృతం చేయని వారిని అంగీకరించలేకుండా ఉంటాడు. చేతలనులను చూస్తే, బుద్ధిపూర్వకంగా సుకృతం చేయనివారైనందువల్ల, వీరిని అంగీకరించే అవకాశమే లేకుండా ఉంటుంది. అందువల్ల (భగవత్ప్రాప్తి) కోల్పోవలసి వస్తుంది. ఆ విధంగా కోల్పోకుండా ఉండడం కోసం ఆ స్వామి ఒక వేరేదారిలో ప్రవేశిస్తాడు. అది ఏమంటే, కరణకళేబరా లను పొందిన ఈ జీవుడు ఏక్షణంలోనూ ఎపుడూ ఊరికే ఉండడు. **"న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్"** (ఒక్కక్షణం కూడా జీవుడు ఊరికే ఉండడు.) అని గీతలో పల్కినట్లుగా ఎల్లప్పుడూ ఏదో ఒక కార్యం చేస్తూ కాలక్షేపం చేసే జీవుడు చేసే కార్యాలలో, మనం సుకృతమని చెప్పదగన కార్యం అనేది ఏదయినా ఉంటుందా! అని తలచి పరిశీలించి చూస్తాడు. అతని అదృష్టం వశంచేత అటువంటి కార్యాలు కొన్ని అతనికి మనవద్ద లభిస్తాయి. వాటిని సుకృతాలుగానే అతడు భావిస్తాడు. మనం మనఃపూర్వకంగా సుకృతమని తలచి చేయనందువల్ల అజ్ఞాతమనబడు తున్నది. అతని అభిప్రాయానుసారం ఇది సుకృతంగా గ్రహింపబడినందున సుకృత మనబడుతునందువల్ల అజ్ఞాత సుకృతమనే పేరును పొందింది.



## అజ్ఞాతసుకృత ప్రకారాలు - అతని ఊరిపేరును పల్కిన సుకృతం

ఈ అజ్ఞాతసుకృతం అనేది - యాదృచ్ఛికసుకృతమని, ఆనుషంగిక సుకృతమని, ప్రాసంగిక సుకృతమని పలు పేర్లను కల్గినదై ఉంటుంది. ఇవి మనవంటి వారివద్ద నుండి భగవానునిచే ఏవిధంగా గ్రహింపబడుతున్నవి? - అనేదానిని ఇక నిరూపిస్తాను. మనం సంసారులం అయినందువల్ల సంతానాన్ని పొందుతాము. పుత్రికను తగిన వరునకిచ్చి వివాహం చేయవలసి ఉంటుంది. అందుకోసం శ్రీరంగంలో ఉండే ఒక వరునకు తన పుత్రికను ఇవ్వడం, శ్రీవేంకటాద్రిలో ఉండే ఒక కన్యకను తన కుమారునకు వివాహం చేసికోవడం ఒకనికి సంభవించిందని భావించండి. అపుడు ఈ సంసారి మాటిమాటికి వ్యవహారం చేసేటపుడు (మాట్లాడేటపుడు) శ్రీరంగాన్ని, తిరుమలైను నోరార చెప్పవలసి ఉంటుంది. "మా అల్లుడు గారు శ్రీరంగంలో ఉన్నారు, శ్రీరంగంనుండి మా అల్లుడు నిన్న వచ్చారు. అల్లుని పిలుచుకొని రావడంకోసం శ్రీరంగానికి వెడుతున్నాను. నా కోడలు వేంకటాద్రినుండి వచ్చింది" అని ఈవిధంగా పలుమార్లు వ్యవహరించడం జరుగుతుంది. ఈ వ్యవహారాలలో శ్రీరంగాన్ని, తిరుమలను పలుమార్లు ప్రస్తావించడం "ఈ దివ్య దేశాలను మనం పల్కితే సుకృతం ఉంటుంది" - అనే భావంతో కాదు. అంబత్తూర్, ఆవడి - ఇత్యాది పేర్లను పల్కినట్లే, కోయిల్, తిరుమలై - అనే ఊరిపేర్లను ఇతడు పల్కుతాడు.అయినా, ఏదైనా ఒక వ్యాజాన్ని (నెపాన్ని) ఎదురుచూడడంలో దృష్టిని కల భగవానుడు "నా ఊరి పేరును ఇతడు చెప్పాడు" అని అంటూ దీనిని ఒక సుకృతంగా లెక్కిస్తాడు.

## భగవానుని పేరును పల్కిన సుకృతం

ఇంకా వినండి. సంసారులు తమకు పుట్టే సంతానానికి రంగడు, రాఘవుడు, తిరువేఙ్గడమ్, గోవిందుడు, గోపాలుడు, నారాయణుడు, మాధవుడు - అని ఈవిధంగా పేర్లనుపెట్టి, ఆ పుత్రులను పిలిచేటపుడు అంతా ఈ పేర్లను పల్కి పిలువడం జరుగుతుంది. "భగవానుని తిరునామాలను పల్కుతున్నాము" - అనే భావం కొంచెంకూడా లేకుండా, ఈవిధంగా సంభవించే సంసారుల వ్యవహారాలలో భగవానుడు "నా నామాన్ని ఇతడు పలికాడు" అని దీనిని ఒక సుకృతంగా లెక్కిస్తాడు.

## అతని భక్తులను రక్షించిన సుకృతం

కొందఱు భక్తులు వేంకటాచల యాత్రంగా మార్గంలో ప్రయాణం చేసే సమయంలో, దొంగలు వారిని కొట్టి, వారి వస్తువులను అపహరించడంకోసం దగ్గరకు

వచ్చారు. అదే సమయంలో కొందఱు రాజసేవకులు తమ విధ్యుక్తధర్మంగా ఆయుధాలను ధరించి, ఆ దారిలోనే రావడం దొంగలు చూచి, "వీరు ఈ భక్తులకు రక్షకులుగా వస్తున్నారు కాబోలు. ఇక్కడ మన ఆలోచన ఏదీ ఫలించదు" అని తలచి, అక్కడి నుండి తొలగిపోయారు. ఈ సంగతి అక్కడకు యాదృచ్ఛికంగా వచ్చిన రాజభటులకు తెలియదు. యాత్రగా వెళ్ళే భాగవతులకు కూడా తెలియదు. అయినా, అంగీకరించా లని అవకాశంకోసం ఎదురుచూచే సర్వేశ్వరుడు ఆ రాజసేవకులను భాగవత రక్షణం చేసినవారుగా భావిస్తాడు. ఆ రాజసేవకులు ఆ భాగవతులు వెళ్ళిన దారిలో వెళ్ళడమే ఒక సుకృతంగా లెక్కిస్తాడు.

## అతని భక్తుల దాహాన్ని తీర్చిన సుకృతం

ఒకడు ఒకచోట క్షేత్రాన్ని కొని అందులో ఉల్లిపాయ, వెల్లుల్లి మొదలైన వానిని పైరు చేశాడు. నీటిని ఆ క్షేత్రంలో ప్రవహింపజేయడంకోసం, అక్కడ ఏ సౌకర్యం లేనందువల్ల, చాలా దూరంలో నీరుండే చోట త్రవ్వి, తన పొలంలోకి నీరు వచ్చేటట్లుగా నీటిని తోడుతున్నాడు. ఆ నీరు ఒక పెద్ద కాలువగా ప్రవహించి పొలంలోకి పోతున్నది. యాత్రగా వెడుతున్న కొంతమంది భాగవతులు తాపార్తులై దాహం మిక్కుటం కాగా, అంతటా నీటికోసం వెదకి, దొరకనందువల్ల చాలా బాధపడి వచ్చేటపుడు, ఈ నీటి ప్రవాహాన్ని చూచి, చాలా ఆనందం పొంది, కాలుచేతులను ముఖాన్ని కడిగికొని, దాహం తీర్చుకొని ఉపశమనాన్ని పొందారు. చాలా దూరంలో త్రవ్వి నీటిని తోడి ప్రవహింపజేసేవాడు దీనిని కొంచెంకూడా తెలియనివాడైనా, సర్వజ్ఞుడైన భగవానుడు "ఇతడు నా దాసులు దాహాన్ని తీర్చాడు" అని భావించి, దీనిని ఒక సుకృతంగా లెక్కిస్తాడు.

## అతని దాసులను విశ్రమించడానికి నీడను ఇచ్చిన సుకృతం

ఒక జూదరి వాడు తాను జూదం, చదరంగం ఆడడంకోసం ఒక చావడిని కట్టి, అందులో జూదమాడుతూ కాలాన్ని గడుపుతున్నాడు. అయితే, రాత్రి అంతా జూదమాడి, తరువాత నిద్రించడంకోసం ఇంటికి పోయేవాడు, అపుడు, యాత్రగా దారిలోపోయే కొందఱు పరమభాగవతులు తాము శయనించడానికి ఏచోటు లభించక క్లేశపడి, చివరకు ఆ చావడిలో విశ్రమించడం జరిగింది. ఈ సంగతి ఆ జూదరికి తెలియదు. తెలిస్తే ఎవరూ లోపలకు రాలేని రీతిలో తలుపులు వేసే ఏర్పాటు చేసి ఉండేవాడు. ఈ విధంగా పలువురు భాగవతులు విశ్రమించేవారు - అనే సంగతిని అతడు తెలియనందున ఆ చోటు తలుపులు మూయబడకుండా, యాత్రగా పోయేవారికి గొప్ప ఆనందాన్ని ఇచ్చే వసతిగా ఉండేది. ఇది భగవానుని మనస్సులో పడి, "నా దాసులు విశ్రమించడానికి నీడను ఇచ్చాడితడు" అని ఒక సుకృతంగా లెక్కిస్తాడు.



## పశువధలో కూడా భగవానుడు చూచే సుకృతం

ఒకడు గోహత్యను చేసి జీవించే అలవాటు కలవాడు. అతడొకనాడు ఒక గోవును చూచి, దానిని పట్టుకొని వధించాలని ప్రయత్నించి దానిని వెంబడించాడు. అతని ప్రయత్నాన్ని గమనించిన ఆ పశువు భయపడి పరుగు తీసింది. ఇతడు కూడా విడువకుండా దానిని వెంటాడుతూ పరుగెత్తాడు. గోవు పరుగెత్తే దారిలో ఒక భగవానుని కోవెల ఉన్నది. దానికి ప్రదక్షిణంగా ఆ గోవు పరుగెత్తింది. ఈ కిరాతకుడు దానిని వెంటాడి పట్టుకోవడంకోసం తానుకూడా ఆ కోవెలకు ప్రదక్షిణం చేస్తూ పరుగెత్తాడు. "ఒక భగవదాలయానికి ప్రదక్షిణం చేస్తున్నాము" - అనే భావం అతనికి లేదు. కోవెలను ప్రదక్షిణం చేయడం సుకృతమనే జ్ఞానంకూడా అతనికి లేదు. అయినా, భగవానుడు "ఇతడు నా కోవెలకు ప్రదక్షిణం చేశాడు" అని దీనిని ఒక సుకృతంగా లెక్కిస్తాడు.

## కృతజ్ఞతాగుణ వివరణనిగమనం (సమాప్తి)

ఈవిధంగా పలు సందర్భాలు సంసారజీవితంలో సంభవించేవి ఉన్నాయి. ఇవే అజ్ఞాతసుకృతాలు అనబడేవి. పూర్వం నిరూపింపబడినవానిలో యాదృచ్ఛిక సుకృతకోటిలో చేరేవి కొన్ని; ప్రాసంగిక సుకృతకోటిలో చేరేవి కొన్ని; ఆనుషంగిక సుకృత కోటిలోకి చేరేవి కొన్ని. ఈవిధంగా ఇటువంటి సుకృతాలను భగవానుడు తానే తెలిసికొని, మనలను కరుణించడంకోసం వీటిని హేతువుగానో, వ్యాజంగానో గ్రహిస్తున్నాడు - అనే దీనినికూడా మనం శాస్త్రాలద్వారా తెలిసికొంటున్నాము. ఇటువంటి సుకృతజ్ఞానం భగవానుని వద్ద ఉన్నది కనుకనే అతడు కృతజ్ఞుడనే స్తుతి చేయబడుతున్నది.

ఆళవందార్ (శ్రీయామునులు) కూడా స్తోత్రరత్నంలో **"వశీ వదాన్యః"** అనే శ్లోకంలో భగవానుని పలు కల్యాణగుణాలను ప్రస్తావిస్తూ, **"కృతీ కృతజ్ఞః"** అని ఈ గుణాన్ని కూర్చి పలికారు. భగవానుని కృతజ్ఞతాసుగుణాన్ని ఈవిధంగానే మన ఆచార్యులు నిరూపించి భక్తుల హృదయాలను కొల్లగొట్టారు.

ఇటువంటి గుణం శ్రీరాముని వద్ద ఉన్నదని మనం దేనినిబట్టి తెలిసి కొంటున్నాము? - అని అంటే, ఒక్క సందర్భాన్ని మాత్రమే ఇక్కడ ప్రస్తావిస్తాము. విభీషణాళ్వాన్ వచ్చి చేరినపుడు, అతనిని అంగీకరించకూడదని వాదించిన వారిలో ప్రధానుడు-సుగ్రీవుడు. శ్రీరాముడు అతని వాదాలను ఖండించి, విభీషణుని తప్పక అనుగ్రహించి తీరుతాను - అనే తన నిశ్చయాన్ని వ్యక్తం చేసిన తరువాత, విభీషణుని తనవద్దకు తీసికొని రమ్మని సుగ్రీవుని ఆజ్ఞాపించి పలికేటపుడు **"ఆనయైనం హరిశ్రేష్ఠ! దత్తమస్యాభయం మయా"** (వానర శ్రేష్ఠుడవైన సుగ్రీవా! ఇతనిని తీసికొని రా! ఇతనికి నేను అభయాన్ని ఇచ్చాను.) అని అన్నాడు. "సుగ్రీవా! విభీషణునకు నేను అభయాన్ని ఇచ్చాను. అందువల్ల అతనిని నీవు తీసికొని రా'' అని పల్కి, వెంటనే **"విభీషణో వా సుగ్రీవ! యది వా రావణః స్వయమ్"** అని అన్నాడు. దీని అర్థమేమంటే - ''సుగ్రీవా! నన్ను శరణు పొందడంకోసం వచ్చినవాడు విభీషణుడని మీరు అంటే, అతనిని నేను అంగీకరించానని అన్నాను. ఒకవేళ, అతడు విభీషణుడు కాకుండా, అతని వేషాన్ని ధరించిన రావణుడే వచ్చినట్లుగా తెలిస్తే, ఆ రావణుని అంగీకరించాలా!- అని తిరిగి విచారణ చేయకుండా, అతనినే నిస్సంశయంగా తీసికొని రా'' అని అర్థం. ఈవిధంగా తమ ఉదారమైన మనస్సును చూపే శ్రీరాముడు రావణుని వద్ద ఏ సుకృతాన్ని చూచి ఈ మాటను పలికాడు? - అని విచారించినపుడు, మహాపాపి అయిన ఆ రావణుని వద్ద బుద్ధిపూర్వమైన సుకృతం ఏదీ కన్పించకపోయినా, పూర్వం వివరించిన రీతిలో యాదృచ్ఛికం మొదలైన సుకృతాలు కన్పించవచ్చు - అనే నిశ్చయాన్ని పొందే ఆ రీతిలో పలికాడు - అని మన పూర్వాచార్యులు భావించారు.

## 5. కః సత్యవాక్యః (సత్యాన్ని పలికేవాడెవడు?)

వాల్మీకి నారదసంవాదంలో ఇది అయిదవ ప్రశ్న. 1) గుణవంతుడెవడు? 2)వీర్యవంతుడెవడు? 3) ధర్మజ్ఞుడెవడు 4) కృతజ్ఞుడెవడు? - అనే నాల్గు ప్రశ్నలు ఇంతవరకు వివరింపబడ్డాయి, 5) సత్యవాక్కు ఎవడు? - అనే అయిదవ ప్రశ్న ఇక వివరింప బడుతున్నది.

### సత్యస్వరూపనిరూపణం

**"సత్యవాక్యః"** అనేదానికి - సత్యాన్నే పలికేవాడు - అనేది అర్థం. సత్యమంటే ఏమి? అనే విషయాన్ని గూర్చి ముందుగా విచారించాలి. ''ఉన్నదానిని ఉన్నట్లు చూచి, యథాతథంగా పల్కడమే సత్యం"-అని లోకంలోని వారు అందఱు భావిస్తారు.



దీనిని గూర్చి మన పూర్వాచార్యులు విచారించేటపుడు కొంచెం విశదం చేశారు. ''ఉన్నదానిని యథాతథంగా దర్శించి యథాతథంగా చెప్పడమే'' అనేదానిలో ''ఉన్న దానిని ఉన్నట్లుగా చూడడం'' అనేది చేర్చకూడదు. ఎందుకు? అంటే, లోకంలో మానవులకు ఒక వస్తువును ఇంకొక వస్తువుగా భ్రమించడం - అనే అజ్ఞానం సహజం. దారాన్ని చూచి పాము - అని భ్రమించడం మానవులకు సహజమే కదా! ఇటువంటి భ్రమలు అనేకం సంభవిస్తాయి కనుక, ఆ భ్రమవల్ల ఒక వస్తువును ఇంకొక వస్తువుగా తెలిసికొన్నవాడు, తాను గ్రహించిన రీతిలోనే కదా ఇతరులకు చెప్పగలడు. దారాన్ని చూచి పాము - అని భ్రమించినవాడు ''పాము, పాము'' అని అఱచినా, అక్కడ పాము ఉన్నదని ఇతరులతో పల్కినా, అది అసత్యవచనం కావలసివస్తుంది. నిజానికి అది అసత్యవచనం కాబోదు. అతడు, తాను గ్రహించిన రీతిలోనే కదా పలికాడు.

అది అతని భావనలో సత్యవచనమే తప్ప, అసత్యవచనం కాబోదు. ''ఏమి! ఎందుకు కాదు? ఇతడు అసత్యాన్నే కదా గ్రహించాడు. అది భ్రాంతికదా!'' అని కొందఱు వాదించవచ్చు. కాని, ఈ వాదం పొసగదు. ఒక విషయాన్ని ఇంకొక విషయంగా గ్రహించడమనే భ్రమ - అనేది దైవలీలగా సంభవిస్తుందే తప్ప వేఱు కాదు. అది, అజ్ఞానం, లేక, భ్రాంతి - అనే దోషాలలో చేరుతుంది తప్ప, అసత్యమనే దోషంలోకి చేరదు.

### గీతాభాష్యటీకను పురస్కరించుకొని సత్యాన్ని నిర్వచించడం

భగవద్గీతలోని పదవ అధ్యాయంలోని నాల్గవ శ్లోకంలో **"క్షమా సత్యం దమ శ్శమః"** అనే చోట సత్యమనేది ఇది - అనే విషయాన్ని నిరూపించే శ్రీరామానుజ భాష్యం, దానికి శ్రీవేదాంతదేశికుల టీక ఇక్కడ గమనించదగినవి. ''ఉన్నదానిని యథాతథంగా గ్రహించి పల్కడం'' అని అనకుండా, "తాను చూచిన రీతిలో పల్కడం సత్యం'' అని భాష్యకారులు అన్నారు. దీని భావాన్ని దేశికులు వివరించారు.

### సత్యం విషయంలో స్మృతివచనప్రదర్శనం

ఇక, ''తాను చూచిన రీతిలోనే పల్కడం సత్యం'' అనేదానిని కూడా పరిష్కరించవలసినది ఉన్నది. చూచినదానిని చూచినట్లుగా పల్కడంకూడా సత్యం కాబోదు. ఎందుకు? అంటే, వ్యాసస్మృతిలో **"సత్యం భూతహితం స్మృతమ్"** (జీవులకు హితమైనది సత్యమని చెప్పబడినది.) అని చెప్పబడింది. చూచిన దానిని చూచి నట్లుగా పల్కడం - అనేది ప్రాణులకు హితమై ఉంటే మంచిదే, ఆ రీతిలో కాకుండా

ఆహితమైతే, అది సత్యం కాబోదు. అసత్యమే. **"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్ న బ్రూయాత్ సత్య మప్రియమ్"** (సత్యాన్ని పలకాలి, ప్రియాన్ని పలకాలి. సత్యమైన అది అప్రియమైతే దానిని చెప్పకూడదు.) అనే వచనంకూడా ఇక్కడ గ్రహించదగినది. ఇతరులకు అహితాన్ని కల్గించని మాట ఏదో అదే సత్యమని, ఇతరులకు అహితాన్ని కల్గించే మాట నిజానికి సత్యమైనా, అసత్యంగానే భావించబడుతుందనే శాస్త్రాభిప్రాయమున్నది. ఒకడు పలికే సత్య వచనంవల్ల ఇతరులకు అనర్థం కల్గితే, అది సత్యవచనం కాదు; అసత్యవచనం గానే భావింపబడుతుందని పెద్దలంటారు.

## ప్రకృతవిషయంలో శంకా-పరిహారాలు

ఈ విషయంలో పలు సందేహాలు కల్గుతాయి. న్యాయాలయంలో నడిచే వ్యవహారాలలో వాస్తవం తెలియడంకోసం కొందఱు యోగ్యులైన గొప్పవారిని సాక్షులుగా గ్రహిస్తారు. వారు నిజాన్ని దాచకుండా చెప్పి తీరాలి కదా! ఉన్న విషయాన్ని ఉన్నట్లుగా పల్కితే ఒక పక్షానికి అనర్థం కల్గి తీరుతుంది కదా. ఆ విధంగా అనర్థాన్ని కల్గించే సత్యాన్ని పలుకరాదు - అనేది శాస్త్రవచనం కనుక, ప్రామాణికులైనవారు సత్యాన్ని దాచి పెట్టవలసి ఉంటుంది. మఱి అది యుక్తమవుతుందా? ప్రామాణికులు ఆ విధంగా చేయడం కన్పించడం లేదే! హత్య, దొంగతనం, వంచన మొదలైన విషయాలలో సాక్ష్యాలుగా కోరబడినవారు నిజాన్ని దాస్తే, వారు అసత్యవాదులని నిందింపబడతారుకూడా. వారి సత్యవచనాలవల్ల ఒక పక్షానికి నష్టం కల్గినా, దానిని పాపంగా ఎవరూ భావించడం కన్పించడం లేదు. అందువల్ల ఇతరులకు హానిని కల్గించేదైన సత్యవచనం అసత్యవచనమే కాగలదు - అని ఏవిధంగా చెప్పవచ్చు? అని ఈ విధంగా తోచే వాదాలున్నాయి.

దీనికి తగిన సమాధానాన్ని వినండి. **"సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్, న బ్రూయాత్ సత్య మప్రియమ్"** అనే వచనం మనం కల్పించినది కాదు. లోకం పొగడే మహర్షి పల్కిన వచనం ఇది. "సత్యమైనా, ఇతరులకు హానిని కల్గించేది అయితే, దానిని పలుక కూడదు" అని శాస్త్రప్రవర్తకులైన మహర్షులు కదా నియమించారు. దానిని అప్రమాణమని పల్కి తిరస్కరించడానికి వీలు లేదు. లోకాను భవాన్ని, శాస్త్రాన్ని సమన్వయించడం - అనేది సులభమైన పని కాదు. అన్ని శాస్త్రాలకు అందఱు అధికారులు కారు, కాలేరు. ఉత్తమాధికారులు, మధ్యమాధికారులు, అధమాధికారులు - అనే విభాగం అంతటా ఉన్నది. సత్యాన్ని పల్కి ఇతరులకు



అనర్థాన్ని కల్గించేవారిని ఉత్తమాధికారులని పల్కడానికి శాస్త్రం చోటు ఇవ్వదు. ఇక్కడ మనం పలు పలు ఇతిహాసాలను దృష్టాంతంగా చూపవలసి ఉన్నది. అయినా, విస్తృతికి భయపడి ఒక ఇతిహాసాన్ని మాత్రమే ఉదాహరింపబడుతున్నది.

## వీతహవ్యవృత్తాంతం

మహాభారతంలోని అనుశాసనికపర్వంలో ఎనిమిదవ అధ్యాయంలో వీతహవ్యుడనే క్షత్రియుని కథ ఒకటి చెప్పబడినది. ఈరాజు తన నూఱుమంది పుత్రులతో కలసి శత్రువులతో యుద్ధం చేసేటపుడు,ఆ నూర్గురు పుత్రులు మరణించారు. అపుడు వీతహవ్యుడు భయపడి తన నగరాన్ని విడచి పారిపోయి భృగుమహర్షి ఆశ్రమంలో ప్రవేశించి, ఆ మునిని శరణు వేడాడు. ఆ ముని వీతహవ్యుని దీనదశను చూచి జాలిపడి అభయమిచ్చి, ఆసనంలో కూర్చున్నాడు. అతనిని వెంబడించి వచ్చే శత్రువు ఆ ఆశ్రమంలో ప్రవేశించి ఆ మునిశిష్యులను చూచి "ఇక్కడ ఎవరెవరున్నారు? నేను తెలిసికోవాలి. భృగుమహర్షిని నేను చూడాలి. నేను వచ్చినట్లుగా వారికి చెప్పండి" అని అన్నాడు. వెంటనే మునివరుడు లోపల నుండి బయటకు వచ్చి, అతనికి ఉపచారాలను చేసి, "ఇక్కడ నీకు కావలసినది ఏమున్నది?" అని అడిగాడు. అపుడతడు "మునివరా! వీతహవ్యుడు ఇక్కడకు వచ్చి దాగి ఉన్నాడు. అతనిని విడచిపెట్టండి. అతనిని వధించాలి" అని అన్నాడు. అపుడు భృగుమహర్షి పల్కిన సమాధానం ఏమంటే - **"నేహాస్తి క్షత్రియః కశ్చిత్ సర్వే ఇమే ద్విజాతయః"** (ఇక్కడ క్షత్రియులెవరూ లేరు. అందఱు బ్రాహ్మణులే) అని. దానితో వీతహవ్యునకు సంభవించిన ఆపద సులభంగా తీరింది.

క్షత్రియుడైన వీతహవ్యుడు తన ఆశ్రమంలో ఉన్నప్పటికీ, "ఇక్కడ క్షత్రియుడెవరూ లేరు" అని ముని పల్కడం అసత్యమని భావించవలసినదే తప్ప, సత్యమని భావించదగినది కాదు. శరణాగతరక్షణం పరమధర్మమని, భయపడి, జంకి శరణు పొందినవానిని అతని శత్రువులు అప్పగించడం మహాపరాధమని తలచిన మునివరుడు ఆ విధంగా బదులు పలికాడు. "వీతహవ్యుడు ఇక్కడ లేదు" అని పచ్చి అబద్ధాన్ని పలుకకుండా, "ఇక్కడ ఉండేవారంతా బ్రాహ్మణులే, క్షత్రియుడెవ్వడూ లేడు" అని అనడం మునివరుని చాతుర్యం. ఇతరులు అనర్థాన్ని పరిహరించడం కోసంకూడా పచ్చి అబద్ధాన్ని ఆడకూడదు - అనేది ఇక్కడ తెలుపబడినట్లైనది. శరణాగత సంరక్షణమనే గొప్ప ధర్మం సిద్ధించాలంటే పచ్చి అబద్ధాన్ని కూడా ఆడవచ్చు- అని పలికే పెద్దలు కూడా ఉన్నారు.

ఈ విషయాన్ని ఇపుడు ఇంతటితో ముగిస్తాను. సత్యవచనంయొక్క యాథార్థ్యాన్ని మనవంటివారు వారు సులభంగా నిష్కర్షించడం సాధ్యం కాదు- అనేదే చివరి మాట. **"ధర్మస్య తత్త్వం నిహితం గుహాయామ్"** అని మహాభారతం లోను, **"సూక్ష్మః పరమదుర్జ్ఞేయః సతాం ధర్మః ప్లవంగమ!"** (ఓ వానరా! సత్పురుషుల ధర్మం సూక్ష్మమైనది, తెలియడానికి చాలా కష్టమైనది) అని శ్రీరామాయణంలో పల్కిన రీతిలో ధర్మసూక్ష్మాలు అల్పశ్రుతులకు తెలియడం అరుదు కనుక, ఇది సత్యం, ఇది అసత్యం - అని సులభంగా చూచి తెలియలేము - అనేదానిని తెలుపడం కోసమే ఇక్కడ ఇంత విస్తారంగా చెప్పబడింది.

## శ్రీరాముడు తన మాటతో వ్యక్తం చేసిన తన సత్యవాదిత్వం

ఇక, శ్రీరాముని సత్యవాదిత్వాన్నిగూర్చి చెబుతున్నాము. శ్రీరాముని మాటల వల్లనే వ్యక్తమయే రీతిని ముందుగా నిరూపిస్తాము. **"రామో ద్విర్నాభిభాషతే"** అని ప్రసిద్ధంగా వ్యవహరింపబడే శ్లోకం శ్రీరాముని నోటినుండే అవతరించింది. వనవాసానికి బయలుదేరడానికి ముందు శ్రీరాముడు కైకేయి వద్ద పలికే మాట - **"తత్ బ్రూహి వచనం దేవి! రాజ్ఞా యదభికాంక్షితమ్, కరిష్యే ప్రతిజానే చ రామోద్విర్నాభి భాషతే"** (దేవీ! ప్రభువునకు ఏది ఇష్టమో నాకు తెలియజేయి. దానిని నేను ఆచరిస్తాను. ప్రమాణం చేస్తున్నాను.రాముడనైన నేను రెండు మాటలను పలుకను) అనేది పూర్ణశ్లోకం. "ఆనపెట్టి పల్కుతున్నాను. శ్రీరాముని నోటి నుండి రెండు మాటలు రావు. ఒకసారే పల్కుతాడు. ఒక పలుకే పల్కుతాడు - అనే కీర్తి రామునకే తగినది" అని శ్రీరాముడే పలికాడు.

ఇంకొక సందర్భంలో కూడా శ్రీరాముడు తననుగూర్చి ఈ విధంగా పల్కడం గమనిస్తాము. అది సుగ్రీవుని ఉద్దేశించి పల్కిన మాట. **"అనృతం నోక్తపూర్వం మే న చ వక్ష్యే కదాచన, ఏతత్తే ప్రతిజానామి రామో ద్విర్నాభిభాషతే"** (కిష్కింధ-7-22) అనేది ఆ మాట. "ఇంతవరకు నేను అసత్యాన్ని పలుకలేదు. ఇకపై ఏనాడూ పలుక బోను. సత్యంపై ప్రతిజ్ఞ చేసి దీనిని పల్కుతున్నాను" - అనేదిఈ శ్లోకార్థం. ఇదే వార్తను ఆ సుగ్రీవునివద్దనే మళ్ళీ ఒక పర్యాయం (కిష్కింధ-14-14) పలికాడు.

## తననుగూర్చి పొగడుకోవడం తగును - అనే విషయాన్ని నిరూపించడం

ఈ విధంగా తన సత్యవాదిత్వాన్ని తానే పల్కడం ఆత్మప్రశంస - అనే దోషం లోకి చేరదా? **"పొయ్యనేన్ వన్దు నిన్ఱేన్ పొయ్యనేన్ పొయ్యనేనే"** అని ఆళ్వార్లు అను



సంధించి ఉపదేశించిన మార్గంకదా గొప్పది. ఆ దారిని వీడి, తనను తానే సత్యవాదిగా పొగడుతూ పల్కడం గుణసముద్రుడైన శ్రీరామునకు తగునా! - అని కొందఱు భావించవచ్చు. **"తన్నుడై యాఱ్ఱల్ ఉణరారిడత్తై త్తన్నైప్పుకఴ్దలుమ్ తకుమ్"** (తన గొప్పతనాన్ని తెలియనివారివద్ద తనను ప్రశంసించుకోవడంకూడా తగును) అని నన్నూల్ గ్రంథకారుడన్నాడు. సంస్కృతగ్రంథాలుకూడా ఈవిధంగా అనుమ తించాయి. తనకు గల గొప్పతనాన్నిగూర్చి పల్కి తీరవలసిన సమయంలో తప్పక చెప్పవలసి ఉన్నది.

## ప్రసంగవశాత్ దశరథుని సత్యవాదిత్వవిచారం

ఇక, శ్రీరాముని సత్యవాదిత్వం ఇతరుల మాటలద్వారా కూడా వ్యక్తమయే రీతిని, ఆ సత్యవాక్కు గొప్పతనంవల్ల కల్గిన ఫలాన్ని వివరిస్తాము. దానికి ముందు, దశరథచక్రవర్తి సత్యవాదిత్వాన్నిగూర్చి కొంచెం విచారిస్తాము. దశరథాత్మజుడైన శ్రీరాముడు సత్యవాది - అనే విషయాన్ని చెప్పాలా! తండ్రి అయిన దశరథ చక్రవర్తి సత్యవాదులలో ప్రధానుడుగా ప్రసిద్ధుడైనందున అతని కడుపున పుట్టిన శ్రీరాముడు సత్యవాది కావడంలో ఆశ్చర్యం ఏమున్నది? - అని బదులు పల్కుతారు. దీనినిగూర్చి ఇక్కడ కొన్ని విషయాలను ప్రస్తావించదలచాము. దశరథచక్రవర్తికి సత్యవాది- అనే బిరుదం గొప్పతనాన్ని కల్గించడం. **"పుణ్యైర్యశో లభ్యతే"** అని ఒక మహాకవి పల్కిన రీతిలో ఏదో అతని భాగ్యవిశేషంవల్ల, అంతే - అని చెప్పవలసి ఉన్నది. దశరథుని చరిత్ర విపులంగా మనకు లభించలేదు. లభించే చరిత్రనుబట్టి శాస్త్రానుసారం అతనిని సత్యవాది - అని చెప్ప అవకాశం ఉన్నదా? అని గమనించాలి. కైకేయికి అతడు ఏనాడో మాట ఇచ్చిన రెండు వరాలను శ్రీరాముని పట్టాభిషేకసమయంలో కాదనలేక శ్రీరాముని వనవాసానికి అంగీకరించాడనే కారణంచేత ఈ ప్రభువుకు సత్యవాది - అనే పేరు కల్గింది, ఇందులోని ఔచిత్యాన్ని గూర్చి కొంచెం విమర్శించి చూద్దాం.

కైకేయికి అతడు వరమిచ్చినది ఏ యుగాంతరంలోనో తెలియదు. ఇటువంటి వరం - అని నిర్దేశింపబడలేదు. ఇది ఈవిధంగా ఉండగా, ఈరాజు శ్రీరాముని స్వయంగా పిలిపించి, "రేపు నీకు పట్టాభిషేకం" అని పల్కడం ఊరు - వాడకు,నాడు- నగరానికి బాగా తెలుసు. అదికూడా ఒక్కమాఱు మాత్రమే చెప్పలేదు. పలుసార్లు అన్నాడు ఈవిధంగా పల్కిన మాటను తప్పినవాడు సత్యవాదిగా ఏరీతిలో కాగలడు? కైకేయికి వరం ఇచ్చినందుకు లోపాన్ని చెప్పవచ్చు. ఏవిధంగా అంటే,

శాస్త్రాలలో **"పంచానృతాని ఆహు రపాతకాని"** అని అంటూ అయిదు సమయాలలో అసత్యాన్ని పలుకవచ్చునని చెప్పబడింది. వివాహకాలం మొదలైన అయిదు సమయాలలో అసత్యాన్ని పలుకవచ్చునని చెప్పబడింది. వివాహకాలం మొదలైన అయిదు సమయాలు ఉదాహరింపబడ్డాయి. వాటిలో, **"ప్రాణాత్యయే"** అనేది ఒకటి. ప్రాణం పోయే సమయమైతే, ప్రాణరక్షణకోసం అసత్యం పల్కడం జరిగితే, అది పాతకం కాదు - అని స్పష్టంగా చెప్పబడింది. దశరథుడు కైకేయికి రెండు వరాలను ఇవ్వడం శంబరాసుర యుద్ధసమయంలో, ప్రాణాలకు అపాయం కలుగ బోయే సమయంలోనే జరిగింది - అనేది ఇతిహాసంవల్ల తెలుస్తున్నది. అందువల్ల ఆ వరప్రదానాన్ని అవశ్యం నెఱవేర్చి తీరాలనే నిర్బంధం లేదు.

ఏం? ఎందుకు నిర్బంధం లేదు? ప్రాణం పోయే సమయంలో అసత్య మాడితే పాపం కాదు - అనే శాస్త్రం సామాన్యశాస్త్రమే తప్ప, విశేషశాస్త్రం కాదు కదా! దానిని అనుసరించి తీరాలనే నిర్బధం లేదు. అందువల్ల కైకేయికి ఇచ్చిన వరాన్ని అనుసరించి దశరథుడు నెఱవేర్చకుండా ఉంటే, అది అతని సత్వవాదిత్వ గౌరవానికి గొప్పలోటు అవుతుంది కదా! - అని కొందఱు వాదించవచ్చు. ఇక్కడ తెలిసికోవలసిన విషయాన్ని వినండి.

శ్రీరామునకు రాజ్యాన్ని ఇస్తున్నట్లుగా దశరథుడు ఒకసారికి రెండు సార్లు పల్కడం మఱగు పరచడానికి వీలు కానిది కనుక, దీనిని ప్రభువు కైకేయి వద్ద ప్రస్తావించి పల్కి, "కైకేయీ! నీకు నేను చాలా కాలం క్రితం సాధారణంగా రెండు వరాలను ఇచ్చిన మాట నిజమే. దీనిని చేయాలి - అని అపుడు నీవు నన్ను అడుగలేదు. ఇపుడు నేను శ్రీరామునకు రాజ్యం ఇస్తానని పల్కినందున, ఆ మాటను ఇవ్వలేను. దానికి విరోధం లేని రీతిలో నీవు అడిగే వరాన్ని మాత్రమే నేను ఇవ్వగలను. గడచి పోయిన విషయాన్ని నీవు అడగడం తగినది కాదు" అని దృఢంగా పల్కి ఉండాలి. ఈ విధంగా పల్కడం వల్ల అతని సత్యవాదిత్వానికి ఏవిధమైన భంగం కలుగదు.

అంతేకాక, ఇంకొక విషయంకూడా ఇక్కడ గుర్తించవలసినది ఉన్నది. **"రామో విగ్రహవాన్ ధర్మః"** (రాముడు మూర్తీభవించిన ధర్మం.) అని మూర్తీభవించిన సిద్ధ ధర్మంగా చెప్పబడిన శ్రీరామునితో కలసి జీవించడాన్ని వీడి, ఆభాసధర్మమైన సత్యవచనాన్ని దశరథుడు ఆశ్రయించడం అతనికి దోషంగా కూడా చెప్పబడింది. ముముక్షుప్పడిలోని చరమశ్లోకప్రకరణంలో **"సర్వధర్మాన్ పరిత్యజ్య"** అనేచోట



శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన శ్రీసూక్తి- **"చక్రవర్తియైప్పోలే ఇఴవుక్కు ఉఱుప్పు"** (దశరథునివలె కోల్పోవడానికి హేతువు అవుతుంది) అనేది. ఇక్కడ శ్రీవరవరమునుల వ్యాఖ్యాన శ్రీసూక్తి ఈవిధంగా ఉన్నది - **"మున్బే వరప్రదానత్తై ప్పణ్ణివైత్తు, ఇప్పోదాక మఱుక వొణ్ణాదెన్ఱు ఆభాసమాన సత్యధర్మత్తై ప్పఱ్ఱి నిన్ఱు, "రామో విగ్రహవాన్ ధర్మః" ఎన్గిఱ పెరుమాళోడే కూడి వాఴ విరున్ద పేఱ్ఱై ఇఴన్ద దశరథచక్రవర్తియైప్పోలే"** (పూర్వం కైకకు వరాన్ని ఇచ్చి, ఇపుడు కాదనరాదనే ఆభాసధర్మాన్ని ఆశ్రయించి, **"రామో విగ్రహవాన్ ధర్మః"** అని చెప్పబడే సాక్షాద్ధర్మమైన శ్రీరామునితో కలసి జీవించే ప్రాప్యాన్ని కోల్పోయిన దశరథుని వలె) అనేది.

## ప్రసంగవశాత్తు దధిభాండుని వృత్తాంతం

శ్రీకృష్ణావతారంలో దధిభాండుడనే గొల్లవాని కథ ప్రసిద్ధమైనది. తల్లి ఎత్తిన చిన్న బెత్తాన్ని చూచి భయపడి పరుగుతీసిన శ్రీకృష్ణుని దధిభాండుడు దాచిపెట్టాడు. శ్రీకృష్ణుని పట్టుకొని కొట్టడంకోసం వెంబడించి వచ్చిన యశోద "నా కుమారుడు ఇక్కడకు వచ్చాడా?" అని ప్రశ్నించగా, "అతడిక్కడకు రాలేదు. అతడు నాకు తెలియదు" అని అసత్యమే పల్కిన దధిభాండుడు తన పెరుగుబానతో పాటు మోక్షాన్ని పొందాడు. సత్యవాది- అని పేరు పొందిన దశరథచక్రవర్తి నరకంతో సమానమైన స్వర్గాన్నే పొందాడు. ఇందువల్ల, దశరథుని సత్యవాదిత్వం భగవానుని కోల్పోవడానికి పనికి వచ్చినందున అసత్యంయొక్క ఫలాన్నే ఇచ్చింది - అని గ్రహించాలి.

## శ్రీరాముని సత్యవాదిత్వాన్ని రెండు రీతులలో నిరూపించడం

శ్రీరాముని సత్వవాదిత్వ మహిమను రెండు రీతులలో నిరూపించగోరు తున్నాము. ఈ చరిత్రలద్వారా శ్రీరాముని సత్వవాదిత్వం విశదంగా తెలుస్తున్నదని నిరూపించడం మొదటి రీతి. ఈ ఈ కథల ద్వారా శ్రీరాముని సత్యవాదిత్వానికిలోటు కన్పిస్తున్నదే? అని శంకించి పలికే వారి ఆక్షేపాలను ప్రస్తావించి, వాటికి సమాధానం తెలుపడం ద్వారా, ఆ సత్యవాదిత్వాన్ని సుస్థాపనం చేయడం రెండవ రీతి.

## "సత్యేన లోకాన్ జయతి" అనే సూక్తికి వివరణం

మొదటి రీతిలోని నిరూపణాన్ని ఆలకించండి. శ్రీరామునకు యువరాజు పట్టాభిషేకం జరుగబోతున్నది - అనే విషయాన్ని తెలిసిన కైకేయి మంథర ద్వారా

మనఃకాలుష్యాన్ని పొంది, కోపావేశాన్ని పొంది, దశరథునివద్ద శ్రీరాముని వనవాసాన్ని, భరతాభిషేకాన్ని ప్రస్తావించింది. అపుడు చక్రవర్తి మూర్ఛపడి, తర్వాత కొంతసేపటికి మూర్ఛనుండి తేరుకొని, ఆ కైకేయిని చూచి బదులు పల్కుతున్నాడు. "ఓ క్రూరురాలా! ఈ వంశాన్ని పాడు చేయడంకోసం వచ్చిన పాపీ! శ్రీరాముడు కాని, నేను కాని నీకు చేసిన హాని ఏదయినా ఉన్నదా? శ్రీరాముడు కన్నతల్లివలె నీకు సపర్యలను చేస్తున్నాడు కదా! అటువంటివానిపై నీవు రాతిమనస్సును కల్గి ఉన్నావే! ఈ దుర్బుద్ధి నీకు ఏవిధంగా కల్గింది? నీ స్వభావాన్ని తెలియక నిన్ను ఈ ఇంటిలోకి తీసికొని వచ్చిన నా బుద్ధిని కదా నిందించుకోవాలి. పక్షులు, జంతువులు, సకలప్రాణివర్గాలు కూడా కీర్తించే సద్గుణాలను, సత్కార్యాలను కల్గిన శ్రీరాముని నేను ఏవిధంగా వనానికి పంపగలను? శ్రీరాముని విడచి ఒక క్షణం కాలం అయినా నా శరీరంలో ప్రాణం నిలిచి ఉంటుందా? ఓసీ! పాపీ! నీవు కోరిన కోరిక నా ప్రాణాన్ని తీయగల్గినదిగా కదా ఉన్నది. ఈ క్రూరమైన మాటను ఏమాత్రం జంకకుండా నీవు నాదగ్గర పల్కినదే చాలు. ఇంతమాత్రంతో నీవు దీనిని విడచిపెట్టి పో. నీకు నేను భర్తనైనా, నీ పాదాలలో నా తలను వంచి నమస్కరించడానికి కూడా ఏమీ సందేహించను. నీ మనఃకాలుష్యం తీర్చుకొని నాపై దయచూపు" అని. ఈ విధమైన మాటలను పల్కినపుడు, శ్రీరాముని సద్గుణాలను శ్లోకాలతో శిలకూడా ద్రవించేటట్లుగా దశరథుడు పలికాడు, వాటిలో అత్యంతం ప్రధానమైన శ్లోకం. **"సత్యేన లోకాన్ జయతి దీనాన్ దానేన రాఘవః, గురూన్ శుశ్రూషయా ధీరో ధనుషా యుధి శాత్రవాన్"** అనేది. దీని అర్థమేమంటే - "శ్రీరాముడు సత్యవచన ప్రభావంతో సకలలోకాలను తన స్వాధీనంలో కల్గి ఉన్నాడు. దీనుల మనస్సును దానగుణంతో దోచుకొంటున్నాడు. యుద్ధరంగంలో వింటితో శత్రువులను జయిస్తున్నాడు"- అని. వీటిలో, **"సత్యేన లోకాన్ జయతి"** అనేది ప్రధానమైన విషయం. దీనికి పిమ్మట గల శ్లోకంలో కూడా **"సత్యమ్"** అని ఆరంభించి శ్రీరాముని సత్యవచనమహిమ కీర్తింపబడింది. ఈ రీతిలో పలువురు పలువిధాలుగా శ్రీరాముని సత్యత్వాన్ని గూర్చి పొగడి పల్కినా, పూర్వం ప్రస్తావించిన శ్లోకంలో **"సత్యేన లోకాన్ జయతి"** అని ఉండడం అనర్ఘమైన రత్నంగా కొనియాడబడుతున్నది. భగవద్విషయమహాచార్యులైన నంబిళ్ళైయొక్క వైభవంలో **"సత్యేన లోకాన్ జయతి"** అనే ఈ శ్లోకంయొక్క యుక్తమైన వివరణం అత్యంతం ఉన్నతంగా ప్రకాశిస్తున్నది. దానినిగూర్చి కొంచెం వివరిస్తాను.



## నంబిళ్ళై నిర్వాహవివరణం

భట్టర్ వంశంలో జన్మించి, గొప్ప విద్వాంసులై వెలిగిన నడువిల్ తిరువీథి ప్పిళ్ళై భట్టర్ - అనేవారు నంబిళ్ళై కాలంలో శ్రీరంగ నగరంలో నివసించేవారు. వీరు కూడా ఒకచోట స్వరూప (రహస్య) గ్రంథాలను ప్రవచిస్తూ ఉండేవారు. అయినా, ఎక్కువమంది నంబిళ్ళై గోష్ఠిలోనే అన్వయించేవారు భట్టర్ గోష్ఠిలో చాలా కొద్దిమంది మాత్రమే ఉండేవారు. అందువల్ల వీరికి నంబిళ్ళై పట్ల అసూయ కల్గింది. వీరు ఒకనాడు రాజసభకు వెళ్ళారు. ఆ రాజు గొప్ప వివేకి. తనవద్దకు వచ్చే పండితులను అందఱిని శ్రీరామాయణాది గ్రంథాలలో ప్రశ్నలను అడిగేవాడైనందున,ఈ భట్టర్‌ను కూడా శ్రీరామాయణంలో ఒక ప్రశ్నను అడిగాడు. అది ఏమంటే -

"శ్రీమన్నారాయణ మూర్తియే శ్రీరామునిగా అవతరించినా, శ్రీరాముడు నారాయణ ప్రయుక్తమైన గొప్పతనాన్ని పూర్తిగా మఱగు పఱచుకొని, మనుష్యభావననే పూర్తిగా ఆరోపించుకొని, అజ్ఞునివలె, అశక్తునివలె వర్తించాడని తెలుస్తున్నది. స్వామీ! ఈవిధంగా నేను గ్రహించినది యుక్తమైనదేనా? భ్రాంతి కాదు కదా!" అని చేతులను జోడించి పలికాడు. దానిని విన్న భట్టర్ "అవునవును. మీరు గ్రహించినది యుక్తమే. నారాయణత్వ ప్రయుక్తమైన పరత్వాన్ని విడచిపెట్టి, మనష్యభావనలోనే శ్రీరామమూర్తి నటించాడు. ఇందులో ఏమి సందేహం? ఈ రీతిని అంగీకరించినపుడే శ్రీరామాయణ కథ పొసగుతుంది" అని సమాధానం పలికారు. దీనిని ఆలకించిన ప్రభువు, "స్వామీ! ఆవిధంగా అయితే, శ్రీరాముడు **"మయా త్వం సమనుజ్ఞాతః గచ్ఛ లోకాననుత్తమాన్"** (నాచే నీవు అనుమతింపబడ్డావు. ఉత్తమ లోకాలకు వెళ్ళు.) అని పల్కి జటాయువునకు ముక్తిని నిచ్చిన వృత్తాంతం కన్పిస్తున్నది కదా! ఇది పొసగే రీతి ఏది? అపుడు శ్రీరాముడు, తన భార్య అయిన సీతాదేవి వెళ్ళిన దారిని తెలియలేక, "ఓ వృక్షమా! సీతను చూచావా? నెమలీ! నీవు చూచావా? కోయిలా! నీకు తెలుసా!" అని ఈవిధంగా జ్ఞానహీనులనుకూడా ప్రశ్నించే తల్లడిల్లిన స్థితిలో ఉన్నాడు. ఆ స్థితిలో జటాయువును చూచి "నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. మోక్షానికి పో"అని శ్రీరాముడు పలికాడంటే, ఇది యుక్తంగా కన్పించలేదే! ఇది పొసగే రీతిలో మేము సంతృప్తి పొందేటట్లుగా మీరు సమాధానం చెప్పగలరా?" - అని అన్నాడు.

ప్రశ్నను చూస్తే బలంగా ఉన్నది. భట్టర్‌కు సమాధానం స్ఫురించలేదు. కూరేశులు అనుగ్రహించిన అతిమానుషస్తవంలో **"పృచ్ఛామి కించన యదా కిల రాఘవత్వే"**

"**అక్షుణ్ణయోగపథమ్** (లోకపదమ్)" అని ప్రారంభమవుతున్న రెండు శ్లోకాలలో దీనిని ప్రశ్నించారనే విషయాన్ని స్మరించారే కాని, ఆ ప్రశ్నకు తృప్తికరమైన సమాధానాన్ని పలికే ఉపాయాన్ని భట్టర్ తెలియలేకపోయారు. వీరి అదృష్టవశంచేత అపుడు ఆ ప్రభువునకు వేఱొక కార్యంలో మనస్సు లగ్నమైనది. అంతేకాక, నంబిళ్ళై శ్రీసన్నిధిలో అలవాటుగా వారి సూక్తులను శ్రవణం చేసే పెద్దలు యాదృచ్ఛికంగా ఆ సభలో కన్పించారు. వారిని చూడగానే చాలా ఆనందాన్ని పొంది, భట్టర్ వారివద్దకు పోయి, ప్రభువు అడిగిన ప్రశ్నను ప్రస్తావించి, "ఈ విషయం నంబిళ్ళై గోష్ఠిలో విచారానికి వచ్చి ఉంటుందికదా! దీనికి నమ్బిళ్ళై చేసే అర్థనిర్వాహం ఏది?" అని రహస్యంగా ప్రశ్నించారు. అడిగిన వెంటనే ఆ పెద్దలు - **"సత్యేన లోకాన్ జయతి"** అనే శ్రీరామాయణ శ్లోకాన్ని పురస్కరించుకొని నమ్బిళ్ళై సమాధానాన్ని నిర్వహించగా విన్నాను" అని పలుకగా, భట్టర్ దానిని తమ మనస్సులో గ్రహించి, "ఇదే యుక్తమైన సమాధానం" అని నిశ్చయించుకొన్నారు. వేఱు కార్యంలో నిమగ్నుడైన ప్రభువు మళ్ళీ భట్టర్‌కు అభిముఖుడై, "స్వామీ! నా ప్రశ్నకు సమాధానం ఏమీ స్ఫురించలేదా!" అని అన్నాడు. దానికి భట్టర్ "మహాప్రభూ! స్ఫురించకేమి? అపుడే సమాధానం చెప్పడానికి సన్నద్ధుడనై ఉన్నాను. మీరు అన్యకార్యపరులై ఉన్నందున నేను సమయం కోసం ఎదురుచూస్తున్నాను. ఇపుడు వినండి" అని అవతారికను పల్కి, నంబిళ్ళై శిష్యుల దగ్గర ఆలకించిన అర్థనిర్వాహాన్ని వివరంగా పలికారు. అదేమంటే - శ్రీరాముడు తన సత్యవచన ప్రభావంతో సకలలోకాలను స్వాధీనపఱచుకొన్నాడు - అని దశరథ చక్రవర్తి పల్కినందున, ఆ సత్యవాక్యంయొక్క గొప్పతనమే జటాయువు నకు ముక్తినిచ్చింది. నారాయణత్వ ప్రయుక్తమైన పరత్వంతో ముక్తిని అనుగ్రహించ లేదు" అని.

## రాజసమ్మానవిశేషాలు

భట్టర్ ప్రభువుతో దీనినిగుర్చి వివరంగా చెప్పగా, ప్రభువు మేధావి కనుక చాలా ఆనందించి, ఈ రీతిలో తప్ప వేఱు విధంగా సమాధానాన్ని చెప్పడం పొసగదు- అని నిశ్చయించుకొని, మనస్సు లోపల తృప్తిచెంది, భట్టర్‌ను విశేషంగా సమ్మానించి పంపించాడు. భట్టర్, ప్రామాణికులైనందున, ఆ సత్కారాన్ని తమ గృహానికి తీసికొని పోవడానికి వారికి మనస్కరించలేదు. "నంబిళ్ళై శ్రీసూక్తి రత్నాకరంలో ఒక చిన్న తుంపురుకు పొందిన సత్కారం కదా ఇది" - అని మనస్సులో ద్రవించి, దానిని నంబిళ్ళై శ్రీచరణా లలో తీసికొనిపోయి సమర్పించి, దేవరవారి శ్రీసూక్తులనుండి



చిందిన ఈ మాటకు పొందిన సత్కారం ఇది. ఇంతవరకు దాసుడు మీకు దూరంగా ఉండి పొందిన అనర్థం చాలు. ఇక, మీ పాదరేఖగా, పాదరక్షగా నన్ను అంగీకరించి, దాసుని ఉజ్జీ వింపజేయాలి - అని వేరు తెగిన చెట్టు వలె వారి పాదాలలో పడి, వేడి ఉజ్జీవించారు - అని ఇతిహాసం.

ఇందువల్ల శ్రీరాముని సత్యవాక్యమహిమను మనః పూర్వాచార్యులు నిరూపించే రీతిని తెలియవచ్చు. ఇక, రెండవ రీతిలోని నిరూపణాన్ని వినండి. శ్రీరాముని సత్యవాదిత్వానికి శ్రీరామాయణకథను పురస్కరించుకొనే సందేహాన్ని శంకించి, దానికి పరిహారాన్ని పల్కుతున్నాము.

## శ్రీరాముని సత్యవాదిత్వాన్నిగూర్చిన శంకా-సమాధానాలు

శ్రీరామునకు పట్టాభిషేకం చేయాలని దశరథచక్రవర్తి నిశ్చయించి ఆజ్ఞను ఇచ్చాడు. దానికి పూర్వాంగంగా జరుగవలసిన కార్యకలాపాలు పూర్తి అయి, అభిషేకం జరుగబోయే సమయంలో కైకేయి మాటకు కట్టుబడి రాజు శ్రీరామునకు వనవాసాన్ని నియమించవలసి వచ్చిందనే కథాసందర్భం అందఱికి తెలిసినదే. పట్టాభిషేకం చేసికోవడానికి సిద్ధంగా ఉండే శ్రీరామునకు తలపై కిరీటం కాకుండా, జటలను, నార వస్త్రాలను కట్టుకొని, మంచి ఆహారాన్ని తినకుండా, కాయలను, దుంపలను భుజించి, రాళ్ళు ముళ్ళు నిండిన అరణ్యమార్గంలో సంచరించి, పద్నాలుగు సంవత్సరాల కాలం వనవాసం చేయడం సంభవించింది అంటే, నిజానికి అది దుఃఖంగా ఉంటుందా? లేక, ఆనందంగా ఉంటుందా? - అని మనం ఆలోచించినపుడు, ఇది తలరాత - అని ఒప్పుకొనవలసినదిగా సంభవించిన ఈ విషయంలో ఆనందం ఏవిధంగా కల్గుతుంది? యథార్థంగా దుఃఖమే కల్గుతుంది - అనే పలువురు భావించదగును; పలుకదగును. అయితే, ఇది పొరబాటు అభిప్రాయమే కాగలదు. రాజ్యాభిషేకం కంటే వనవాసంలో శ్రీరామునకు చాలా ఆనందం - అని అతని మాటలవల్లనే స్పష్టంగా తెలుస్తున్నది. **"మా చ లక్ష్మణ! సంతాపం కార్షీః లక్ష్మ్యా విపర్యయే, రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః"** (అయోధ్యా-22-29) అనేది శ్రీరాముడు తన నోరు తెరచి పల్కిన మాట. తమ్ముని చూచి పల్కిన ఈ మాటలో "మనకు రాజ్యం అయితే ఏమి? వనవాసం అయితే ఏమి!" అని మొదట పల్కి వెంటనే, **"వనవాసో మహోదయః"** - వనవాసమే గొప్పది - అని పల్కిన శ్రీరాముడు అసత్యం పలికేవాడు కాడు కదా.

### కంబకవిసూక్తి ప్రదర్శనం :

ఈ విషయాన్ని గూర్చి ప్రస్తావించే కంబకవి చాలా అద్భుతంగా పలికాడు "శ్రీరాముని ముఖవికాసాన్ని చూస్తే, అపుడే వికసించిన ఎఱ్ఱ తామరను జయించి నట్లున్నది" అని అంటూ **"కలక్కియ మా మనత్తనళాయ్ కైకేయి వరమ్ వేణ్డ మలక్కియ మామనత్తననాయ్ మన్నవనుమ్ మఱూదు ఒழியు, కులక్కుమరా! కాడుత్తైయ పో! ఎన్ఱా విడై కొడుత్త"** (కాలుష్యాన్ని పొందిన మనస్సును గల కైకేయి వరం అడుగగా, ఆమెకు వశుడైన మనస్సును గల ప్రభువు దశరథుడు కూడా దానిని కాదనలేక పోగా, ఓ కుమారా! నీవు అరణ్యానికి పో - అని ఆజ్ఞాపించగా.) సమయంలో శ్రీరామచంద్రునకు గల ముఖోల్లాసం **"ఇప్పొழுదు ఎమ్మనోరాల్ ఇయమ్బుదఱ్కెళిదో!"** (ఇపుడు మన వంటివారికి పల్కడం సులభమా!) అపుడు ఆ ముఖమండలాన్ని నేరుగా సేవించగల్గినవారు పలుక వలసినదే తప్ప, దానిని కళ్ళార దర్శించని నేను నా అల్పవాక్కులతో తెలియజేయా లని చూడడం అజ్ఞానమే కదా!- అని చేతులెత్తి నిలచిన కంబకవి, తిరిగి దానిని వర్ణించాలని ఆరంభించి, "వనవాస నియమనం పొందడానికి ముందు శ్రీరాముని తిరుముఖ మండలం తామరపూవుతో సాటి వచ్చే టట్లుగా మాత్రం చెప్పదగినట్లున్నది- అని, వనవాసనియమనం పొందిన తరువాత అయితే, అపుడే వికసించిన ఎఱ్ఱతామర పూవు వికాసంకంటే పది రెట్లు మించిన వికాసాన్ని పొందినదని పలికారు.

### "శ్రీరాముడు అసత్యవాది" - అనే పూర్వపక్షం

ఈ రీతిలో గొప్పగా పలుకడానికి కారణం **"వనవాసో మహోదయః"** అని శ్రీరాముడు పల్కి సూక్తియే. బాగా పరిశీలించి చూచినపుడు, ఇది అసత్యంగా పల్కిన మాటయే తప్ప, సత్యంగా పల్కినది కాదని, పట్టాభిషేక మంగళం తప్పిపోయిందే!- అనే దుఃఖమే శ్రీరాముని మనస్సు లోపల గూడు కట్టుకొన్నదని గమనించేటట్లుగా ఈమాట ఉన్నది. ఏవిధంగా? అంటే, శ్రీరాముడు పంచవటిలో సీతకు దూరమైన బాధతో విలపించేటపుడు **"రాజ్యాత్ భ్రంశో వనే వాసో నష్టా సీతా హతో ద్విజః, ఈదృశీయం మమాలక్ష్మీః నిర్దహేదపి పావకమ్"** (అరణ్య-67-25) (రాజ్యాన్ని కోల్పోవడం, అరణ్యంలో నివసించడం, సీతను కోల్పోవడం, జటాయువు వధ అనే ఈ నా దారిద్ర్యం చివరకు అగ్నిని కూడా దహిస్తుంది.) అని పల్కి విలపించడం స్పష్టంగా ఉన్నది. దీని అర్థమేమంటే- "లభించదగిన రాజ్యం, అయ్యో! లభించ కుండా పోయింది. రాజ్యం లభించక పోతే ఏమి!, నగరంలోనే ఒక మూలలో



నివసించి ఉండవచ్చు కదా! అదికూడా లేకుండా అరణ్యానికి వచ్చి పరిభ్రమించవలసి వచ్చింది. అటువంటిది కదా నా దారిద్ర్యం" అని.

ఈ రీతిలో విలపించే రీతిని చూస్తే రాజ్యాన్ని కోల్పోయి, వనవాసాన్ని పొందడం గొప్ప దుఃఖంగానే శ్రీరాముని మనస్సు లోపల నిలచి ఉన్నదని తెలుస్తున్నది కదా! మనస్సు లోపల ఈవిధంగా ఉండగా, **"వనవాసో మహోదయః"** అని అపుడు పల్కిన మాటను సత్యమే అని గ్రహించవలసినదిగా ఉన్నదా? - అని ఈవిధంగా పలువురు సందేహించవచ్చు.

### పూర్వం ప్రస్తావించిన పూర్వపక్షానికి సమాధానం

ఇక, దీనికి పరిహారాన్ని పల్కుతున్నాము. **"రాజ్యాత్ భ్రంశో వనే వాసః"** అని పరితపిస్తూ పల్కిన ఈ మాట ఏ సమయం లోనిది? ఎందువల్ల పలుకబడింది? అని బాగా గమనించి ఆలోచించాలి. సీతను విశ్లేషించినా, పరమభాగవతోత్తముడైన జటాయు మహారాజును కోల్పోయి పరితాపం సహించలేనిదిగా తోచిన సమయంలో వ్యక్తమైన సూక్తి ఇది. వనవాసాజ్ఞ లభించినపుడు **"వనవాసో మహోదయః"** అని పల్కినది ఏ అభిప్రాయంతో? అంటే, వినండి. జనకచక్రవర్తి సీతాదేవిని దాన జలధారాసహితంగా దానమిచ్చినపుడు, **"ఇయం సీతా మమ సుతా సహ ధర్మచరీ తవ"** అని పల్కి ఇచ్చారు. శ్రీరాముడు తాను చేయదగిన ధర్మానికి ఆమెను సహచారిణిగా చేపట్టడం దీనివల్ల స్పష్టమవుతున్నది. శ్రీరాముడు తాను చేయవలసిన ధర్మం ఏది? అంటే, శరణాగతపరిత్రాణమే. (ఈ విషయం "కః **ధర్మజ్ఞః**" అనే మూడవ ప్రశ్న యొక్క వివరణంలో విశదంగా తెలుపబడింది) సీతాదేవితో కలసి అరణ్యానికి వెళ్ళడం శరణాగతసంరక్షణమనే పరమధర్మాన్ని నెఱవేర్చడానికి అనుకూలమైనది అనే కుతూహలంతోనే. కాకాసురపరిత్రాణం - మొదలైన సమయాలలో సీతాదేవి అతని వెంట ఉండడంవల్ల ఆ సంరక్షణం సఫలం అయిన విషయాన్ని శ్రీరాముడు బాగా గ్రహించాడు. అటువంటి సీతాదేవిని విశ్లేషించిన దుఃఖం ఒకటి. పరమభాగవతులతో కలసి జీవించవచ్చు - అనే కుతూహలంతో అరణ్యానికి వచ్చినవానికి మహాభాగవతోత్తముడైన జటాయుమహారాజును కోల్పోయిన దుఃఖం ఇంకొకటి. ఇదే చాలా పెద్ద దుఃఖం. ఈ రెండు దుఃఖాలతో మనస్సు అతలా కుతలం అయినందువల్ల, అరణ్యానికి రావడం విపరీతంగాను, విపరీత ఫలంగాను అయినదే- అనే దుఃఖాతిరేకంతో **"రాజ్యాద్భ్రంశో వనే వాసః"** అనే శ్లోకం

ఆవిర్భవించడంలో అసత్యం (భ్రాంతి) ఏమీ లేదు. అందువల్ల **"వనవాసో మహోదయః"** అని పూర్వం పల్కినది అసత్యంగా భావించదగినది కానే కాదు.

## ఇక్కడ పొసగే ఒక (లౌకిక) దృష్టాంతాన్ని ప్రదర్శించడం

ఒక మహనీయులు, తిరువల్లిక్కేణి పార్థసారథిస్వామి మహోత్సవాన్ని సేవించాలని పలు సంవత్సరాలుగా ఎదురు చూస్తూ, చాలా ఆశతో అక్కడకు వచ్చి చేరారు. వచ్చిన చోట ఏవిధమైన సౌకర్యం లభించకుండా ఎండ, వాన మొదలైన కష్టాలలో చిక్కి, మార్గంలో పరిభ్రమించి, భగవత్సేవను కూడా పొందలేకపోతే, అపుడు వారి నోటినుండి పరితాపవచనాలు ఏవిధంగా వ్యక్తం కావచ్చునని ఊహించండి. "అయ్యో! మనం మన ఊరిలోనే సుఖంగా ఉండి ఉండవచ్చునే! ఎందుకోసం ఇక్కడకు వచ్చి బాధపడుతున్నాము? ఇదికూడా ఒక విధియేనా మనకు!" అని ఈవిధంగా పలుమార్లు పల్కి, ఆక్రందించడం సంభవిస్తుంది. ఇది అంతటా సంభావ్యమే. అసంభావితం కాదు. అందువల్ల ఏమి లోటు? ఊరి నుండి బయలుదేరి వచ్చేటపుడు వారికి ఉండే కుతూలహంలో కొఱత ఉన్నదని చెప్పగలమా! అసత్యమైన కుతూహలంతో బయలు దేరారు - అని చెప్పగలమా? ఏ ఆశతో మొదట కుతూహలం కల్గిందో, ఆ కోరిక తీరకపోతే పూర్వం ఉండే కుతూహలం మాఱిపోతుంది కదా! ఇది లోకంలో అంతటా కన్పించే స్థితియే కదా! శ్రీరాముని మాటలో **"వనవాసో మహోదయః"** అని వ్యక్తం అయినపుడు వనవాస కుతూహలం సత్యం గానే ఉన్నది తప్ప, అందులో అసత్యం అనేది కొంచెం కూడా లేదు - అనేది దీనివల్ల నిరూపింపబడింది. ఈరీతిలో శ్రీరామాయణంలో ఇంకా కొన్ని సందేహాలు కలుగవచ్చు. వాటికి ఈ విధంగానే పరిహారాన్ని గమనించాలి.

# 6. కః దృఢవ్రతః? (దృఢవ్రతుడెవడు?)

వాల్మీకి నారద సంవాదంలో **"కో దృఢవ్రతః"** అనే ఆఱవ ప్రశ్న ఇక వివరింపబడతున్నది. దృఢమైన వ్రతాన్ని కలవాడు ఎవడు? అని ప్రశ్నించాడు, వాల్మీకి మహర్షి. ఒకపనిని చేసి ముగించాలనే సంకల్పానికి వ్రతమని పేరు. ఆ సంకల్పం కొంచెంకూడా సడలకుండా దృఢంగా కాపాడుకోగల్గడం గొప్ప గుణం. ఏకాదశినాడు ఉపవాసం ఉండడం - మొదలైనవి లోకంలో మనవంటివారికి వ్రతమనబడతాయి. అయితే మనం దేనిలోను దార్ఢ్యాన్ని కల్గినవారం కాము. ఒక పనిని ఆరంభించేటపుడు అందులో చాలా ఉత్సాహాన్ని కల్గి ఉంటాము. కొన్నాళ్ళు గడవగానే అందులో శ్రమ కల్గి, ఇంకొక పనిలో దృష్టిని పెడతాము. అందులోను ఆవిధంగానే అవుతుంది. అందువల్ల దేనిలోను దార్ఢ్యాన్ని కల్గినవారం కాము, మనం. శ్రీరాముడైతే, దేనిలో అయినా స్థిరమైన నిశ్చయాన్ని కలవాడు. ఈ అరుదైన గొప్పగుణాన్ని ఇక్కడ మనం అనుభవించగోరుతున్నాము.



## శ్రీరాముని వ్రతం భక్తులను రక్షించడమే

శ్రీరాముడు ఏకార్యంలో దృఢమైన వ్రతాన్ని కల్గినవాడు? అనే ప్రశ్న ఇక్కడ కల్గుతుంది. అన్ని కార్యాలలోను దృఢమైన ఊనికను కల్గినవాడైనా, శ్రీరాముడు ముఖ్యంగా గ్రహించిన కార్యం ఒకటే. అదే శరణాగత పరిత్రాణ మనబడేది. సీతాదేవి రావణుని ఉద్దేశించి ఉపదేశం చేసేటపుడు **"విదితః స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః"** (శ్రీరాముడు ధర్మజ్ఞుడుగా, శరణాగత వత్సలుడుగా ప్రసిద్ధుడు కదా!) అని పల్కినందున శరణు పొందినవారిని "భయపడవద్దు" అని పల్కి అభయమిచ్చి, అనిష్టనివృత్తిని, ఇష్టప్రాప్తిని చేసి రక్షించడమే శ్రీరాముని ఈ అవతారంలో ముఖ్యమైన కార్యమని తెలుస్తున్నది. శ్రీవేదాంతదేశికులు కూడా అభయ ప్రదానసారం చివరలో **"నమస్తస్మై కస్మైచన భవతు నిష్కించనజనస్వయంరక్షాదీక్షాసమధికసమింధాన మహసే"** (అకించనులైనవారిని స్వయంగా రక్షించడమనే దీక్షతో కల్గిన గొప్పదైన కీర్తిని కలవాడైన అద్వితీయుడైన శ్రీరామునకు నమస్కారం.) అని పల్కిన మాట గమనించదగినది. అకించనులైన ప్రపన్నులను తన ప్రయోజనంగా భావించి రక్షించడంలో దీక్షను గ్రహించి, అదే గొప్ప కీర్తిగా వెలిగేవాడు, శ్రీరాముడు - అని ఇక్కడ ఉదాహరించిన సూక్తి భావం. ఆ ఆచార్యులే **"సర్వావస్థ సకృత్ప్రపన్నజనతా సంరక్షణైకవ్రతీ"** అని దశావతారస్తోత్రంలో పల్కడంకూడా గమనార్హం. భక్తులను రక్షించడం - అనేది ఉండనివ్వండి. అందులో దృఢమైన నిశ్చయాన్ని కలవాడు - అనేదే ఇక్కడ విషయం. దీనినిగూర్చి శ్రీరామాణంలోని రెండు సందర్భాలను ముఖ్యంగా ఉదాహరిస్తాము. ఆరణ్యకాండలోని 6, 8, 10వ సర్గలు మూడిటిలోని విషయాలను మొదలు నిరూపిస్తాము. ఆఱవ సర్గలోని కథ ఏమంటే - శరభంగముని ఆశ్రమానికి వెళ్ళిన శ్రీరాముడు ఆ ముని స్వర్గానికి వెళ్ళిన తరువాత అక్కడ ఉండే మునులతో ఈవిధంగా ప్రార్థింపబడ్డాడు - "శ్రీరామా! నీవు దేవేంద్రునివలె ఈ లోకానికి అందఱికి నాథుడవై ఉన్నావు. తండ్రి మాట ప్రకారం రాజ్యాధికారాన్ని, గొప్ప ఐశ్వర్యాన్ని కాదన్నావు, అంతేకాక, భరతుడు వచ్చి ఎంతగా ప్రార్థించినా

మనోనిశ్చయాన్ని కొంచెం కూడా సడలకుండా ఉండే నీ వద్ద ధర్మం, సత్యం మిక్కిలిగా వృద్ధి చెందుతున్నవి. శరణాగత రక్షకుడవైన నీ వద్ద ఒక విజ్ఞాపనను చేస్తున్నాము. రాక్షసబాధను సహించలేక ఈ విజ్ఞాపనను చేస్తున్నాము. ఇక్కడ బాధపడినవారంతా బ్రాహ్మణులే. వీరికి నీవు నాథుడవై ఉన్నా, అయ్యో! వీరు అనాథల వలె చాలా బాధను పొందుతున్నారు. వీరి దేహాలు రాక్షసులచే ప్రహరింప బడాడాన్ని చూడు. ఈవిధంగా వనంలో రాక్షసులపెట్టే బాధలను మేము భరించడంలో కానీ, ప్రతిక్రియను చేయడంలో కాని సమర్థులం కాకున్నాము. శ్రీరామా! ఇందుకోసమే మేమంతా నిన్ను శరణు పొందాము. రాక్షసుల బారినుండి మమ్ములను రక్షించు'' అని.

## దండకారణ్యమునులకు అభయప్రదానం

ఇంతగా ప్రార్థింపబడిన శ్రీరాముడు మనస్సులో చాలా జాలిపడి, వారిని అందఱిని చూచి, ''మునులారా! నన్ను మీరు ఆజ్ఞాపించడమే తప్ప, ఈవిధంగా ప్రార్థించవచ్చునా? మీ కష్టాలను తీర్చడం నా స్వంతప్రయోజనం కదా! తండ్రి మాటను పాలించడమనే నెపంతో మీ కార్యాలను నెఱవేర్చడంకోసమే నేను అనుమతిని పొందాను. మీకు కష్టాన్ని కల్గించే రాక్షసులను అందఱిని నేను లేకుండా చేయడం తథ్యం'' అని వారికి అభయాన్ని ఇస్తూ పలికాడు - అనేది ఆఱవ సర్గలోని కథ.

## శ్రీరాముడిచ్చిన అభయాన్ని సీతాదేవి కాదనడం

తరువాత, తొమ్మిదవ సర్గలోని కథ ఏమంటే - సీతాదేవి శ్రీరాముని ఉద్దేశించి ఈ విధంగా పల్కుతున్నది - ''నాథా! లోకంలో మూడు దుష్కార్యాలు చాలా క్రూర మైనవిగా చెప్పబడుతున్నాయి. అసత్యం పల్కడం, ఇతరుల భార్యలను కోరడం, శత్రుత్వం లేకుండా పరహింసను చేయడం - అనే ఈ మూడు చాలా క్రూర కార్యాలు. వీటిలో, మొదటి రెండు కార్యాలను నీవు మనస్సుతో కూడ భావించవు- అనే విషయం నాకు తెలుసు. నీవు సత్యసంధుడవు, ఏకపత్నీవ్రతాన్ని కలవాడవు. అయితే, మూడవ దుష్కార్యం ఇపుడు నీవిషయంలో అవకాశం పొందబోవడం మాత్రం చాలా బాధపడదగిన విషయం. నీవు మునులను కాపాడగోరి రాక్షసులను అందఱిని వధిస్తానని మాట ఇచ్చావు. ఇందుకోసంగా నీవు అరణ్యానికి వచ్చినట్లుగా తెలిపావు. దీనినిగూర్చి నేను బాధపడుతున్నాను. రాక్షసులకు, నీకు మధ్య సాక్షాత్తుగా శత్రుత్వం ఏమీ లేనపుడు, వారిని నీవు వధించగోరడం నేను ధర్మమని భావించను. మునులకు



హాని కల్గించే రాక్షసులను వధించడం ధర్మమే కాగలదని నీవు ఏవిధంగా భావిస్తావు? నీవు రాజ పదవిలో ఉంటే అపుడిది ధర్మమవుతుంది. క్షత్రియవృత్తిని వీడి, తాపస వృత్తిని పరిగ్రహించిన నీకు ఇది ధర్మం అవుతుందా? **"ఆఴ్రిశూఴ్ ఉలకమెల్లామ్ భరతనే యాళ నీ పోయ్, త్ఴ్రిరుమ్ శడైకళ్ తాఙ్గి త్తాఙ్గరున్తవమేత్క్కొణ్డు పూఴ్రివెఙ్కాన నణ్ణి ప్పుణ్ణియ పునల్కళ్ ఆడి వా"** (సముద్ర పరివేష్ఠితమైన ఈ భూమినంతటిని భరతుడు పాలించగా, నీవు జటాధారివై అరణ్యానికి పోయి, అక్కడ తీవ్రమైన తపస్సును ఆచరించి, అక్కడ గల పుణ్యతీర్థాలలో స్నానమాడి తిరిగి రా!) అని నియమింపబడి అరణ్యంలో సంచరించే నీవు ఆయుధాన్ని చేతధరించడమే తగినది కాదు. ఆరణ్యవాసానికి తపస్సు చేయడమే తగినది. ఆయుధం ధరించినందున కోపం కల్గి, పరహింస చేయడం జరిగి, పాపమే సంభవిస్తుంది. ధర్మమార్గంలో ఆసక్తిని కల నీవు తాపసవృత్తిని పరిగ్ర హించడమే యుక్తం. నీకు తెలియనిది ఏదీ లేదు. ఆడదానిగా పుట్టిన నేను నీకు ధర్మాన్ని గూర్చి తెలుపడం - అనేది తగనిదే అయినా, నీపైగల ప్రేమచేత తెల్పు తున్నాను. నీవు దీనినిగూర్చి నీ తమ్మునితో చక్కగా ఆలోచించి, నీకు ఇష్టమైనదానిని ఆచరించు''.

## సీతాదేవికి శ్రీరాముడు పల్కిన సమాధానం

ఇక, పదవ సర్గలో సీతాదేవికి సమాధానం చెప్పడంకోసం శ్రీరాముడు పల్కిన మాటలలో అత్యంతం సారమైన ఒక శ్లోకాన్ని ఇక్కడ ఉదాహరిస్తాను. **"అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే! సలక్ష్మణామ్, న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః"** (ఆరణ్య-10-19) (సీతా! నేను నా జీవితాన్ని విడచిపెడతాను. లక్ష్మణునితో పాటు నిన్ను కూడా విడచిపెడతాను. కాని, ఇచ్చిన మాటను విడచిపెట్టను. విశేషించి బ్రాహ్మణులకిచ్చిన మాటను ఏమాత్రం విడచిపెట్టను.) ఆశ్రిత రక్షణలో శ్రీరాముడు దృఢమైన వ్రతాన్ని కలవాడనే దానిని ఈ శ్లోకం చాలా చక్కగా నిరూపిస్తున్నది. మనవంటి అకించనులం నిత్యం చింతించదగిన శ్లోకం ఇది. ఈ శ్లోకంయొక్క అర్థమేమంటే - ''సీతా! నేను నా ప్రాణాలను సైతం విడిచినా విడుస్తాను. నిన్ను, లక్ష్మణుని కూడా విడిచినా విడుస్తాను. కాని, ఒకరికి ప్రతిజ్ఞ చేసి దానిని మీఱడం- అనేదానిని మాత్రం చేయను. అందులోను, బ్రాహ్మణులకు చేసిన ప్రతిజ్ఞను కొంచెంకూడా దాటను'' అని.

దీనికి పిమ్మట ఇంకొక శ్లోకం ఉన్నది. గమనించండి. **"సదృశం చానురూపం చ కులస్య తవ చాత్మనః, సధర్మచారిణీ మే త్వం ప్రాణేభ్యోఽపి గరీయసీ"** (ఆరణ్య-10-22) "సీతా! నేను చేయదలచిన ధర్మాన్నే నీవు కూడా సంకల్పించుకోవాలి. వేఱొక దానిని నీవు భావించరాదు. అటువంటి ధర్మాన్ని అనుష్ఠించడంలో సహాయం చేయడం కోసమే కదా నిన్ను నేను పరిణయం చేసికొన్నాను. అందువల్ల నా ప్రాణసఖిని అయిన నీవు నా మార్గంలో రావడమే తగినది" - అనేది ఈ శ్లోకభావం.

ఈవిధంగా శ్రీరాముడు ఆశ్రితసంరక్షణలో దృఢమైన నిశ్చయాన్ని కలవాడనేది ఈ కథాసందర్భాలవల్ల చక్కగా ప్రకాశిస్తున్నది. పైన యుద్ధకాండలో, విభీషణ శరణాగతి ప్రకరణంలో ఉంటే కథాసందర్భాన్ని పురస్కరించుకొని దీనిని సుస్థాపిస్తాము.

### విభీషణకథా ప్రస్తావం

రావణుని మంత్రాలోచనసభలో విభీషణుడు అతనికి పలుమార్లు హితోపదేశాలను చేసినా, ఫలించడం కన్పించనందున, శ్రీరాముని శ్రీచరణచ్ఛాయలో ఒదిగి, తాను ఉజ్జీవించాలని నిశ్చయించుకొని, తనతో సమానులైన స్నేహితులు నల్గురితో బయలుదేరి వచ్చి ఆకాశంలో నిలచాడు, వానరనాయకులను చూచి శ్రీరాముడు తనను అంగీకరించేటట్లుగా చేయమని గొప్ప కంఠధ్వనిలో ఆక్రందించాడు. అపుడు వానర వీరులలో సుగ్రీవుడు మొదలైనవారు "ఇతనిని చేర్చుకోవడం తగినది కాదు" - అని బలంగా ఆక్షేపించగా, అపుడు శ్రీరాముడు తనకు గల ఆశ్రితరక్షణపక్షపాతాన్ని, అందులో దృఢమైన వ్రతాన్ని ప్రస్తావించి పలికే సామర్థ్యం చాలా విస్మయనీయం. దానిని ఇక్కడ ప్రస్తుతిస్తాము.

### విభీషణునిపట్ల చూపిన నిశ్చయం

శరణాగతిని చేసిన ఆ విభీషణుడు తగిన కాలంలో రాలేదు, కనుక, మంచి బుద్ధితో రాలేదు కనుక పరిగ్రహించదగినవాడు కాడు - అనేదానిని గూర్చి పల్కడం ఆరంభించిన శ్రీరాముడు ఈ విధంగా అన్నాడు- "రావణుడు సీతను అపహరించి చాలా దినాలు అయినా, ముందుగానే మనవద్దకు వచ్చి చేరకుండా, మనం శత్రువుతో యుద్ధం చేయడం ఆరంభించిన ఈ సమయంలో మన వద్దకు వచ్చి చేరే ఈ విభీషణుడు మనతో కలిసినవానివలె ఉండడం (ఎందుకంటే) - మన రహస్యాలను అన్నిటినీ గ్రహించి, మనలను వంచనతో వధించడం కోసమే వచ్చాడేమో" - అని మీరు పల్కడానికి అవకాశం లేదు. మంచి బుద్ధిని చెప్పి, అన్నను ఏవిధంగా అయినా సంస్కరించాలి - అని ఇన్నాళ్ళు పలు రీతులలో ఇతడు ప్రయత్నించి చూచినా, అది ఫలించక పోవడమే కాక, ఆ రావణుడు తనను ఖండిస్తూ పలుకగానే, ఇతడు తాను ఉజ్జీవించగోరే మనవద్దకు వచ్చి చేరాడు.



ఇతనిని నేను ఏవిధంగాను వదలిపెట్టలేను. ఇతనిని అంగీకరించకుండా చేయి విడిస్తేనే మనకు శుభం, జయం కల్గుతుందని తేలినా, అది నాకు అంగీకార్యం కాదు. శరణాగతుడైన ఇతనిని అంగీకరించడంవల్ల మనకు అపజయమే కల్గినా, అంతకు మించి, మరణమే సంభవించినా, అదే మనకు అంగీకార్యమే. మనతో చాలా కాలంగా అలవాటు లేకుండా, ఉన్నవాడు ఇపుడు కొత్తగా వచ్చాడు - అని కాని, మహాపరాధి - అనిగాని ఇతనిలో లోపాలను పల్కి, ఇతనిని అంగీకరించకుండా గెంటివేయడాన్ని నేను ఏవిధంగాను ఎపుడూ అంగీకరించను. ఇతడు ఎటువంటివాడై ఉన్నా, "శరణు" అనే పదాన్ని పల్కిన కారణంగా, చిరకాలం మనతో అలవాటు పడినవానిని వలె ఆదరించదగినవాడే కాగలడు. మనచే అంగీకరించబడిన ఇతడు ఒకవేళ మనకు హాని చేసేవాడే అయినా, దానివల్ల, "శరణాగతునకు అభయాన్ని ఇచ్చాము" - అనే కీర్తి మనలను విడువదు. అందువల్ల ఇతనిని నేను విడచిపెట్టను.

### శ్రీరాముడు పల్కిన శిబిచక్రవర్తి ఇతిహాసం

అంతేకాక, మా కులానికి చెందిన ఒక ఇతిహాసాన్ని వినండి. శిబిచక్రవర్తి పరిపాలన చేసేటపుడు, అతని గొప్ప గుణాన్ని పరీక్షించడంకోసం ఇంద్రుడు పెద్ద డేగగా, యముడు చిన్న పావురంగా రూపొందారు. ఆ డేగ పావురాన్ని తరుముతూ రాగా, పావురం చక్రవర్తిని శరణు వేడింది. అతడా పావురానికి అభయం ఇచ్చాడు. తరువాత వచ్చిన డేగ - "నా ఆహారాన్ని విడచిపెట్టు" అని అడిగింది. ప్రభువు "శరణు పొందినవారిని ఆదరించకుండా విడచిపెట్టడం చాలా పాతకం. కనుక, దీనినితప్ప దేనిని నీవు అడిగినా ఇస్తాను" అని అన్నాడు.

డేగ, "ఈ పావురం బరువుకు సమానమైన మాంసాన్ని నీ దేహంనుండి ఖండించి ఇవ్వాలి" అని అన్నది, రాజు సమ్మతించి, వెంటనే తన శరీరంలోని అంగాలను అన్నిటిని ఒక్కొక్కటిగా ఖండించినా, అవి డేగతో సరితూగకపోవడం గమనించి, చివరకు తానే త్రాసు తట్టలో కూర్చుని తూకాన్ని తూచాడు. వెంటనే ఆ దేవతలు నిజరూపాలతో ప్రత్యక్షమై, చక్రవర్తిని చాలా పొగడి, అతని శరీరం ముందువలె పూర్ణరూపాన్ని పొందేటట్లు వరాన్ని ఇచ్చి వెళ్ళిపోయారు - అని విన్నాము.

అటువంటి గొప్పతనాన్ని కల్గిన చక్రవర్తివంశంలో పుట్టిన నేను ఇపుడు మీ ఆలోచనను విని, శరణాగతుని చేయి విడువడం తగినది కాదు. ఇతనిని చేర్చుకొన్నందువల్ల ఏవిధమైన అనర్థం కల్గినా, అది నాకు కీర్తికరమే కాగలదు తప్ప, నిందకు కారణం కాదు, కనుక, ఇతనిని నేను విడచిపెట్టను.

## శ్రీరాముడు పల్కిన కపోతోపాఖ్యానం

ఒక అరణ్యంలో వేటగాడొకడు ఒక ఆడపక్షిని పట్టుకొని తన చేతిబుట్టలో పెట్టుకొని సంచరిస్తూ ఉండగా, పెద్ద వర్షం వచ్చి, అంతా చీకటి కమ్ముకొన్నది. అపుడు ఆ వ్యాధుడు చాలా భయపడి, ఒక చెట్టు సమీపానికి వచ్చి నిలచాడు. ఆ సమయంలో ఆ చెట్టుపై ఉంటే మగపక్షి తన సహచారిణి విశ్లేషాన్ని సహించలేక ఆక్రందించింది. ఆ వేటగాని బుట్టలో చిక్కుకొని ఉండే ఆడపక్షి ఆ ఆక్రందనను విని, బాధపడి, "ఇదిగో! నేను ఈ వేటగాని బుట్టలో గతజన్మలో చేసిన కర్మఫలంగా బంధింపబడి ఉన్నాను. నాకోసం నీవు బాధపడవద్దు. మన నివాసానికి వచ్చి బాధపడుతూ నిలచిన ఈ వేటగానికి కలిగే చలి మొదలైన బాధలను తీర్చి, సహాయపడు" అని అన్నది. దానిని విన్న మగపక్షి ఆ వేటగానికి మనఃపూర్వకంగా వేటగానికి ఉపకారాన్ని చేయగోరి, ఒక మండే కొఱివిని తీసికొని వచ్చి, ఎండు ఆకులపై పడవేసి అంటించి, వేటగానిని చలి కాచుకొనమని పల్కింది. తరువాత అతడు ఆకలితో బాధపడడం గమనించి, ఆ పక్షి - "నేను పక్షిని అయినందున నీ ఆకలికి తగిన ఆహారం నా దగ్గర లేదే! దుఃఖానికి ఆశ్రయమై, దేనికీ పనికిరాకుండా ఉండే ఈ శరీరాన్ని గ్రహించి, నీ ఆత్మను తృప్తి పఱచుకో" అని అంటూ ప్రజ్వలించే నిప్పులో ఆనందంగా పడి, అతనికి ఆహారమై మరణించింది - అనే ఈ కపోతోపాఖ్యానం శ్రుతులలో ఉన్నది. ఒక అల్పజీవి అయిన పావురమే తనవద్దకు వచ్చిందనే కారణంగా తన భార్యను అపహరించడం కూడా లెక్కించకుండా, తన శరీరాన్ని ప్రాణాలను ఇచ్చి సహాయ పడినది - అంటే, గొప్ప జ్ఞానులనే పేరును కల్గిఉండే మనం, మనకు ఏ హాని కలుగజేయకుండా, మనలను శరణు పొందిన ఇతనిని "ఒకవేళ మన ప్రాణాలను ఏదయినా హాని కల్గుతుందేమో!" అని భయపడి, రక్షించకుండా విడచి పెట్టడం ఎంతమాత్రం తగదు. ఇతనిని ఏరీతిలోను నేను విడచిపెట్టను. "ఒకడు చేసిన మంచిని మఱచిన పాపివలె, పరతత్త్వమైన భగవానుని లేడని సాధించే నాస్తికుని వలె, శరణు పొందినవారిని కాపాడనివాడుకూడా నరకంలో తప్పక పడి దుఃఖిస్తాడు"- అనేది శాస్త్రవచనమై ఉండగా, నేను ఇతనిని చేయి విడుస్తానా! రాక్షసులను



సంహరించడంకోసం నేను దేవతలకు అభయాన్ని ఇవ్వడం - రావణుడు సీతను అపహరించాడనేదానిని ముందుగా తెలిసి కాదు. మనలను శరణు పొందినవారిని కాపాడడమే మన కర్తవ్యమనే భావనతోనే. దండకారణ్యవాసులైన మునులవద్ద "శరణు పొందినవారిని రక్షించడమే నా బాధ్యత" అని అపుడు నేను పల్కి ఇపుడు దానికి మాఱుగా అభయం కోరి వచ్చిన ఈ విభీషణుని విడచిపెట్టడం తగినదా? కానేకాదు. అందువల్ల ఇతనిని నేను చేయి విడువను.

## వ్యాఘ్రవానర సంవాదానువాదం

అరణ్యంలో సంచరించే ఒక వేటగానిని పులి తరిమింది. అతడు దానికి భీతిల్లి పరుగెత్తి ఒక చెట్టు పైకి ఎక్కి కూర్చున్నాడు. అక్కడ ఆ చెట్టుపై ఉండే ఒక కోతి అతనిని స్వాగతించి, ఆదరించింది. చెట్టు పైకి ఎక్కలేని పులి చెట్టు మూలలోనే వదలకుండా కూర్చున్నది. ఈ విధంగా ఉండగా, కొంతసేపటికి ఆ వేటగాని ఒడిలో కోతి నిద్రించింది. అపుడు పులి వేటగానిని చూచి "ఈ కోతిని నీవు కిందకు తోసివేయి. దీనిని తీసికొని నేను నా ఆకలిని తీర్చుకొంటాను. నిన్ను ఏమీ చేయకుండా విడచి పెడతాను" అని అన్నది. వేటగాడు ఆ విధంగానే కోతిని కిందకు గెంటివేశాడు. అపుడు పులి కోతిని చూచి, "నాకు నరమాంసంలోనే ఎక్కువ ఆశ ఉన్నది. నిన్ను మృత్యువు నోటిలో పడేటట్లు తోసిన వేటగానిని నాకు నీవు ఆహారంగా ఇచ్చినట్లయితే నీకు నేను ప్రాణభిక్ష పెడతాను" అని అన్నది. ఆ కోతి ఆ విధంగానే చేస్తానని అంగీకరించి, చెట్టుపైకి ఎక్కింది. వేటగాడు తన ప్రాణం పోయిందనే దృఢంగా తలచి, భయపడి జంకుతూ ఉన్నాడు. కోతి అతనిని చూచి "భయపడకు, భయపడకు" అని అభయాన్ని ఇచ్చి, పులిని చూచి "నావద్దకు వచ్చి నన్ను ఆశ్రయించిన శరణాగతుని నేను విడచిపెడతానా? విడచిపెడతానని కలలోకూడా అనుకోకు" అని పల్కి వేటగానిని కాపాడింది - అని వింటున్నాము. ఆ కోతికి ఉండే బుద్ధికూడా మనకు లేకుండా పోవాలా! ఏ రీతిలోను నేను ఇతనిని విడచిపెట్టను"- అని పల్కి శ్రీరాముడు తన నిశ్చయాన్ని వ్యక్తం చేశాడు, ఈ ప్రకరణంలో శ్రీరాఘవుని అమృత వాక్కులుగా వాల్మీకి మహర్షి పల్కిన రెండు శ్లోకాలు ప్రాణభూతాలు. వాటిని వినండి.

**"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన, దోషో యద్యపి తస్య స్యాత్ సతామేత దగర్హితమ్, సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ"** అనే ఈ శ్లోకాలు శ్రీరామచరమ శ్లోకాలుగా

గౌరవింపబడుతున్నాయి. శ్రీరాముడు దృఢవ్రతుడనే విషయాన్ని ఈ రెండు శ్లోకాలు దృఢపరుస్తున్నాయి. వీటిలోని ముందు శ్లోకంలో **"న త్యజేయం కథంచన"** అనేది ప్రాణస్థానీయం. తరువాత శ్లోకంలోని **"ఏతద్వ్రతం మమ"** అనేది ప్రాణభూతం. ఈ రెండు శ్లోకాలయొక్క మధురార్థవిశేషాలను సమర్థులైనవారివద్ద శ్రవణం చేయాలి.

ఈవిధంగా, శ్రీరాముడు శరణు వేడినవారికి కాపాడే క్రమంలో దృఢమైన వ్రతాన్ని కలవాడనే దానిని ఆ స్వామియొక్క సూక్తుల ద్వారా నిరూపించాము.

## 7) చారిత్రేణ చ కో యుక్తః

### (చారిత్రాన్ని-మంచి నడవడికను-కలవాడెవడు?)

వాల్మీకి - నారద సంవాదంలోని ఆఱు ప్రశ్నలు. ఇంతవరకు వివరింపబడ్డాయి. ఇక **"చారిత్రేణ చ కో యుక్తః"** అనే ఏడవ ప్రశ్నను వివరిస్తాము.

### చారిత్రమనే శబ్దానికి అర్థవివరణం

చారిత్రమంటే మంచి నడత. సత్ప్రవర్తన. దానితో కూడినవాడు (దానిని కలవాడు) ఎవడు? అనేది ప్రశ్న. సత్ప్రవర్తన అనేది సాధారణ నామం. పెద్దలను సేవించడం, తల్లిదండ్రులను ప్రేమించడం, శాస్త్రాలలో విధింపబడిన కర్మలను ఏ లోపం లేకుండా ఆచరించడం, దైవభక్తిని కల్గిఉండడం, ఇతరులను హింసించక పోవడం, ఇతరుల వస్తువులు, భార్యలు మొదలైనవానిని చౌర్యం చేయాలని మనస్సులోకూడా భావించకుండా ఉండడం-అని ఇటువంటి ప్రవర్తనలకు సాధారణమైన నామమే చారిత్రమనేది. చరిత్రమనే పదమే చారిత్రమని మాఱింది. ఇవి అన్నీ మనం శ్రీరామునిపట్ల ఋజువుగా చోటు చేసికొన్న అందాన్ని క్రమాను సారంగా అనుభవిద్దాం (దర్శిద్దాం).

### పెద్దలను సేవించడం

లోకంలోని మానవులను మనం మూడు విధాలుగా విభజిస్తున్నాము, మనకంటే పెద్దవారు, మనతో సమానులు, మనకంటే చిన్నదారు- అని. ఈ మూడు విధాలైనవారిలో, మనకంటె తక్కువగా ఉండేవారు కొంతమందో, ఎక్కువమందో ఉన్నారని అనుకోవడానికి మనం తగినవారం కాము. ఎందుకు? అంటే, అందఱికంటే మనమే చాలా చిన్నవారం - అనే అనుసంధానాన్ని చేయడమే మనకు తగినది కనుక, మనకంటే చిన్నవారు కొందఱు లేక, పలువురు ఉన్నారని భావించడం తగినది



కాదు. అయినా, సంసారజీవితంలో మన సంతానం, ఇంకా, సేవకులు మొదలైన వారిని మనకంటే పెద్దవారిగానో, మనతో సమానమైనవారి గానో మనం భావించడం లేదు. భావించడం కూడా సరికాదు. అందువల్ల మనకంటే తక్కువవారు - అనే ఒక వర్గం గ్రహించదగినదే. కనుక, ఉన్నతులు - సమానులు- తక్కువవారు - అని ఉంటారు. శ్రీరాముడు వాస్తవానికి శ్రీమన్నారాయణమూర్తియే కనుక, లోకం అంతా ఆయనకు దాసులై ఉండే క్రమంలో తక్కువవారే తప్ప, ఆయన కంటే గొప్పవారుగా గాని, సమానులుగా గాని ఎవరూ ఉండే ప్రసక్తి లేనే లేదు. అయినా, **"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్"** (నన్ను నేను మానవునిగా, దశరథుని పుత్రుడైన రామునిగా భావిస్తాను.) అని మానుషవేషాన్ని ధరించి వర్తించే ఈ అవతారంలో కొందఱిని తనకంటే పెద్దవారిని, తనతో సమానులని తన మనస్సులో భావించడం గమనిస్తాము. పెద్దలను సేవించడం - అనే పరమధర్మాన్ని అనుష్ఠించి చూపడంకోసమే శ్రీరామావతారమని తెలుస్తున్నదని. కదా! శ్రీరాముడు చేసిన కార్యం ఏదయినా పెద్దల నియమనాన్ని శిరసా వహించే చేసినట్లు కన్పిస్తుంది. దీనికి నిదర్శనంగా కొన్ని విషయాలను ప్రస్తావించి తెల్పుతాము.

### శ్రీరాముడు చేసిన కార్యాలు అన్నీ పెద్దల మాటలను అనుసరించే

శ్రీరాముడు చేసిన కార్యాలలో మొదటి కార్యం తాటకవధ. స్త్రీవధ చాలా పాపమనే లోకం అంటుంది. ఇది శ్రీరామునకు తెలియనిది కాదు. తెలిసినప్పటికీ ఈ స్త్రీ వధను ఎందుకు చేశాడు? శూర్పణఖను వధించి ఉండవచ్చు కదా! కాని, ఆమెను ప్రాణలతో విడచిపెట్టాడు! ఆమె లంకకు పోయి, రావణుని ప్రేరేపించి సీతాపహరణాది పలుకష్టాలను కల్గించింది. ఆమె ప్రాణాలనే తీసి ఉంటే ఏ దుఃఖం కల్గి ఉండేది కాదు కదా! తాటకకు అంగంభంగం చేసి తరిమివేసినా విశ్వామిత్ర మహర్షియొక్క యాగం చక్కగా పూర్తి అయి ఉండేది కదా! ఆమెను వధించవలసిన ఆవశ్యకత లేదే! ఈవిధంగా పొసగని పనులను శ్రీరాముడు ఎందుకు చేశాడు? - అని అంటూ ఇటువంటి ప్రశ్నలను పలువురు అడుగవచ్చు. విశ్వామిత్రముని తాటకను చూపించి "ఈమెను వధించు" అని ఆజ్ఞాపించినందున అది స్త్రీ వధ - అనికూడా చూడకుండా చేశాడు. శూర్పణఖ వచ్చిన కాలంలో ఆమెను వధించమని నియమించడానికి అక్కడ ఏ పెద్దలు లేరు. కనుకనే ఆమెను వధించకుండా అంగభంగంతో నిలిపివేశాడు. ఇందువల్ల, పెద్దలను సేవించడం, వారిని నియమాను సారం నడవడమే శ్రీరాముని వ్రతమని తెలియవచ్చు.

## శ్రీరాముని అరుదైన శ్రీసూక్తులు రెండిటిని ప్రదర్శించడం

ఇంతేకాక, శ్రీరాముడు విశ్వామిత్ర మహర్షిని చూచి - **"ఇమౌ స్మ మునిశార్దూల! కింకరౌ సముపస్థితౌ, ఆజ్ఞాపయ యథేష్టం వై శాసనమ్ కరవామ కిమ్?"** (మునివరా! మేమిద్దరమూ నీకు కింకరులమై ఉన్నాము. నీ ఏ ఆజ్ఞను పాటించాలో యథేష్టంగా తెలుపు.) అని పల్కడం గమనించాలి "మునిశ్రేష్ఠా! నేను, నా తమ్ముడు లక్ష్మణుడు నీవు ఆజ్ఞాపించిన సేవలను చేయడంకోసం వేచి ఉన్నాము. మేము చేయదగినవానిని నీ ఇష్టానుసారంగా ఆజ్ఞాపించు" అని వేడడం పై శ్లోక భావం. ఇందువల్లకూడా పెద్దలను సేవించడంలో శ్రీరామునకు మిక్కిలి కుతూహలం ఉన్నది - అని బాగా తెలుస్తున్నది.

ఈవిధంగా బాలకాండలో ఒక వృత్తాంతాన్ని ప్రదర్శించినట్లుగానే, చివరిలోని యుద్ధకాండకథలో ఒక వృత్తాంతాన్ని చూపి నిలుస్తాను. రావణవధ ముగిసిన తరువాత అతనికి చరమసంస్కారాలు చేసి పూర్తి చేసిన విభీషణాழ்వాన్ శ్రీరాముని చూచి ఈ విధంగా అర్థించాడు - "స్వామీ! లంకలో వచ్చి నిలచి, చల్లని నీటిలో స్నానమాడి, చక్కని వస్త్రాలను ధరించి, శ్రమకు చక్కగా తొలగించుకొని బయలుదేర వచ్చు కదా! ఈ మాత్రం అనుగ్రహాన్ని మీరు చూపాలి" అని. దానికి బదులుగా శ్రీరాముడు **"న మే స్నానం బహుమతం వస్త్రాణ్యాభరణాని చ, తం వినా కైకయీ పుత్రం భరతం ధర్మచారిణమ్"** (తమ్ముడు భరతుడు తల్లడిల్లుతూ ఉండగా నాకు ఇక్కడ స్నానం చేయడంగాని, పీతాంబరాలను ధరించడంగాని, ఆభరణాలను ధరించడం గాని - ఏవీ రుచించవు) అని పల్కి, భరతునకు మాట ఇచ్చిన ప్రకారం పధ్నాలుగు సంవత్సరాల కాలం పూర్తి అయినందున వెంటనే అయోధ్యకు బయలుదేరి తీరాలి - అని పల్కి, విభీషణుడు తీసికొనివచ్చిన పుష్పక విమానాన్ని ఎక్కి, అయోధ్యకు బయలుదేరాడు. దారిలో భరద్వాజముని ఆశ్రమంలో ఆ మునిని దర్శించడం తటస్థించింది. అపుడు ఆ ముని శ్రీరాముని చూచి "ఈనాడు నేనిక్కడ చేసే ఆరాధనను నీవు అంగీకరించి రేపే అయోధ్యకు వెళ్ళాలి" అని ఆజ్ఞాపించగా, దానిని మీఱకుండా, దానికి విరుద్ధంగా ఒక్క మాటనుకూడా పలుకకుండా, ఆ విధంగానే అంగీకరించాడు - అనేది యుద్ధకాండలో నూటఇరవై ఏడవ సర్గలో తెలుపబడింది. **"భరద్వాజస్య శాసనాత్"** (భరద్వాజుని ఆజ్ఞ వల్ల) అని ఆ మహనీయుని శాసనం శ్రీరామునకు మీఱరానిది అయినది. ఈవిధంగా శ్రీరామాయణంలో **"పితుర్వచన నిర్దేశాత్"** (తండ్రి ఆజ్ఞ వల్ల) అని, **"విశ్వామిత్రస్య శాసనాత్"** (విశ్వామిత్రుని ఆజ్ఞ వల్ల) అని, **"అగస్త్యవచనాత్"** (అగస్త్యుని ఆజ్ఞ వల్ల) అని, **"భరద్వాజస్య శాసనాత్"** అని- ఈ రీతిలో పలు ప్రమాణాలతో శ్రీరాముని కార్యాలకు అన్నిటికీ పెద్దల ఆజ్ఞయే కారణమని తెలుపబడడం చూడండి.



## శ్రీరాముని ప్రవర్తనలోని శంకా - సమాధానాలు

దీనికి పిమ్మట ఒక చిన్న ప్రశ్న కల్గుతుంది. శ్రీరాముడు ఈ విధంగా పెద్దల మాటలను మీఱకుండా వర్తించేవాడే అయితే, చిత్రకూటానికి వచ్చి చేరిన వశిష్ఠ భగవానుడు, జాబాలిముని మొదలైన పెద్దలు అయోధ్యకు తిరిగి రమ్మని బలంగా ఆజ్ఞాపించినప్పటికీ, శ్రీరాముడు దానికి అంగీకరించలేదు. ఎందుకు? - అని (ఆ ప్రశ్న). దీనికి బదులు వినండి. పెద్దలలో ముఖ్యుడైన తండ్రి ఆజ్ఞవల్లనే కదా శ్రీరాముడు వనవాసానికి బయలుదేరాడు. **"ఆழ్రి శూழ్ ఉలకమెల్లామ్ భరతనే యాళ, నీ పోయ్ త్తాழ్రిరుమ్ శడైకళ్ తాఙ్గి త్తాఙ్గరుమ్ తవమేఱ్కొణ్డు, పూழ్రి వెమ్‌కాన నణ్ణి పుణ్ణియ పునల్‌కళాడి ఏழ్రిరణ్డాణ్డిన్ వా వెన్ఱు"** (సముద్ర పరివేష్ఠితమైన లోకాన్ని అంతటిని భరతుడు పాలించగా, నీవు జటాధారివై, తపస్సుగా చేస్తూ, దట్టమైన అరణ్యంలోకి చేరి, పుణ్యతీర్థాలలో స్నానమాడి, పధ్నాలుగు ఏండ్ల తర్వాత తిరిగిరా) అని అతడు ఇచ్చిన ఆజ్ఞను నెఱవేర్చవలసి వచ్చింది. దానికి బదులుగా ఏ పెద్దలు ఏ ఆజ్ఞను ఇచ్చినా దానిని నెఱవేర్చడం న్యాయం కాబోదు.

ఆ విధంగా అయితే, వశిష్ఠుడు, జాబాలి మొదలైన పెద్దల మాటకు అంగీకరించి అయోధ్యకు తిరిగి రావడం, అయోధ్యకు చేరిన తరువాత, ఇంకా కొందఱు పెద్దలు వచ్చి, "శ్రీరామా! నీవు ఈవిధంగా తిరిగి రావడం తగినది కాదు! తండ్రి, తల్లి ఆజ్ఞను నెఱవేర్చకుండా తిరిగి రావచ్చునా? తిరిగి అరణ్యానికి వెళ్ళు" అని అంటే, ఆ పెద్దల మాటను అంగీకరించి మళ్ళీ అరణ్యానికి వెళ్ళడం, మళ్ళీ, అక్కడ కొందఱు పెద్దలు వేడితే, (లేక) నియమిస్తే, అయోధ్యకు తిరిగి రావడం - ఈవిధంగా ఒక వ్యవస్థ అనేది లేకుండాపోతుంది కదా! అందువల్ల పూర్వం చేసిన ఆక్షేపం తగినది కాదు.

## శ్రీరాముని మాతృభక్తి

చారిత్రమనే దానికి అర్థంగా మనం పల్కినదానిలో మొదటి అర్థాన్ని ఇంత వరకు వివరించాము. ఇక, రెండవ అర్థమైన తల్లిదండ్రులను గౌరవించడమనేది

ప్రత్యేకంగా వివరించనక్కరలేకపోయినా, కొంచెం వివరిస్తాము. శ్రీరామునకు తండ్రి పట్ల గల భక్తి అపరిమితమైనది. ఉపనిషత్తులలో **"మాతృదేవో భవ"** అని పల్కిన తరువాతనే **"పితృదేవో భవ"** అని పల్కినందున, పితృభక్తి కంటే మాతృభక్తియే శ్రీరామునిలో మిక్కిలిగా గొప్పది - అని తెలుస్తున్నది. అందులోను, అతని కన్నతల్లి కౌసల్య అయినా, సవతితల్లి అయిన కైకేయిపట్ల అధికమైన భక్తిని కలవాడు. ఇది ఏవిధంగా తెలుస్తున్నది? అంటే, వనవాసాన్ని చేస్తూ ఉండగా, లక్ష్మణుడు మాటికి మాటికి కైకేయిని ఖండిస్తూ నిందిస్తూ పలికేవాడు. భరతాళ్వాన్ యొక్క ప్రశంసను శ్రీరాముడు చేసేటపుడు, ఈవిధమైన మహాగుణశాలి అయిన భరతునకు కఠినురాలు, పాతకి అయిన కైకేయి ఏవిధంగా తల్లిగా అయినదో కదా!- అని అనడం ఆరంభించి, ఆ భరత ప్రశంసను కైకేయి నిందగా చేసి ముగించడం లక్ష్మణుని అలవాటు. అపుడు శ్రీరాముడు పలికే మాట ఏది? అంటే, **"న తేఽంబా మధ్యమా తాత! గర్హితవ్యా కదాచన, తామేవేక్ష్వాకునాథస్య భరతస్య కథాం కురు"** అని అనేవాడు. (లక్ష్మణా! నీవు ఏవిధంగాను కైకేయిని నిందించకూడదు. ఇక్ష్వాకు కుల తిలకుడైన మన తమ్ముడు భరతునిగూర్చి నీవెంత పల్కినా ఆ అమృతాన్నే చెవులారా వింటాను. అతనిని గూర్చి పల్కు) అనేది ఈ శ్లోకభావం. దీనివల్ల శ్రీరాముని మాతృభక్తి చక్కగా వ్యక్తమవుతున్నది.

## శ్రీరాముని వర్ణాశ్రమధర్మప్రావీణ్యం

శాస్త్రాలలో విధింపబడిన కర్మలను తప్పకుండా ఆచరించబడమనే చారిత్రం ఇక వివరింపబడుతున్నది. ఇక్ష్వాకువంశం ఆచారప్రధానమైన కులం. ఆ కులంలో పుట్టిన రాఘవుడు అనుష్ఠానాలలో చాలా గొప్పవాడు. వైదికానుష్ఠానాలను ఏలోటు లేకుండా అనుష్ఠించడంలో శ్రీరామునకు గల ఆసక్తి శ్రీరామాయణం లోని పలుచోట్ల తెలుపబడింది.

విశ్వామిత్రముని వెంట బయలుదేరి వెళ్ళిన శ్రీరాముడు ఒకచోట సాయం సమయంకాగానే శయనించి నిద్రించాడు. తర్వాత రాత్రి తెల్లవారి తూర్పుదిశలో సూర్యుడు **"కదిరవన్ కుణదిశై చ్చికరమ్ వన్దైణైన్దు, కన ఇరుళ్ అకన్ఱు, కాలై అమ్ పొழுదు"** (సూర్యుడు తూర్పుదిశలో ఉదయించాడు, దట్టమైన చీకటి తొలగి, ప్రాతఃకాలము అయినది.) అని అతనిని విశ్వామిత్రముని నిద్రలేపుతున్నాడు- **"కౌసల్యాసుప్రజా రామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే, ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్"** (కౌశల్యాదేవి సత్పుత్రుడవైన రామా! ఉదయ సంధ్యాకాలమైనది. నరశార్దూలా! నిద్ర లే! ఉదయ కాలంలోని కర్తవ్యాలను నిర్వహించాలి.) అని అంటూ. ఈ శ్లోకంలోని చివరి పాదంలో **"కర్తవ్యం దైవమాహ్నికమ్"** అనేది మిక్కిలి గమనించ దగినది. నిత్యకర్మానుష్ఠానాలను చేయడంలో శ్రీరాముడు మిక్కిలి శ్రద్ధను కల్గి ఉండేదానిని బట్టి **"కర్తవ్యం దైవమాహ్నికమ్"** అని అంటూ విశ్వామిత్రముని నిద్రలేపాడు.



స్నాన-సంధ్యావందన పంచమహాయజ్ఞాద్యనుష్ఠానాలకు ఆహ్నికమనిపేరు. భగవద్గీతలో గీతాచార్యుడు **"న మే పార్థాస్తి కర్తవ్యం... వర్త ఏవ చ కర్మణి"** (అర్జునా! నాకు కర్తవ్యమనేది ఏదీ లేదు... అయినా నేను కర్మలను ఆచరిస్తాను.) అని, **"యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః, మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః"** (నేను కర్మాచరణను సోమరితనంతో చేయకపోతే, మానవులంతా నన్ను అనుసరించి వారుకూడా కర్మలను చేయడం మానివేస్తారు.) అని కర్మానుష్ఠానంలో తాను సోమరితనం లేకుండా శ్రద్ధను కల్గి ఉండడాన్ని గూర్చి పలికాడు. దానినిగూర్చి ఆచార ప్రధానమైన శ్రీరామావతారంలో ఇక చెప్పాలా? జాతికి, ఆశ్రమానికి తగిన కర్మలను అనుష్ఠించడం కర్మనుష్ఠాన మనబడు తుంది. **"వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్, విష్ణురారాధ్యతే పంథా నాన్య స్తత్తోషకారకః"** (వర్ణాశ్రమాచారాలను ఆచరించే పురుషుడు పరమపురుషుడైన విష్ణువును ఆరాధిస్తున్నాడు. విష్ణువునకు సంతోషం కల్గించే వేఱొక దారిలేదు.) అని మొదలైన పలు ప్రమాణాలలో వర్ణాశ్రమాలకు తగిన ఆచారాలలో కొంచెంకూడా లోటు రాకూడదని తెలుపబడింది. వర్ణమంటే - బ్రాహ్మణాది జాతులు. ఆశ్రమాలంటే - బ్రహ్మచారిగానో, గృహస్థుడుగానో వానప్రస్థుడుగానో, సన్న్యాసిగానో ఉండడం. శ్రీరాముడు క్షత్రియజాతిలో పుట్టాడు. విశ్వామిత్ర మహాముని యాగాన్ని రక్షించడానికి వెళ్ళినపుడు బ్రహ్మచారి. తరువాత సీతను వివాహమాడి గృహస్థాశ్రమాన్ని పొందాడు. ఈ జాతికి, ఈ ఆశ్రమానికి తగినదిగా ధర్మశాస్త్రగ్రంథాలలో చెప్పబడిన కర్మలను ఏ కొఱత లేకుండా అనుష్ఠించా డనేది శ్రీరామాయణంలో అక్కడక్కడ తెలుపబడింది. సీతాదేవిని విశ్లేషించి పరితాపంతో పరిభ్రమించే కాలంలోకూడా కాలం తప్పకుండా సంధ్యావందనాన్ని చేశాడని వాల్మీకి మహర్షి తెలిపాడు. యుద్ధకాండ 5వ సర్గలోని చివరి శ్లోకం **"ఆశ్వాసితో లక్ష్మణేన రామ స్సంధ్యా ముపాసత, స్మరన్ కమలపత్రాక్షీం సీతాం శోకాకులీకృతః"**

(లక్ష్మణునిచే ఓదార్చబడిన శ్రీరాముడు తామర రేకుల వంటి కన్నులను కల సీతను స్మరిస్తూ, శోకంతో ఆర్తిని పొందినవాడై, సంధ్యను ఉపాసించాడు.) అనేది. ఈ విధంగా పలు సందర్భాలలో తెలుపబడింది.

భరతాళ్వాన్ శ్రీరాముని తిరిగి తీసికొని పోవడంకోసం చిత్రకూటానికి వచ్చేటపుడు హోమధూమాన్ని చూచి శ్రీరామాశ్రమం సమీపిస్తున్నట్లుగా తెలిసికొని ఆనందించాడని చెప్పబడింది (అయో-93-27వ శ్లోకం). సేనలను సమీకరించుకొని వచ్చే భరతునిపై అతిశంకను పొందిన లక్ష్మణుడు శ్రీరామునితో పలికేటపుడు - **"అగ్నిం సంశమతు ఆర్యః"** అని హోమాగ్నిని ఉపశమింపజేయమని అన్నాడు. హోమ ధూమంతో రామాశ్రమంయొక్క దారిని తెలిసికొని వచ్చే భరతునకు దారి తెలియకుండా పోవడంకోసం ఈ విధంగా లక్ష్మణునిచే చెప్పబడిందని వ్యాఖ్యానింప బడింది.

లంకకు పోవడానికి దారిని ఇవ్వవలసినదిగా ప్రార్థించి, సముద్రుని శరణాగతి చేసేటపుడు శ్రీరాముడు చేసిన అనుష్ఠానవిశేషాలను, విభీషణుడు శ్రీరాముని ఉద్దేశించి శరణాగతిని చేసినపుడు ఏ అనుష్ఠానాన్ని చేయకపోవడంగూర్చి విచారించిన నమ్బిళ్ళైవంటి మన పూర్వాచార్యులు శ్రీరామునకు గల ఆచారనిష్ఠను ప్రస్తావించి వివరించారు. **"వేల్‌వెట్టి ప్పిళ్ళైక్కు నమ్బిళ్ళై అరుళిచ్చెయ్‌ద వార్తైయై స్మరిప్పదు"** (వేల్‌వెట్టి ప్పిళ్ళైకు నమ్బిళ్ళై పల్కిన మాటను స్మరించాలి.) అనే శ్రీవచనభూషణ శ్రీసూక్తిని వివరించే సందర్భంలో మణవాళ మహామునులు పల్కిన విషయాన్ని కూడా గమనించాలి.

### మధ్యలో ఆక్షేప - సమాధానాలు

నిత్యనైమిత్తిక కర్మలను విష్ణుభక్తులుకదా అనుష్ఠించాలి! విష్ణువుకూడా అనుష్ఠించాలా? అని కొందరు అడుగవచ్చు. **"స హి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః, అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణు స్సనాతనః"** (దుర్మార్గుడైన రావణుని వధను కోరిన దేవతలచే ప్రార్థింపబడిన సనాతనుడైన విష్ణువు మానవలోకంలో అవతరించాడు.) అనే వాల్మీకివచనానుసారం విష్ణువే శ్రీరామునిగా అవతరించాడనేది వాస్తవమే అయినా, అవతార సమయంలో పరిగ్రహించే జాతికి, ఆచారానికి తగినట్లు ప్రవర్తించడం ఆవశ్యకం.



### చారిత్రమంటే దైవభక్తిని కల్గి ఉండడం

ఇక, దైవభక్తిని కల్గి ఉండడమనే చారిత్రం వివరింపబడుతున్నది. శ్రీమన్నారాయణమూర్తి అయిన పరదైవమే శ్రీరామునిగా అవతరించినప్పటికీ, లోక సంగ్రహాన్ని ఉద్దేశించి శ్రీరాముడు దేవతారాధన చేయడం శ్రీరామాయణ ప్రసిద్ధం. ఇక్ష్వాకువంశంలో అనాదికాలంగా శ్రీరంగనాథుని తిరువారాధన చేయబడేది. ఆ ఆరాధనను శ్రీరాముడుకూడా ఏలోటు లేకుండా నిర్వర్తించి, పట్టాభిషేక సమయంలో పలువురకు తనకు బహుమానాలు ఇచ్చేటప్పుడు, ఆ దివ్యమంగళ విగ్రహాన్ని విభీషణాళ్వాన్‌కు బహుమతిగా ఇచ్చినట్లు శ్రీరామాయణంలో స్ఫుటంగా తెలుస్తున్నది. అయోధ్యకాండలో **"సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగత్"** (6-1) (విశాలాక్షి అయిన తన పత్నితోపాటు నారాయణుని ఆరాధించాడు.) అని ఉన్నది. యువరాజ పట్టాభిషేకానికి అంగంగా శ్రీరాముడు, సీత నారాయణుని అర్చించినట్లు చెప్పబడింది. తరువాత, **"ధ్యాయన్ నారాయణం దేవమ్"** అనికూడా చెప్పబడింది. ఇక్కడ నారాయణుడు - అనేది తనకు ఆరాధ్యదేవత అయిన శ్రీరంగనాథుడే - అని పెద్దలంటారు.

### శ్రీరాముని దైవభక్తి అనే చారిత్రంయొక్క వివరణం

యుద్ధకాండలో **"లబ్ధ్వా కులధనం రాజా లంకాం ప్రాయాద్విభీషణః"** (కులధనమైన శ్రీరంగనాథుని పొంది ప్రభువైన విభీషణుడు లంకకు వెళ్ళాడు) అనేచోట వ్యాఖ్యానంలోకూడా సాంప్రదాయికమైన అర్థాన్ని పెద్దలు వివరించారు. భట్టర్ శ్రీరంగ రాజస్తవంలో నాల్గు శ్లోకాలలో దీనిని చాలా అందంగా పలికారు. పూర్వశతకంలోని చివరిశ్లోకంలో **"శ్రీరంగేందోః పదకిసలయే..... హేమాంభోజైః నిబిడనికటే రామ సీతోపనీతైః"** అని అన్నారు. త్రేతాయుగంలో శ్రీరాముడు,సీతాదేవి అర్చన చేసిన పుష్పాలు ఈనాటికీ శ్రీరంగనాథుని శ్రీపాదసమీపంలో ప్రకాశిస్తున్నాయని ఈ శ్లోకంలో చెప్పబడింది. తరువాత, ఉత్తర శతకంలో **"సర్గాభ్యాసవిశాలయా నిజధియా"** అనే శ్లోకంలో, శ్రీరంగనాథుడు చిరకాలం చతుర్ముఖునిచే ఆరాధింప బడ్డాడని తెలుస్తున్నది. దానికి పిమ్మట **"మనుకులమహీపాల"** అనే శ్లోకంలో **"మైథిలీరమణవపుషా స్వేన స్వార్హాణి ఆరాధ్యనాన్యసి లంభితః"** (సీతాదేవికి భర్త అయిన శ్రీరామునిరూపంలో నీ చేత నీవే తగిన ఆరాధనలను పొందింపబడ్డావు - ఆరాధింపబడ్డావు.) అని శ్రీరామునిచే, సీతాదేవిచే ఆరాధింపబడ్డాడని తెలుస్తున్నది. దానికి పిమ్మట గల

శ్లోకంలో విభీషణాఖ్యాన్‌కు లభించినది మనవంటి వారికి కూడా లభిస్తూ ఉండే విషయాన్ని తెలియజేశారు. ఈ విధంగా ఈ వివరాలవల్ల శ్రీరాముని దైవభక్తి వ్యక్తమవుతున్నది.

### ఇతరులను హింసించకపోవడమనే చారిత్రంయొక్క వివరణం

ఇక, ఇతరులను హింసించకపోవడం అనే చారిత్రాన్నిగూర్చి వినండి. లేప్రాయంనుండి తాటకాతాటకేయ ఖరదూషణలంకేశ్వరాది నిరసనలను అపరిమితంగా చేసిన శ్రీరాముని వద్ద ఇతరులను హింసించకపోవడమనే గుణాన్ని నిరూపించడం సాధ్యమా? అని కొందఱు భావించవచ్చు. దండించదగిన దోషులను కఠినంగా దండించే ప్రభువుకు, వ్యాధి తీరడంకోసం రోగిని శస్త్రక్షారాగ్నికర్మలతో బాధపెట్టే వైద్యుని పరహింసాశీలురుగా అనేవారెవరూ ఎవరూ లేరు కదా! అదేరీతిలో **"వినాశాయ చ దుష్కృతామ్"** (దుర్మార్గులను నాశనం చేయడం కోసం.) అని, **"మఙ్ణిన్ పారమ్ నీఙ్గుదత్కే"** (భూభారాన్ని తీర్చడం కోసమే) అని పలికే రీతిలో దుష్టులను శిక్షించడం కోసమే అవతారం చేసిన శ్రీరాముడు ఇతరులను బాధించడం, దోషంగా పర్యవసించదు. ఏకారణం లేకుండా పరహింసను చేయడమే ప్రబలదోషంగా భావింపబడుతున్నది. **"వ్యసనేషు మనుష్యాణాం భృంశం భవతి దుఃఖితః"** (మానవుల కష్టసమయాలలో శ్రీరాముడు మిక్కిలి దుఃఖాన్ని పొందుతాడు.) అని అయోధ్యానగర వాసులు ఏకకంఠంగా పల్కిన రీతిలో ప్రశంసించిన రీతిలో ఇతరుల దుఃఖాన్ని చూచి అయ్యో! అని జాలిపడే స్వభావాన్ని కలవాడైన శ్రీరామునకు ఇతరులను హింసించడం - అనే దోషం సంక్రమించే ప్రసక్తి లేనేలేదు.

శుకుడనే రాక్షసుడు సముద్రతీరంలో శ్రీరామసైన్యంలోకి ప్రవేశించి కొన్ని మాటలను పలుకగా, వానరవీరులు అతనిని వధింపబోయారు. కరుణామూర్తి అయిన శ్రీరాముడతనిని విడిపించి రక్షించడం యుద్ధకాండ ఇరవైయవ సర్గలో విశదం.

### శ్రీరాముని ఏకదారావ్రతమనే చారిత్రంయొక్క గొప్పతనం

ఇక, పరుల ద్రవ్యాలు, దారలు - మొదలైనవానిని మనస్సుతో కూడా ఆశపడక పోవడమనే చారిత్రం శ్రీరాముని విషయంలో మనం వివరించాలా? వాల్మీకి రామాయణం ఆరణ్యకాండలో తొమ్మిదవ సర్గ అంతా శ్రీరాముని ఉద్దేశించి సీతాదేవి పలికే మాటలతో నిండి ఉన్నది. (అంటే- అది - ఏకదారావ్రతాన్నిగూర్చి) సీతాదేవియే చాలా ప్రశంసించి పల్కినది. లోకంలో, అసత్యాన్ని పల్కడం, ఇతరులను బాధించడం,



పరభార్యలను ప్రేమించడం - అనే ఈ మూడు దోషాలనుండి తప్పుకొని జీవించడం అరుదని, ఆ సత్యాన్ని పల్కడం, పరభార్యలను కాంక్షించడం - అనేది శ్రీరాముని విషయంలో కొంచెంకూడా లేదని సీతాదేవి ఆనందించి పల్కింది. విశేషించి, ఇతరుల స్త్రీలను కోరడం శ్రీరామునిలో కొంచెంకూడా లేదనేదానిని నాల్గైదు శ్లోకాలతో పల్కింది. శ్రీరాముని జితేంద్రియత్వాన్ని గూర్చి అన్యులు పల్కడం ఉండనివ్వండి. సీతాదేవి తన మాటలతో ఈ విధంగా ప్రశంసిస్తూ పల్కడమే విశేషం.

### ప్రకృతవిషయంలో కొన్ని ఆక్షేపాలు

అయితే, దీనికి మాఱుగా శ్రీరామాయణంలో రెండు సందర్భాలు కనబడు తున్నాయి. ఈ విధంగా ప్రశంసిస్తూ పల్కిన తానే స్వయంగా, తరువాత సుందర కాండలో ఇరవై ఎనిమిదవసర్గంలో, సీతాదేవి తన ప్రాణాలను తానే త్యజించాలని నిశ్చయించు కొని పలు మాటలను పల్కి, ఆక్రందించేటపుడు, పధ్నాలుగవ శ్లోకం ఈవిధంగా కన్పిస్తుంది. **"పితుర్నిదేశం నియమేన కృత్వా వనాన్నివృత్తః చరితవ్రతశ్చ, స్త్రీభిశ్చ మన్యే విపులేక్షణాభిః త్వం రంస్యసే వీతభయః కృతార్థః"** - దీని అర్థమేమంటే- (తన మనస్సులో శ్రీరాముని సంబోధిస్తూ సీత పల్కిన మాట ఇది.) శ్రీరామా! నీవు నీ తండ్రిగారి ఆజ్ఞను ఏలోటు లేకుండా నెరవేర్చి, అరణ్యంలో నుండి నగరానికి వచ్చి చేరి, విశాలనేత్రాలను కల పలువురు స్త్రీలలో నిర్భయంగా ఆనందించ బోతున్నావు'' అని. సీతాదేవి నోటినుండి ఇటువంటి మాట రాదగునా?

ఇంకొక చోటుకూడా వినండి. యుద్ధకాండ ఇరవై ఒకటవ సర్గలో శ్రీరాముడు సముద్రతీరంలో సముద్రరాజుని ఉద్దేశించి, శరణాగతిని చేసిన వృత్తాంతాన్ని పలికే వాల్మీకి మహర్షి అపుడు శ్రీరాముడు తన భుజాన్ని తలదిండుగా చేసికొని పరుండిన రీతినిగూర్చి పల్కుతూ, ఆ భుజానికి ఒక విశేషణాన్ని **"భుజైః పరమనారీణా మభిమృష్ట మనేకధా"** (21-3) అని అన్నారు. శ్రీరాముని భుజం గొప్పవారైన పలువురు స్త్రీల చేతులతో పలుమార్లు స్పృశింపబడిన భాగ్యాన్ని పొందింది - అని ఈ శ్లోకంలో తెలుపబడింది. ఇది సంభావితమేనా? మనస్సులో అయినా భావించరానిది కదా. ఇది!

నారదముని వద్ద శ్రీరాముని కల్యాణ గుణాలనుగూర్చి విశదంగా ప్రశ్నించిన వాడు వాల్మీకిముని. ఉపదేశాన్ని చేసిన ఆ నారదముని శ్రీరామునిగూర్చి పలుకడం ఆరంభించగానే అని **"యతాత్మా"** అని అంటూ శ్రీరాముని జితేంద్రియత్వాన్ని

ప్రస్తావించి పలికారు. ఈవిధంగా విన్నప్పటికీ **"భుజైః పరమనారీణా మభిమృష్ట మనేకథా"** (గొప్ప స్త్రీలయొక్క బాహువులతో పలుమార్లు స్పృశింపబడినవాడు.) అని తమ నోటితో ఏవిధంగా పలికాడు? అని విమర్శించవలసినది ఆవశ్యకమే.

## పైన ప్రస్తావించిన ఆక్షేపాలకు పరిహారం

పైన ప్రస్తావించి పల్కిన రెండు సందర్భాలనుగూర్చి తేటపరుస్తాము. సుందర కాండలోని **"స్త్రీభి స్తు మన్యే విపులేక్షణాభి స్త్వం రంస్యసే వీతభయః కృతార్థః"** అని సీతాదేవి పల్కినదానికి కారణాన్నిగూర్చి పలికే కొందఱు "ప్రాణాలను విడచి పెట్టాలని నిశ్చయించుకొన్న కాలంలో దుఃఖం సహించలేక, తనను తాను మఱచి, ఏదేదో సీతాదేవి పల్కుతున్నది. దీనికి అర్థమే లేదు. ఇందువల్ల శ్రీరాముని జితేంద్రి యత్వానికి ఏవిధమైన కొఱత రాదు" అని అన్నారు. ఇది సమాధానం కాబోదు. మనకు తెలిసినదానిని దేనినో వ్రాస్తున్నాము, ఇక్కడ. పురుషులకు ఎన్నిమార్లు కావాలన్నా పునర్వివాహం చేసికొనే అధికారాన్ని శాస్త్రం ఇచ్చినందున, దానిని పురస్కరించుకొని సీతాదేవి పల్కింది.

"శ్రీరామా! నీవు అయోధ్యా మహానగరానికి చేరితే నీకు నేను లేకపోయినా, నీకు పిల్లనిచ్చేవారు ఉండకపోరు. నీవు వెంటనే పునర్వివాహాన్ని చేసికొంటావు. ఆమెతో ఈవిధంగా అరణ్యానికి వచ్చి, ఆమెనుకూడా ఒక రాక్షసుడు అపహరించడం చూడబోతావు. తిరిగి నగరానికి వచ్చి, మళ్ళీ వివాహం చేసికొంటావు. ఈ విధంగా యథేష్టంగా పలు వివాహాలను చేసికొని, నీవు ఆనందంగా జీవిస్తావు. మగవాడుగా పుట్టినవారికి ఏమీ కొఱత?" అని పల్కడమే తప్ప, శ్రీరాముని ఏకపత్నీ వ్రతత్వానికి భంగంగా పల్కిన మాట కాదు. ఇది ఆ విధంగా సీతాదేవి మనస్సులో కూడా భావించే ప్రసక్తి లేదుకదా!

ఇక, యుద్ధకాండలోని **"భుజైః పరమనారీణా మభిమృష్ట మనేకథా"** అనే చోటు కూడా చక్కగా పొసగుతుంది. వాస్తవానికి, పరాత్పరుడైన శ్రీమన్నారాయణుడు, తాను సర్వలోకశరణ్యుడైనా, అయ్యో! ఈ విధంగా ఒక క్షుద్రుని ఉద్దేశించి శరణాగతిని చేస్తున్నాడే! - అనే పరితాపం వాల్మీకి మహర్షి మనస్సులో నిలచి ఉన్నందున, శ్రీరాముడు పరమాత్మ - అనే విషయాన్ని తాము అనుసంధిస్తూ పలికే మాట ఇది. ఇక్కడ **"పరమనారీణామ్"** అనేది పరస్త్రీలను ఉద్దేశించి పలుకలేదు. **"ఉడనమర్ కాదన్ మకళిర్ తిరుమకళ్ మణ్మకళ్ ఆయర్ మడమకళ్"** (నీకు ఇష్టదేవేరులైన



లక్ష్మీదేవి, భూదేవి, నీళాదేవి) అని నమ్మాళ్వార్లు, **"తేడిత్తిరుమాకళ్ మణ్మకళ్ నిఱ్ప", "తక్కార్ పలర్ దేవిమార్ శాల ఉడైయార్"** (తగినవారైన పలువురు దేవేరులను కల్గినవారు.) అని తిరుమంగై ఆళ్వార్లు **"దేవ్య స్సహస్రం తథా"** అని శ్రీగుణరత్న కోశంలో భట్టర్ పల్కిన రీతిలో శ్రీదేవి, భూదేవి, నీళాదేవి మొదలైన దివ్యమహిషులను ఉద్దేశించి పల్కిన మాట ఇది. మునుముందుగా చూపిన సుందరకాండ శ్లోకానికికూడా ఈ అర్థాన్ని గ్రహించడంలో కూడా లోటులేదు. ఈ విధంగా శ్రీరాముని జితేంద్రియత్వానికి ఏరీతిలోను కొఱత పలికే అవకాశమే లేదు. ఇంతవరకు **"చారిత్రేణ చ కో యుక్తః"** అనే ప్రశ్న వివరింపబడింది.

# 8) సర్వభూతేషు కో హితః?

వాల్మీకి - నారద సంవాదంలో **"సర్వభూతేషు కో హితః?"** అనేది ఎనిమిదవ ప్రశ్న ఇకపై వివరింపబడుతున్నది.

## సామాన్యంగా ప్రియ-హితాల వివరణం

లోకంలో మనపట్ల ప్రేమను కల్గినవారిని రెండు విధాలుగా చూస్తున్నాము. కొందఱు హితపరులుగా ఉంటారు; మఱికొందరు ప్రియపరులుగా ఉంటారు. ప్రియమంటే ఏమి? హితమంటే ఏమి? అని ముందుగా తెలిసికోవాలి. తాత్కాలికంగా రుచించేది - ప్రియంగా ఉండేది - ఏదో, అదే ప్రియమనబడుతుంది. తాత్కాలికంగా ప్రియంగా లేకుండా, ఇష్టంగా లేకపోయినా, తదనంతరకాలంలో చాలా మంచిని కల్గించగల్గినదిగా ఉండేది ఏదో అదే హితమనబడుతుంది. క్రమంగా వీనికి శర్కర పొంగలి, వేప ఆకుల మాత్రలు - అనేవానిని ఉదాహరణగా చెప్పవచ్చు. శర్కర పొంగలిని భుజించేటపుడు చాలా భోగ్యంగా ఉంటుంది. అయితే అది తరువాత కల్గించే కష్టం ముందు తెలియదు. వేప ఆకుల ఉండ, ఆముదంనూనె మొదలైనవి గ్రహించేటపుడు రుచించవు. అయినా, అవి తరువాత కాలంలో చాలా మంచిని కల్గిస్తాయి - అనేది అనుభవసిద్ధం కనుక, అవి హితమనే వర్గంలో చేర్చబడుతున్నాయి. తాత్కాలికంగా మనకు కష్టాన్ని కల్గించేవానిని అన్నిటిని హితమని గ్రహించడం వీలుకాదు. తేలు కుట్టడం, పాము కరవడం, దొంగలు సంపదను కొల్లగొట్టుకొని పోవడం మొదలైనవి దుఃఖాన్ని కల్గించేవి. అయినా, వీటివల్ల అనంతరకాలంలో మంచి ఏమీ కన్పించనందున, ఇవి కష్టాలు, ఆపదలు - అనే వర్గంలో చేరుతాయే

తప్పు, హితమని గ్రహించదగినవి కావు. అయినా, వీనినిగూర్చికూడా విచారణ క్రమంలో చెప్పదగిన విషయాలున్నాయి. వీటినిగూర్చి తరువాత పల్కుతాము.

## లోకంలో తల్లిదండ్రుల ప్రియ - హితపరత్వాలు

కుటుంబంలో తల్లి చేసే పనులను, తండ్రి చేసే పనులను చూస్తున్నాము తల్లి ప్రియపరురాలు - అని, తండ్రి హితపరుడని సాధారణంగా అందఱు అంటారు. తండ్రికి మనలను దండించడంలోనే పూర్తిగా దృష్టి ఉన్నట్లు కన్పడుతుంది. తల్లి కూడా కొన్ని సమయాలలో, కోపం ఎక్కువ అయినపుడు, దండించినప్పటికీ, సాధారణంగా తల్లి బిడ్డల ముఖం కందడాన్ని చూడలేదు. అందువల్ల తన సంతానానికి హితాన్ని చేయడంలోనే తల్లి దృష్టిని కల్గి ఉంటుంది. హితాన్ని చేయడంలోనే తండ్రి దృష్టిని కలవాడు - అని పెద్దలంటారు. అనుభవం కూడా దీనిని అనుగుణంగానే ఉంటుంది.

**"మేలా త్తాయ్ తన్దైయుమ్ అవరే ఇని యావారే"** (ఇంకా తల్లి, తండ్రి ఆ భగవానుడే. మిగిలిన బంధువులంతా అతడే.) అని, **"తఞ్జమాకియ తన్దై తాయొడు తానుమాయ్"** (రక్షకుడైన తండ్రి, తల్లితోపాటుగా తానై ) అని, **"తాయాయ్ త్తన్దైయాయ్ మక్కళాయ్ మ*ట్రు*మాయ్ ము*ట్రు*మాయ్"** (తల్లియై, తండ్రియై, సంతానమై ఇంకా సకలవిధ బంధువై) అని ఆ*ళ్వా*ర్లు పల్కిన క్రమంలో భగవానుడు మనకు తల్లియై, తండ్రియై ఉన్నాడు. **"మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతిర్నారాయణః"** అని సంస్కృతోపనిషత్తులు కూడా పల్కుతున్నాయి. అందువల్ల భగవానుడు మనకు తల్లిగా ఉండే క్రమాన్ని పురస్కరించుకొని ప్రియాలను చేయ గలడు. ప్రియాలను చేయడాన్నిగూర్చి ఇక్కడ విచారించడం లేదు. అప్రియాలైన హితాలను చేయడాన్ని గూర్చియే **"సర్వభూతేషు కో హితః"** అనే ప్రశ్న సముదయించింది.

## పెరుమాళ్ తిరుమొ*ళ్లి* ప్రబంధం వివరించిన హితపరత్వాన్ని నిరూపించడం

పెరుమాళ్ తిరుమొ*ళ్లి* ప్రబంధంలో కులశేఖరా*ళ్వా*ర్లు భగవానుని హిత పరత్వాన్ని గూర్చి **"తరు తుయరుమ్ తడాయేల్"** అనే అయిదవ దశకంలో పలు దృష్టాంతాలను ప్రస్తావించి చూపే క్రమంలో నిరూపించారు. వాటిలో, మూడవ, నాల్గవ పాశురాలలో ఉండే రెండు దృష్టాంతాలను మాత్రం ఇక్కడ ప్రస్తావిస్తాము. **"తాన్నోక్కా త్తుయరుమ్ శెయ్దిడుమ్ తార్ వేన్దన్ కోల్ నోక్కి వా*ళ్లు*మ్ కుడిపోన్రిరున్దేనే"** అని, **"వాళాల్ అఱుత్తు చ్చుడినుమ్ మరుత్తువన్ పాల్ మీళాద కాదల్ నోయాళన్ పోల్"** (వైద్యుడు తనను కత్తితో ఖండించి, కాల్చినా అతని పట్ల గౌరవం తగ్గని రోగివలే) అని అనుగ్రహించిన రెండు దృష్టాంతాలు గమనించదగినది. ప్రభువు దోషులైన జనులకు దండనను విధించడం హితబుద్ధితోనే. వైద్యుడు రోగికి పలువిధాలైన బాధలను (కష్టాలను) కల్గించి, చికిత్సను చేయడం హితబుద్ధితోనే. ఈ విధంగా భగవానుడు భక్తులకు కష్టాలను, దుఃఖాలను కల్గించడం హితబుద్ధితోనే - అని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి.



ఈ విషయాన్ని సంస్కృతవిద్వాంసులు కూడా **"హరిర్దుఃఖాని భక్తేభ్యో హిత బుద్ధ్యా కరోతి వై, శస్త్రక్షారాగ్నికర్మాణి హితబుద్ధ్యా యథా భిషక్"** (వైద్యుడు రోగికి శస్త్రాలద్వారా, ఉప్పు, కారం, నిప్పు మొదలైన వాటిద్వారా వైద్యాన్ని చేసినట్లు, హరి తన భక్తులకు దుఃఖాలను హితబుద్ధితో కల్గిస్తాడు.) అనే శ్లోకంతో పలికారు. కత్తితో ఖండించడం, కారం జల్లడం, నిప్పుతో కాల్చడం మొదలైన సహించలేని బాధను కల్గించే పనులను వైద్యుడు హితభావనతో చేసేటట్లే, భగవానుడు కూడా భక్తులకు హితబుద్ధితోనే దుఃఖాలను కల్గిస్తున్నాడు - అనేది పైన ఉట్టంకించిన శ్లోకంలోని భావం.

## హితపరత్వవిషయంగా తత్త్వత్రయశ్రీసూక్తివివరణం

తత్త్వత్రయమనే రహస్యంలోని ఈశ్వరప్రకరణంలో శ్రీపిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించిన అద్భుతమైన శ్రీసూక్తులను గమనించండి.

**"శిలరై సుఖికళాకవుమ్, శిలరై దుఃఖికళాకవుమ్ సృష్టిత్తాల్, ఈశ్వరనుక్కు వైషమ్య- నైర్ఘృణ్యజ్గళ్ వారాదో? ఎన్నిల్, కర్మమడియాక చ్చెయ్‌కైయాలుమ్, మణ్ తిన్ఱ ప్రజైయై నాక్కిల్ కుఱిప్పిట్టు అఞ్జప్పణ్ణుమ్ మాతావైప్పోలే, హితపరనాయ్‌చ్చెయ్ కైయాలుమ్, వారాదు"**

ఈ శ్రీసూక్తిలోని భావం ఏమంటే - భగవానుడు చేతనులకు కరణ-కళేబరాలను కల్గించడం అనే సృష్టిని చేసేటపుడు, ఆత్మలన్నిటిని ఒకే రీతిలో సృష్టించకుండా, కొందఱిని ఆనందంతో నిండి ఉండేటట్లు, మఱికొందఱిని దుఃఖాన్ని పొందేటట్లు సృష్టిస్తున్నాడే! దీనివల్ల ఆ భగవానుడు దోషం కల్గినవాడు కాబోడా? - అని అంటే, కాబోడు. రోగాన్ని కల్గించే మన్నును తినగోరి, దానిని తిన్న తన బిడ్డను ఇకపై మన్నును అతడు తినని రీతిలో అతని నాలుకపై వాతపెట్టి, ఇకపై మన్ను తినని రీతిగా

భయపెట్టే హితపరురాలైన తల్లివలె, ఈ చేతనులు ఇంకా ఇంకా దుష్కార్యా లను చేయడానికి భయపడే టట్లుగా, హితపరుడై చేసినందున దోషికా బోడు - అని.

## శ్రీరామునిలోని హితపరత్వనిరూపణమ్

ఈవిధంగా, ఇంతవరకు, భగవానుడు హితపరుడై ఉండే విషయం, తన్మూలంగా అతడు చేసేది నిరూపింపబడినవి. ఇక, దీనిని శ్రీరామాయణంలో దర్శింపజేసి, ఆనందింపజేస్తాను. శ్రీరాముడు కరుణయే మూర్తీభవించిన కాకుత్థ్సుడని శ్లాఘిస్తున్నారు. ఇతరుల బాధను చూచి అయ్యో! - అని జాలిపడేవాడైన శ్రీరాముడు కూడా ఇతరులకు కష్టాలను కల్గించడం గమనిస్తాము. రాక్షసకులానికి దుఃఖాలను కల్గించాడు - అనే దానినిగూర్చి ఇక్కడ చెప్పడం లేదు. అంతరంగ భక్తులుగా భావింపబడినవారికి కూడా కష్టాలను కల్గించినట్లుగా చూస్తాము. అది తగునా? అని పలువురు శంకింపవచ్చు. దీనికి ఉదాహరణంగా ఒకే ఒక సందర్భాన్ని ప్రస్తావించి చూపిస్తాను.

వర్షాకాలం గడచినప్పటికీ, పూర్వం చెప్పిన రీతిలో సుగ్రీవుడు సేనలతో రాలేదని మనస్సులో చాలా కోపాన్ని పొందిన శ్రీరాముడు, తమ్ముని పిలచి, సుగ్రీవునితో చెప్పవలసినదిగా పల్కిన మాటలు కాఠిన్యమే మూర్తీభవించినట్లున్నాయి. ఇక్కడ కంబరామాయణ పాశురాలను కొన్నిటిని ప్రస్తావించి చూపుతున్నాము.

**పెఱలరుమ్ తిరుప్పె*ఱ్ఱు*దవి ప్పెరుమ్**
**తిఱన్ నినైన్దిలన్ శీర్మైయిన్ తీర్న్దనన్**
**అఱమ్ మఱన్దనన్ అన్బు కిడక్క నమ్**
**మఱనతిన్దిలన్ వా*ఝ్*విన్ మయఙ్గినాన్**

దీని భావం ఏమంటే - అలభ్యలాభమైన రాజ్యపాలనాసంపదను సుగ్రీవుడు నావల్ల పొందినప్పటికీ, తనకు నేను చేసిన ఆ ఉపకారంయొక్క గొప్పతనాన్నిగూర్చి కొంచెంకూడా భావించడంలేదు. గొప్ప ప్రవర్తనను విడచిపెట్టిన స్వభావాన్ని బాగా ప్రదర్శించాడు. నేను అతనిపట్ల చూపిన ప్రేమను అతడు మఱచిపోవడం అనేది ఉండనీ. నా బలపరాక్రమాలనుకూడా అతడు మనస్సులో భావించకుండా మఱచి పోయాడు కదా! రాజ్యాధికారాన్ని పొంది, ఆనందించి జీవించే జీవితంలో మోహాన్ని పొందాడు.



**నన్జికొన్డు అరునట్పినై నారఱుత్తు**
**ఒన్డు మెయ్మ్మై శిదైత్తు ఉరై పొయ్త్తుళాన్**
**కొన్డు నీఙ్గుదల్ కు*ఱ్ఱ*త్తిన్ నీఙ్గుమాల్**
**శెన్డు మ*ఱ్ఱ*వన్ శిన్దైయై త్తేర్కువాయ్**

ఈ విధంగా తాను పొందిన ఉపకారానికి ప్రత్యుపకృతిని చేయకుండా, దానిని మఱచి పోయి, అరుదైన స్నేహాన్ని విడచి, అందఱికి తగినదైన (సర్వసాధారణమైన) సత్యాన్ని విడచి, మాట తప్పినవానిని వధించడమనేది నిందకు గాని, పాపానికి గాని విషయం కాదు. అందువల్ల ఆ సుగ్రీవుని దండించగోరాను. నీవు పోయి అతని అభిప్రాయాన్ని తెలిసికొని రా.

**వెమ్బు కణ్టకర్ విణ్బుక వేరఱుత్తు**
**ఇమ్బర్ నల్లఱమ్ శెయ్యు ఎడుత్త విల్**
**కొమ్బుముణ్డు అరుమ్ కూ*ఱ్ఱ*ము ముణ్డు, ఉఙ్గళ్**
**అమ్బు ముణ్డెన్డు శొల్లు నమ్మాణైయే**

దుష్టనిగ్రహం చేసి, ఈలోకంలో ధర్మాన్ని సుస్థాపించడంకోసం నాచేతబట్టిన విల్లు వాలితో నశించలేదు. ఇంకా ఉన్నది. యమధర్మరాజుకూడా ఉన్నాడు. వానర వీరులైన మిమ్ములను సంహరించగల్గిన బాణం నావద్ద ఉన్నది - అని ఈవిధంగా నా ఆజ్ఞగా సుగ్రీవునితో పల్కు.

**ఊరుమ్ మాళుమ్ అరుశుమ్ నుమ్ శు*ఱ్ఱ*ముమ్**
**నీరు మాళుదిరెన్బదు నేర్న్ద నాళ్**
**వారుమ్ వారవిరామెనిన్ వానర -**
**ప్పేరుమ్ మాళుమెనుమ్ పొరుళ్ పేశువాయ్**

కిష్కింధానగరంలో ఇళ్లు, రాజ్యం మీ బంధుమిత్రులు - అందఱు ఈ లోకంలో చిరకాలం జీవించాలనే కోరిక నీకు ఉంటే, లేకుండా పోవడమనే సత్యాన్ని నీవు పోయి అతనికి తెలియజేయి - అని శ్రీరాముడు లక్ష్మణునకు చెప్పి పంపించాడు.

వాల్మీకి రామాయణంలో కూడా కిష్కింధాకాండలో ముప్పైయవ సర్గలో ఈ విషయాన్ని గమనించవచ్చు. శ్రీరాముడు అక్కడ పల్కిన మాటలు ఏవి? అంటే "లక్ష్మణా! సుగ్రీవుడు మనవల్ల తన విరోధిని తొలగించుకొని, మనకు తానిచ్చిన

మాటను పూర్తిగా మఱచి, మన్మథ వికారాలలో మతి తప్పి వర్తిస్తున్నాడు. ఇపుడు వర్షాకాలం గడచినందున, రాజులు దండెత్తే సమయం కదా ఇది. సుగ్రీవుడు చేసిన మేలును మఱచిన ఘాతకుడై కన్పిస్తున్నాడే! నీవు వెంటనే సుగ్రీవుని దగ్గరకు వెళ్లి, "చేసిన మేలును మఱచిన పాపిష్ఠుడు మానవులలో అధముడు.

అతడు చనిపోయిన తర్వాతకూడ అతని శరీరాన్ని మాంసాన్ని తినే ప్రాణులు తినవు - అని పల్కు. లక్ష్మణా! సప్తసాలవృక్షాలను భంజించి, వాలిని వధించినందున నా పరాక్రమాన్ని గూర్చి సుగ్రీవుడు బాగా తెలిసినవాడైనా, అయ్యో! కొంచెంకూడా భయపడకుండా ఉన్నాడు. వాలిపోయిన దారి అతనికి కూడా (సుగ్రీవునకు కూడా) తెఱువబడి ఉన్నదని అతనివద్ద పల్కు. అతని బంధువులతో పాటు యమపురికి పంపడానికి నేను సిద్ధంగా ఉన్నానని తెలుపు" - అని.

## సుగ్రీవుని నిగ్రహంలో ఆక్షేప - సమాధానాలు!

ఈ విధంగా పల్కడం, ద్రోహబుద్ధిని పొందడం కరుణయే మూర్తీభవించిన శ్రీరామునకు తగునా! అగ్ని సాక్షికంగా చేసికొన్న ప్రాణమిత్రుడుకదా సుగ్రీవుడు. అతనివద్ద ఇంతటి ద్రోహచింతనను కల్గి ఉండడం ఎందుకు? అంతేకాక, అయోధ్యా కాండ - మొదటి సర్గలో - **"కథంచిదుపకారేణ కృతమేకేన తుష్యతి, న స్మరత్యప కారాణాం శతమప్యాత్మవత్తయా"** (ఏదో ఒకవిధంగా చేసిన ఒకేఒక్క ఉపకారంతో శ్రీరాముడు సంతోషిస్తాడు. వందలకొలది అపరాధాలను చేసినా మనసులో లెక్కపెట్టడు.) అని శ్రీరాముని గుణం ఆశ్చర్యకరంగా పొగడబడింది. ఇతరులు వందల సంఖ్యలలో తప్పులను చేసినా, వాటిని ఏమాత్రం మనస్సులో పెట్టుకోవడం లేదు - అని, బుద్ధిపూర్వకంగానో, అబుద్ధిపూర్వకంగానో ఒకడు చాలా ఒక చిన్న ఉపకారాన్ని చేసినా, దానిని గ్రహించి ఆనందపడేవాడు - అని పొగడబడిన శ్రీరాముడు ప్రాణమిత్రునిపట్ల ఈవిధంగా ద్రోహచింతనను కల్గి ఉన్నాడంటే, అది పొసగేటట్లుగా లేదే - అనే సందేహం కల్గుతుంది. దీనికి కూడా పరిహారాన్ని తెలిపే క్రమంలోనే **"సర్వభూతేషు కో హితః"** అనే ఈ ప్రశ్న ఆవిర్భవించింది. భగవానుడు ప్రియాన్ని చేసినట్లుగానే, హితాన్ని చేయడంలో కూడా దృష్టిని కల్గినవాడు... కనుక, పూర్వం వివరించిన ఐతిహ్యం వంటి ఐతిహ్యాలు హితకోటిలో చేర్చదగినవే కాగలవు.

రావణవధ అయిన తరువాత సీతాదేవి అగ్నిప్రవేశం చేయడానికి వీలుగా శ్రీరాముడు పల్కిన కఠినోక్తులు కూడా ఈ విధంగానే హితకోటిలోనికి చేర్చదగినవే.



నారదమునిని చూచి ప్రశ్నించే వాల్మీకిముని **"కో హితః?"** -అని ఇంతమాత్రమే ప్రశ్నించకుండా, **"సర్వభూతేషు కో హితః?"** అని ప్రశ్నించి ఉంటే, సర్వలోకేశ్వరుని స్వభావాన్ని మనస్సులో కల్గి ఉండే ప్రశ్నించినట్లుగా చక్కగా తెలుస్తున్నది. సర్వప్రాణుల వద్ద హితపరుడై ఉండే స్వభావం భగవానునకే కదా ఉన్నది. మనవంటివారికి ఎన్ని విధాలైన కష్టాలు సంభవించినా, వాటిని భగవత్సంకల్పంవల్లనే సంభవిస్తున్నాయని, కారుణికుడైన భగవానునిచే అవి హితబుద్ధిమూలంగానే కల్గించబడుతున్నాయని వాస్తవాన్ని గ్రహించే పెద్దలు గ్రహించగలరు. దీనిని బట్టియే **"హరిర్దుఃఖాని భక్తేభ్యో హితబుద్ధ్యా కరోతి వై"** అని శాస్త్రం కూడా తెల్పింది.

## 9. కః విద్వాన్? (విద్వాంసుడెవరు?)

వాల్మీకి నారద సంవాదంలో **"కః విద్వాన్"** అనే తొమ్మిదవ ప్రశ్న ఇక వివరింప బడుతున్నది. **"విద్వాన్"** అనే పదానికి "తెలిసినవాడు" అని అర్థం. దేనిని తెలిసిన వాడు? అనే ప్రశ్న వెంటనే కల్గుతుంది. అన్నిటిని తెలిసినవానికే **"విద్వాన్"** - అనే పేరు వ్యవహరింపబడుతుంది. లోకంలో, మానవులై పుట్టినవారు ఏదైనా ఒక విషయాన్ని గాని, లేక, పలు విషయాలు గాని తెలియకుండా ఉండరు. అటువంటి వారిని అందఱిని **"విద్వాన్"** అని వ్యవహరించడం లేదు. అనేక శాస్త్రాలను విశేషంగా తెలిసినవారినే **"విద్వాన్"** అని వ్యవహరిస్తారు. వాల్మీకిముని ప్రశ్నలను, అనంతరం సమాధానాన్ని ఇచ్చే నారదుడు - **"వేదవేదాంగతత్త్వజ్ఞో ధనుర్వేదే చ నిష్ఠితః, సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్"** అనే ఒక శ్లోకంతో శ్రీరాముని వైదుష్యాన్ని వివరించారు. "నాల్గు వేదాలు, వాటికి గల ఆఱు అంగాలు - అనే వీటి తత్త్వాన్ని బాగా తెలిసినవాడు, నాల్గు వేదాలలో స్థిరంగా నమ్మికను కల్గి ఉండేవాడు, సర్వశాస్త్రాలయొక్క యథార్థ తత్త్వాన్ని తెలిసినవాడు, జ్ఞాపకశక్తిని, ప్రతిభను కలవాడు, శ్రీరాముడు" అని దీనివల్ల తెలుస్తున్నది. భగవదంశభూతుడైనందున సహజంగానే సర్వజ్ఞుడై ఉండగల్గినా, వశిష్ఠమునిని వద్ద శిష్యరికాన్ని చేసి, సకలవేదాలను, మిగిలిన శాస్త్రాలలో క్రమానుసారం అధ్యయనం చేసినవాడు కనుక, చిన్నతనంలోనే **"విద్వాన్"** అనే పేరును పొందినవాడు. ఋగ్వేద - యజుర్వేద - సామవేద - అథర్వణ వేదాలనే నాల్గు వేదాలను అధ్యయనం చేయడం మాత్రమే కాక, వాటిలోని అంతరార్థాలను సైతం తెలిసినవాడు శ్రీరాముడు. శిక్షా, వ్యాకరణం, ఛ్ఛందస్సు, జ్యోతిషం, నిరుక్తం, కల్పం - అనే వేదాంగాలను ఆఱింటిని తెలిసినవాడు.

## శ్రీరాముని విద్వత్స్వభావంలో తోచే ఒక సందేహం

దీనినిగూర్చి మనం విచారించినపుడు ఒక సందేహం కల్గుతుంది. సాక్షాత్ శ్రీమన్నారాయణుడైన శ్రీరాముడు తాను సకలవేదాలతోను ప్రతిపాదింపబడే వాడనేది వివాదరహిత విషయం. ఆరణ్యకాండలో శ్రీరాముని విరాధుడు స్తుతించేటపుడు

**వేదఙ్గళ్ అత్తైకిన్ట ఉలకెఙ్గుమ్ విరిన్దన ఉన్**
**పాదఙ్గళ్ ఇవై ఎన్నిల్ పడివఙ్గళ్ ఎప్పడియో?**
**ఓదమ్ కొళ్ కడలన్ఱి యొన్ఱినోడు ఒన్ఱొవ్వా**
**పూదఙ్గళ్ తొఱు ముఱైన్దాల్ అవై యున్నై పొఱుక్కుమో?**

అని కంబమహాకవి అన్నాడు. తరువాత కబంధుడు స్తుతించేటపుడు కూడా -

**ఆది ప్పిరమను నీ ఆదిప్పరమను నీ**
**ఓది యుఱు పొరుళుక్కు అప్పాలుణ్డాయినను నీ**
**శోదిచ్చుడర్ ప్పిఱమ్బు నీ యెన్ఱు శొల్లుకిన్ఱ**
**వేదముఱై శెయ్దాల్ వెళ్కారో వేఱుళ్ళార్?**

అని అన్నాడు. ఈవిధంగా శ్రీరాముని స్తుతించేవారు అందఱు అతనిని వేదవేద్యుని గానే పల్కుతూ స్తుతించారు. **"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే"** అనే శ్రీరామాయణ తనియన్ ప్రసిద్ధంగా ఉన్నది. **"అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్, వశిష్ఠోఽపి మహాభాగా యే చేమే తపసి స్థితాః"** (నేను ఈ రాముని సత్యపరాక్రమునిగా మహాత్మునిగా తెలిసికొంటున్నాను. వశిష్ఠుడు కూడా తెలిసికొంటు న్నాడు. తపస్సు చేసే మహానుభావులైన ఈ ఋషులు కూడా తెలిసికొంటున్నారు.) అని దశరథ చక్రవర్తి వద్ద పల్కిన విశ్వామిత్రమునికూడా శ్రీరాముని వేదవేద్యునిగానే తెలిపాడు. **"వేదాహ మేతం పురుషం మహాంతమ్"** అనే పురుషసూక్తాన్ని పురస్కరించు కొనే **"అహం వేద్మి మహాత్మానమ్"** అని చెప్పబడినదని వ్యాఖ్యానింపబడింది. దీనిని గూర్చి విపులంగా వ్రాయవలసిన ఆవశ్యకత ఉన్నదా? అందువల్ల వేదంలోని ముఖ్యార్థమై, సకలశాస్త్రసారార్థమై వెలిగే శ్రీరాముడు వేదాలను, శాస్త్రాలను అభ్యసించాలా? వాటి తత్త్వార్థాలను తెలిసికొన్నాడు - అని అంటే, సకలవేదాలకు, సకలశాస్త్రాలకు నేనే అర్థాన్ని అని తెలిసికొన్నాడనికదా అర్థం చెప్పాలి. తనను



ఉద్దేశించి ప్రవర్తించే శాస్త్రాలను తానే అభ్యసిస్తాడా? యథార్థాన్ని తెలిసిన వశిష్ఠుడు అభ్యసింపజేస్తారా? అని ఈవిధంగా సందేహాలు కల్గుతాయి.

## ఈ ఆక్షేపాలకు పరిహారం

వీటికి బదులును వినండి. విష్ణువు, నారాయణుడైన పరమపురుషుడే శ్రీరాముడై వచ్చి అవతరించాడనే సత్యాన్ని ఎవరూ కాదనడానికి వీలు కాదు. శ్రీరాముని ఒక మానవునిగానే భావించి పలికే మునికూడా కొన్నిచోట్ల శ్రీరాముడు విష్ణువుయొక్క అవతారమే అనే విషయాన్ని వ్యక్తం చేశాడు. ఆ విధంగా ఉండే ఒకటి రెండు సందర్భాలను మాత్రం చూపిస్తాము. దశరథ చక్రవర్తి పుత్రార్థియై యాగాన్ని చేసేటపుడు, అక్కడకు వచ్చి చేరిన దేవతలంతా రావణుడు పెట్టే బాధలను గూర్చి పల్కి దుఃఖించే సమయంలో, **"ఏతస్మిన్నంతరే విష్ణు రుపయాతో మహాద్యుతిః"** (ఇంతలో గొప్ప కాంతిని కల్గిన విష్ణువు అక్కడకు వచ్చాడు.) అని శ్రీమహావిష్ణువు అక్కడకు వచ్చి సాక్షాత్కరించి, ఆ దేవతలకు అభయాన్ని ఇచ్చి అదృశ్యుడయ్యాడని చెప్పబడింది.

తరువాత అయోధ్యాకాండ మొదటి సర్గలో **"స హి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః, అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణు స్సనాతనః"** (గర్వించిన రావణుని వధను కోరే దేవతలచే ప్రార్థింపబడిన సనాతనుడైన విష్ణువు మానవ లోకంలో అవతరించాడు) అని చెప్పబడింది. గర్వించి వర్తించే రావణుని వధను కోరిన దేవతలచేత ప్రార్థింప బడిన శ్రీమహావిష్ణువు మానవ లోకంలోకి వచ్చి జన్మించాడనేది ఈ శ్లోక భావం. ఇది అంతా ఒకవైపు ఉండగా, యుద్ధకాండలో నూటఇరవైయవ సర్గలో (సీతాదేవి అగ్నిప్రవేశం చేసే సందర్భంలో) సకలదేవతలు శ్రీరాముని సమీపించి, **"కర్తా సర్వస్య లోకస్య శ్రేష్ఠో జ్ఞానవతాం వరః, ఉపేక్షసే కథం సీతాం పతంతీం హవ్యవాహనే, కథం దేవగణశ్రేష్ఠ మాత్మానం నావబుద్ధ్యసే"** అని అన్నారు. (సమస్తలోకాని కర్తవు, జ్ఞానులలో గొప్పవాడవైన నీవు అగ్నిలోపడే సీతను ఏవిధంగా ఉపేక్షిస్తున్నావు?) "శ్రీరామా! నీవు సర్వేశ్వరుడవనే విషయాన్ని తెలియదా?" అని అన్నారు. దీనికి శ్రీరాముడు పలికే సమాధానంకూడా గమనించదగినది. **"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మ జమ్"** అని శ్రీరాముడు బదులు పలికాడు. ఇది చాలా చమత్కారమైన సమాధానం. సత్యవాదులతో శ్రేష్ఠుడైన శ్రీరాముడు "నేను నారాయణుడను కాను" అని పల్కడు. "నారాయణుడనే నేను" అనే వాస్తవాన్ని పల్కితే, రసభంగం అవుతుంది.

ఈవిధంగా రసభంగం కాకుండా, అసత్యం పల్కినట్లు కాకుండా చాలా చాతుర్యంగా పల్కిన బదులిది- **"ఆత్మానం మానుషం మన్యే"** అనేది. ''నేను నారాయణుడను అయినా, ఇపుడు సామాన్య మానవుని వేషాన్ని ధరించి వచ్చాను'' అనికదా శ్రీరాముడు తన స్వభావాన్ని ప్రకటించు కొన్నవాడయ్యాడు.

ఇటువంటి మనుష్యభావనకు అనుగుణంగానే శ్రీరామాయణ వృత్తాంతాలు ఇంచుమించుగా అన్నీ జరిగాయి. అయోధ్యాకాండలో శ్రీరాముడు తండ్రివద్ద యువరాజ్య పట్టాభిషేకానికి ఆజ్ఞను పొంది, కొన్ని వైదిక కార్యకలాపాలను అనుష్ఠించి నట్లు చెప్పబడింది. **"సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్"** అని తాను, సీతాదేవి కలసి నారాయణుని ఆరాధించినట్లు చెప్పబడింది. అంతేకాక, **"మహతే దైవతాయాజ్యం జుహావ జ్వలితేఽనలే"** అని గొప్పదైన ఒక దైవాన్ని ఉద్దేశించి హోమాన్ని చేసినట్లు చెప్పబడింది. యుద్ధకాండలో రావణుని వధను ఉద్దేశించి అగస్త్యమునివద్ద ఆదిత్యహృదయోపదేశాన్ని పొందినట్లు చెప్పబడింది. ఇటువంటి పలు విషయాలు పొసగాలంటే శ్రీరాముని శ్రీమన్నారాయణునిగానే భావించి పొసగే టట్లు చేయడం వీలుకాదు కదా! **"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మ జమ్"** అనే శ్రీరాముని శ్రీసూక్త్యనుసారం దశరథాత్మజుడైన ఒక మానవుడనే భావించి, సమన్వయించాలి. శ్రీరాముడు వేదాలను, వేదాంగాలను, వేదాంతాలను అభ్యసించా డనే విషయాన్ని, మహావిష్ణువుకు ఆరాధన రూపమైన యజ్ఞాలను నిర్వహించాడనే విషయాన్ని ఈరీతిలోనే పొసగేటట్లు పల్కడంలో లోటు లేదు. అందువల్ల, శ్రీరాముడు వేదవేదాంగాలను అభ్యసించి, **"విద్వాన్"** - అనే పేరును పొందడంలో ఏవిధమైన కొఱత లేదు.

ఇక, **"విద్వాన్"** అనేదానికి ఇంకొక రీతిలోకూడా అర్థాన్ని చెప్పవచ్చు. సర్వజ్ఞుడని దీని అర్థం. భగవానుడైన నారాయణునకు గల సర్వజ్ఞత్వాన్ని దీనిద్వారా తెల్పి నట్లయినది. అతనికి భగవానుడని పేరు. జ్ఞానం,శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు - అనే ఆఱు గుణాలకు **"భగమ్"** అని పేరు. ఆ గుణాలను కల్గి ఉండడం వల్ల భగవానుడనబడు తున్నాడు. ఈ గుణాలలో మొదటి గుణం జ్ఞానం. అది ఏమంటే - **"యుగపదనిశ మక్ష్ణోః స్వైః స్వతో వాఽక్షకార్యే నియమమ నియమం వా ప్రాప్య రంగాధిరాజ, కరతలవదశేషం పశ్యసి స్వప్రకాశం తదవరణ మమోఘం జ్ఞాన మామ్నాసిషు స్తే"** (శ్రీరంగనాథా! నీవు, నీ ఇంద్రియాలతో గాని, ఆ ఇంద్రియాల



అవసరం లేకుండా స్వయంగా కాని కన్ను మొదలైన ఇంద్రియాల కార్యాలైన దర్శనాదు లలో ఒక వ్యవస్థ ఉండేటట్లు గాని, వ్యవస్థ లేనట్లుగా కాని పొంది, నిత్యం అంతటిని ఒకేసమయంలో కరతలామలకంగా చూస్తున్నావు. స్వయం ప్రకాశమైన, అడ్డులేని ఈ సాక్షాత్కారాన్ని నీ జ్ఞానగుణంగా ఉపనిషత్తులు పలికాయి) అని శ్రీరంగరాజస్తవం - ఉత్తర శతకంలో భట్టర్ అనుగ్రహించిన రీతిలోనే ప్రత్యక్షం - పరోక్షమనే తేడా లేకుండా అన్నిటిని కరతలామలకంగా చూడ గల్గినవారు - అని భావం.

ఉపనిషత్తులలో భగవానుని విద్వత్తు ఆశ్చర్యకరంగా చెప్పబడింది. **"పశ్యత్య చక్షుః స శ్రుణోత్యకర్ణః, అపాణిపాదో జవనో గ్రహీతా"** అని భగవానునకు (మాంస) చక్షువులు లేవు. అయినా, అతడు చూడలేనిది అనేది లేదు. అతనికి చెవులు లేవు. అయినా, అతడు వినలేనిది లేదు. అతనికి చేతులు లేవు. అయినా, అతడు అన్ని వస్తువులను గ్రహిస్తాడు. అతనికి కాళ్ళు లేవు. అయినా, అతడు అంతటా వేగంగా సంచరించగలడు - అనేది పైన ఉట్టంకించిన ఉపనిషద్వాక్యంయొక్క అర్థం. తిరుమాలై ప్రబంధంలో **"ఉళ్ళువారుళ్ళిగ్ రెల్లామ్ ఉడనిరున్దఱిది"** (భక్తుల మనస్సులలో నివసిస్తూ వారి మనోగతాలను అన్నిటిని తెలిసికొంటున్నావు.) అని తొండరడిప్పొడి ఆళ్వార్లు అన్నారు. **"కరుతరిదు ఉయిర్క్కుముయిరాయ్ క్కరన్దెఙ్గుమ్ పరన్దుఱైయుమ్ ఒరు తనియక మెన్టాల్ ఉన్ పెరుమైక్కు అళవామో!"** అని తిరువరఙ్గక్కల మ్బకమ్ అనే ప్రబంధంలో పిళ్ళైప్పెరుమాళ్ అయ్యంగార్ పల్కిన రీతిలో, అంతటా వ్యాపించి ఉండే పరతత్త్వమైన భగవానుడు (శ్రీరాముడు) తెలియనిది ఏదయినా ఉంటుందా?

## భగవానుని సర్వజ్ఞత్వవివరణం

కొందఱు ఏకాంతంగా పాపాలను చేసి, దీనిని ఎవరూ తెలియరు - అని భావిస్తారు. మనవంటి మానవులు దానిని తెలియలేరు తప్ప, **"విద్వాన్"** అనే పేరును పొందిన భగవానుడు తెలియలేనిది అనేది ఒకటి ఉన్నదా? భగవానుడు సర్వాంత ర్యామి - అని, సర్వవ్యాపకుడనే సత్యాన్ని తెలిసినవారు. అతడు దేనిని అయినా కరతలామలకంగా చూస్తాడు - అనే తత్త్వాన్ని తెలిసినవారు, బుద్ధిపూర్వకంగా పాపాన్ని చేయడానికి సిద్ధపడరు. కాళిదాస మహాకవి రఘువంశ కావ్యంలో ఇందుమతీ స్వయం వరాన్ని వర్ణించేటపుడు కార్తవీర్యార్జునుని గొప్పతనాన్నిగూర్చి ఇందుమతికి ఆమె చెలికత్తె వివరించి పల్కిన రీతిలో ఒక శ్లోకం ఉన్నది. **"అకార్యచింతాసమకాలమేవ**

**ప్రాదుర్భవన్ చాపధరః పురస్తాత్"** ఇత్యాదిగా. దీని భావం ఏమంటే-లోకంలో ఉండే మిగిలిన రాజుల రాజ్యంలో జనులు అసత్కార్యాలను చేస్తే న్యాయస్థానంలో అవి నివేదింపబడి, సాక్షివిచారణ మొదలైనవి జరిగినా, సత్యం అసత్యంగా, అసత్యం సత్యంగా నిర్ణయింపబడడం సంభవిస్తుంది. ఈ కార్తవీర్యుని రాజ్యంలో ఆ విధంగా కాదు.ఎవరైనా ఒకడు తప్పువానిని మనస్సులో భావించినా చాలు, అపుడే కార్తవీర్యుడు చేతిలో విల్లును ధరించి అతని ముందు నిలచి, అతనిని శిక్షించేవాడు- అని భావం. అత్యల్పుడైన ఒక ప్రభువు గొప్పతనమే ఇటువంటిది అయితే, **"య స్సర్వజ్ఞః సర్వవిత్", "పరాఽస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"** అని ఉపనిషత్తులలో పొగడబడిన, అద్భుతమైన జ్ఞానశక్తులను కల్గిన భగవానుని గొప్పతనాన్నిగూర్చి చెప్పవలసి ఉన్నదా?

గజేంద్రాళ్వాన్ మొసలిచే పట్టుబడినపుడు, **"పరమాపద మాపన్నో మనసాఽ చింతయద్ధరిమ్"** (గొప్ప ఆపదను పొందిన గజేంద్రుడు మనస్సులో హరిని గూర్చి ధ్యానించాడు.) అనేటట్లుగా మనస్సుతో భావించినంతనే, అదే క్షణంలో దానిని తెలిసికొని పరమపదంనుండి మహావేగంగా పరుగెత్తి వచ్చి రక్షించిన భగవానుని జ్ఞానంలోని ఒక్క క్షణమైనా ఎవరైనా తెలియగలరా?

## "విద్వాన్ విపశ్చిత్ దోషజ్ఞః"

**"విద్వాన్"** అనే దానికి లోకంలో ఒక అర్థాన్ని తెల్పుతారు. (అది ఏమంటే) - **"విద్వాన్ విపశ్చిద్దోషజ్ఞః"** అనే అమరకోశవచనానుసారం దోషాలను తెలిసినవాడు **"విద్వాన్"** అనబడతాడు. **"విద్వాన్"** అయి ఉంటే ప్రాయికంగా గుణాలను గ్రహించడం కాకుండా దోషాలను గ్రహించడమే ఉన్నది. ఒక పండితుడు ఒక గ్రంథాన్ని రచించి ఒక విద్వాంసుని వద్ద ఇచ్చి, "దీనిని మీరు కటాక్షించాలి" అని అన్నాడట. ఆ పండితుడు ఒకక్షణం పాటు దానిని చూస్తూ ఉన్నాడట. "ఏదయినా దోషం కన్పడుతున్నదా? - అని చూస్తున్నారా" అని పండితుడు అడుగగా, దానికి ఆ విద్వాంసుడు బదులు పల్కుతూ, "లేదు, లేదు, ఏదయినా గుణం కన్పడుతుందేమో? అని నేను చూస్తున్నాను" అని అన్నాడట. "ఉన్నదంతా దోషమే తప్ప గుణమేమీ లేదు" - అని దీనివల్ల చెప్పినట్లయినది. ఇంచుమించుగా విద్వాంసుల పద్ధతి ఈ విధంగానే ఉంటుంది. శ్రీరాముడు **"విద్వాన్"** అని అంటే ఈ రీతిలో గ్రహించరాదు. శ్రీరాముడు లోకవిలక్షణుడైన విద్వాంసుడు. ఇతడు



గుణజ్ఞుడైన విద్వాంసుడే తప్ప దోషజ్ఞుడైన విద్వాంసుడు కాదు. ఈ స్వభావాన్ని ఒక ప్రకరణవిశేషంలో శ్రీరాఘవుడు వ్యక్తం చేశాడు. ఎక్కడ అంటే, గమనించండి.

## శ్రీరాముడు దోషాలను, లోపాలను చూచి త్యజించేవాడు కాడు

విభీషణుడు, **"నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్, సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే"** (మహాత్ముడు, సమస్తలోకానికి శరణ్యుడైన రామునకు విభీషణుడనే నేను వచ్చానని నివేదించండి) అని వానర వీరులను ఉద్దేశించి ఎలుగెత్తి పల్కి, శరణాగతి చేసినపుడు రెండు పక్షాలు ఆవిర్భవించాయి. "ఇతడు దుష్టుడై నందున అంగీకరించదగినవాడు కాడు" - అనేది ఒక పక్షం. ఇది సుగ్రీవ మహారాజు మొదలైనవారి పక్షం. "ఇతడు దుష్టుడు కానందున అంగీకరించదగినవాడే" అనేది ఇంకొక పక్షం. ఇది హనుమానునుని పక్షం. వీటిలో, ముందు పక్షాన్ని తొలగదోసి, రెండవ పక్షాన్ని రాఘవుడు అంగీకరించినట్లుగా లోకంలో శ్రీరామాయణాన్ని ఆలకించేవారు, చెప్పే వారు భావిస్తారు. ఆ రీతిలో కాకుండా, శ్రీరాముడు సుగ్రీవుని పక్షంతోపాటుగా మారుతి పక్షాన్ని కూడా ఖండించి, మూడవది అయిన, ఒక విలక్షణ మైన పక్షాన్ని, తాను వ్యక్తం చేశాడని అభయ ప్రదానసారమనే గ్రంథంలో శ్రీదేశికులు అద్భుతంగా అనుగ్రహించారు. ఆ మూడవ పక్షం ఏమై ఉంటుంది? అని విద్వాంసులు తమ తమ మనస్సులలో ఆలోచించి చూడాలి. విభీషణుని పరిగ్రహించ రాదని ఒక పక్షం, అతనిని గ్రహించవచ్చు - అని ఇంకొక పక్షం ఈ రెండు పక్షాలకు మించి, మూడవది అయిన ఇంకొక పక్షం ఏవిధంగా సంభవించడం సాధ్యం? అనే కొందఱు తిమకపడవచ్చు. తార్కికకేసరి అయిన శ్రీదేశికులు పలికే సొబగును చూడండి. విభీషణుని అంగీకరించవచ్చు, అంగీకరించరాదు - అని మాత్రమే ఇక్కడ విషయం కాదు. గ్రహంచవచ్చు - అనే పక్షంలో ఏది హేతువుగా చెప్పబడినది? అని గ్రహించరాదు - అనే పక్షంలో ఏది హేతువుగా చెప్పబడినది? అని గమనించాలి. దుష్టుడైనందున గ్రహించరాదు - అనేది పూర్వపక్షం. యోగ్యుడైనందున గ్రహించ వచ్చు- అనేది ఉత్తర పక్షం. "దుష్టుడైనందున గ్రహించవచ్చు" అనే ఇంకొక పక్షం ఈ రెండింటి కంటే వేఱుగానేకదా ఉన్నది. దుష్టుడైనందున గ్రహించరాదు - అనే సుగ్రీవాది పక్షాన్ని కాదని, యోగ్యుడైనందున గ్రహించవచ్చు - అనే హనుమానుని పక్షాన్ని కాదని, "దుష్టుడైనందున గ్రహించాలి" అని శ్రీరాముడు మూడవ పక్షాన్ని చూపి స్థిరీకరించి నట్లుగా శ్రీదేశికుల అభిప్రాయం. శ్రీరామాయణంలో ఈ ప్రకరణంలో **"దోషో యద్యపి**

**తస్య స్యాత్ సతా మేతదగర్హితమ్**" (దోషం శరణాగతి చేసేవానికి ఉండవలసినదే. ఇది - దోషం ఉండడం అనేది - సత్పురుషులచే గర్హింపబడలేదు) అనే శ్లోకమే దీనికి నిదానం. "దోషం ఉంటే ఏమి? అది ఉండనీ" అని శ్లోకంలోని అర్థంగా తోస్తుంది. శ్రీదేశికులు **"యద్యపి"** అనేదానిని కేవలవాక్యాలంకారంగా గ్రహించకుండా, **"దోషః తస్య స్యాత్"**- దోషం అతనికి ఉండాలి - అనే అర్థాన్ని ప్రదర్శించారు. దోషం లేనివానిని పరిగ్రహిస్తే నా కరుణకు ఏమి గొప్పతనం! - అనేది శ్రీరాఘవుని అభిప్రాయమట. లోకంలోని వారు వదలిపెట్టడానికి దోషాన్ని (హేతువుగా) చూస్తారు. శ్రీరాముడు పరిగ్రహించడానికి దోషాన్ని చూస్తాడు - అనికూడా చెప్పవచ్చు. అందువల్ల అమరకోశంలో పల్కిన రీతిలో **"దోషజ్ఞః విద్వాన్"** అనే విద్వత్తు శ్రీరామునిలో ఉన్నది- అని చెప్పవచ్చు.

**"కున్టనైయ కుఱ్ఱమ్ శెయినుమ్ కుణమ్ కొళ్ళుమ్"** (కొండలంత పాపాలను చేసినా గుణాలను గ్రహిస్తాడు) అనే సరోయోగి పాశుర క్రమంలో గుణాలను గ్రహించే స్వభావాన్ని కల్గిన శ్రీరాముడు దోషాలను మనస్సులో గ్రహించడు - అని కూడా చెప్పవచ్చు. వాత్సల్యగుణానికి నిధి అయిన శ్రీరాముడు దోషాలనే ఆలంబనంగా చేసికొని గ్రహించేవాడు - అనికూడా ఉన్నది. ఈ విధంగా ఈ విషయాలన్నీ "కః **విద్వాన్**" అనే ప్రశ్నలో అంతర్భవించి ఉన్నాయని తెలియాలి.

## 10. కః సమర్థః? (ఎవడు సమర్థుడు?)

వాల్మీకి - నారద సంవాదంలోని "కః **సమర్థః?**" అనే పదవ ప్రశ్న ఇక వివరింపబడుతున్నది. "కః **విద్వాన్?**" అనే ప్రశ్న అనంతరం "కః **సమర్థః**" అనే ఈ ప్రశ్న ఉదయించింది. ఒకడు విద్వాంసుడై ఉంటే, అతడు సమర్థుడై ఉండదగినవాడు కదా! అసమర్థుడై ఉండేవాడు విద్వాంసుడని చెప్పదగినవాడా! తగనివాడే కదా! అందువల్ల, ప్రత్యేక ప్రత్యేకంగా ఈ ప్రశ్నలు దేనికోసం పుట్టాయి? అని పరిశీలించి చూచినపుడు, **"విద్వాన్"** అనేది ప్రత్యేకమైన ప్రశ్న అని, విద్వాంసులై ఉండేవారందఱు సమర్థులై ఉండరు - అని తెలిసికొనవలసి ఉంటుంది. దీనినిగూర్చి ఒక లౌకిక వృత్తాంతం స్మరణకు వస్తున్నది. దానిని తెల్పుతున్నాము. వినండి.

### ఆచార్య శిష్యుల హాస్యకథ ఒకటి

చాలా గొప్ప విద్వాంసుడొకడు, ఆచార్యపీఠాన్ని అలంకరించాడు. ఆస్థాన విద్వాంసులు నల్గురితో కలిసి శిష్యయాత్రకు బయలుదేరాడు. కలకత్తా మహానగ



రాన్ని చేరి, ఆ ఊరిలో తమ శిష్యులలో ప్రధానుడైన ఒక శ్రేష్ఠికి తమ రాకను గూర్చి తెలుపగోరి, ఆస్థానపండితులలో మొదటివానిని ఆ శ్రేష్ఠి దగ్గరకు పంపించాడు. అతడు శ్రేష్ఠిదగ్గరకు వచ్చి, అతనిని చూడగానే ఏమాట పలుకాలో తెలియక, తికమక పడి నిల్చున్నాడు. ఎందుకంటే, ఆ సెట్టి చాలా స్థూలకాయుడై కన్పించాడు. అక్కడ ఉండే వాకిటి ద్వారం ద్వారా ఆ శ్రేష్ఠి రాకపోకలను చేయడం సాధ్యం కాదని ఆ పండితుని అభిప్రాయం. అందువల్ల ఈ శ్రేష్ఠి ఏవిధంగా ఈ బంగళా లోపలకు వచ్చి చేరాడు? అనే సందేహం ఆ విద్వాంసుని మనస్సులో కల్గింది. ఆ కారణంగా ఏమీ నోరు తెఱవకుండా తికమక పడుతూ నిల్చున్నాడు. దానిని చూచి సెట్టి, "మీరెవరు? ఎందుకోసం వచ్చారు? ఎందుకు ఊరికే నిల్చున్నారు?" అని అడిగాడు. అపుడు ఆ విద్వాంసుడు "శ్రేష్ఠివర్యా! దానినిగూర్చి తరువాత తెల్పుతాను. నా ఈ పెద్ద సందేహాన్ని నీవు మొదట తీర్చాలి.

ఈ బంగళాను కట్టిన తరువాత నీవు దీని లోపలకు రావడం సాధ్యం కాదు. ముందుగానే, నిన్ను లోపల కూర్చోబెట్టి దీనిని కట్టి ఉండాలి - అని భావిస్తున్నాను. ఈవిధంగానే కదా జరిగింధి! వేఱు విధంగా జరిగిందా! చెప్పు శ్రీమన్!" అని అన్నాడు. దానిని వినగనే శ్రేష్ఠికి కోపం కల్గింది. "ఏదో కొంచెం లావుగా ఉన్నాననే కారణంగా నన్ను ఈ విధంగా వేళాకోళం చేస్తున్నాడే, వీడు!" అని కోపించి, "ఈ బ్రాహ్మణుని ఒక గదిలో పెట్టి బంధించండి" అని ఆజ్ఞాపించాడు. ఆ విధంగానే అతడు బంధింపబడ్డాడు. ఆచార్యుడు చాలా సేపు ఎదురు చూచినా, వెళ్ళిన పండితుడు తిరిగి రానందున, రెండవ ఆస్థానపండితుని శెట్టి దగ్గరకు పంపించాడు. అతడు వచ్చి వాకిటిలోనే విచారించి జరిగిన సంగతిని తెలిసికొని, శ్రేష్ఠి దగ్గరకు వచ్చి, "శ్రేష్ఠీ! మాలో ఒకడు ఇక్కడకు వచ్చి, ఏదో తప్పుగా మిమ్ములను అడిగినట్లు తెలిసినది. అతడు పూర్తిగా మూఢుడు. ఏదోఒక విధంగా బంగళా లోపల నీవు ప్రవేశించి ఉంచావు. దానిని గూర్చి ఇపుడు ఎందుకు విచారణ? రేపు నీవు మరణిస్తే నిన్ను ఏ దారిలో బయటకు తీసికొని రావడం? - అనే విచారణను కదా చేయాలి? దానిని విడచిపెట్టి, "ఏవిధంగా లోపలకు వచ్చావు?" అనే వ్యర్థ విచారాన్ని ఆ మూఢుడు ఎందుకు చేశాడు? - అని అన్నాడు. దానిని విన్న సెట్టి అంతు లేని కోపంతో అతనిని కూడా లోపల బంధించమని ఆజ్ఞాపించాడు. అతడూ ఆవిధంగానే బంధించబడి తిరిగిరానందున, ఆచార్యుడు చిరకాలం ఎదురుచూచి, మూడవ పండితుని సెట్టి దగ్గరకు పంపించాడు.

ఇతడు కూడా వచ్చి, వాకిటిలోనే, తనకంటే ముందుగావచ్చిన ఇద్దఱి సంగతిని గూర్చి విచారించి గ్రహించి, సెట్టి దగ్గరకు వచ్చి, "శ్రేష్ఠిమహాశయా! మాలో ఇద్దఱు నీవద్దకు వచ్చి చాలా మూఢత్వంతో మాటలను పల్కినట్లు విని, చాలా బాధపడ్డాను. నీవు మరణించిన తర్వాత ఏరీతిలో నిన్ను బయటకు తీసికొని పోవడమనే విచారం ఎందుకు? బంగళా గోడలను కూలగొట్టి సులభంగా నిన్ను బయటకు తీసికొని పోవడంలో ఏమి అడ్డు? ఎందుకు వ్యర్థమైన విచారణను మా విద్వాంసులు చేశారు? ఆ మహామూఢులను విడచిపెట్టు" అని అన్నాడు. దీనిని విన్న శ్రేష్ఠి మఱింత కోపాన్ని పొంది, అతనినికూడా లోపల బంధించమని ఆజ్ఞాపించాడు. ఆ విధంగా ఆ పండితుడు కూడా బంధింపబడగా చాలాసేపు వేచి, తరువాత ఆచార్యునిచే పంపబడిన నాల్గవ పండితుడు వేగంగా వచ్చి, తనకంటే ముందు వచ్చిన ముగ్గురి సంగతిని వాకిటిలోనే అడిగి తెలిసికొని, శెట్టి దగ్గరకు వచ్చి, "శెట్టీ! నేను అన్ని విషయాలను విన్నాను. ఏమి అన్యాయమైన మాటలు! ఈ బంగళా ఎంత అందంగా ఉన్నది. దీనిని పడగొట్టి నిన్ను బయటకు తీసికొని రావడమనేది, అయ్యో! ఏమి మాట! ఎందుకోసం దీనిని పడగొట్టాలి? నీవు మరణించిన తర్వాత నిన్ను కత్తితో ముక్కలు ముక్కలుగా ఖండిస్తే, ఒక బుట్టలో వానిని వేసి బయటకు తీసికొని రావడం వీలు కాదా! ఒక బుట్టలో చాలదంటే, నాల్గు అయిదు బుట్టలు కానీ! నాల్గైదు నిముషాలలో అనాయాసంగా బయటకు తీసికొని రావడం సాధ్యమై ఉండగా, గోడలను పడగొట్టడం, వాకిళ్ళను కూలగొట్టడంవంటి ఆలోచనలు చేయడం ఎంత అన్యాయం!" అని అన్నాడు.

శ్రేష్ఠికి కోపాన్ని భరించడం వీలు కాలేదు. ఆ నల్గురికి కఠిన శిక్షను వేయమని ఆజ్ఞాపించాడు. ఈ విధంగా నల్గురు వెళ్ళి తిరిగి రానందున, ఆచార్యుడే స్వయంగా పరుగెత్తి వచ్చి, నల్గురి వృత్తాంతాలను విచారించి గ్రహించి, సెట్టి దగ్గరకు వచ్చాడు. "నాయనా! లౌకికాన్ని ఏమీ తెలియని మూఢుల మాటలను నీవు లెక్కించవచ్చునా! నిన్ను ముక్కలు ముక్కలుగా కోసి బుట్టలో వేసి బయటకు తీసికొని రావడమనేది ఎంతటి అన్యాయమైన మాట. చెవులతో కూడా వినడానికి వీలు కాదే! నీవు మరణించిన తర్వాత ఇక ఈ బంగళా ఎందుకు? గోడలను పడగొట్టడం, వాకిళ్ళను కూలగొట్టడం ఎందుకు? ఈ బంగళాతో పాటుగానే నిన్ను దహించివేయవచ్చు కదా! నీ తర్వాత ఈ బంగళాను పాలించగల్గినవాడెవడున్నాడు?" అని నోరు



మూయకుండా ఏదేదో అనడం ఆరంభించాడు. శెట్టికి అంతులేని కోపంతో ఏమి చేయాలో కూడా తోచలేదు. ఆ సంగతి అటు ఉండనివ్వండి.

ఈ అయిదుగురు విద్వాంసులు తర్కవ్యాకరణ మీమాంసాదిశాస్త్రాలలో సాటిలేని పండితులే. వీరి సామర్థ్యం అయితే ఇటివంటిదై ఉన్నది. ఈ కథవంటివి ఇంకా పలు కథలున్నాయి. వీటివల్ల విద్వత్తుకు, సామర్థ్యానికి సంబంధం లేదు - అనేదే స్ఫుటపడుతుంది. అందువల్ల శ్రీరాముని సామర్థ్యాన్ని కొంచెం అనుభవిద్దాం.

## శ్రీరామునిలో అసామర్థ్యశంక

శ్రీరాముడు చేసిన కార్యాలలో, కొన్నింటిని పైపైన గమనించినపుడు, "ఇతడు అసమర్థుడే!" అని భావించేటట్లు ఉంటుంది. లోపలకు బాగా గమనించి చూస్తే "ఇతనికంటే సమర్థుడింకొకడు లేడు" అని నిశ్చయించుకోవలసి ఉంటుంది. శ్రీరాముడు చేసిన కార్యాలలో కొన్నిటిని, ఒక్కొక్కటిగా ప్రస్తావించి, గమనిద్దాం. సుగ్రీవ మహారాజుతో స్నేహాన్ని చేసి, వాలిని వధించాడనేది ఒక కార్యం. సుగ్రీవుని రావణసంహారానికి సహాయంగా చేసికొన్నాడని కూడా చెప్పబడుతున్నది. నిజానికి, వాలి చాలా గొప్ప వీరుడు. రావణుని తన తోకతో చుట్టి, చంకలో పెట్టుకొని నలిపి, సముద్రాలలో ముంచి, కిష్కింధకు వచ్చి అతనిని విదల్చిన వాలియొక్క వీర్యం విశేషించి చెప్పవలసి ఉన్నదా! అటువంటి గొప్ప శక్తివంతుడైనవానిని సహాయంగా చేసికొని, రావణుని అవలీలగా సంహరించి ఉండవచ్చు. ఇదే సమర్థుడు చేయదగిన కార్యం. దీనిని విడచిపెట్టి, వాలిని వధించి, అతనికి భయపడి దాగి ఉండే సుగ్రీవుని సహాయంగా చేసికోవడం అసమర్థకృత్యమే కదా! అని సామాన్యంగా పలువురు అనడం సహజం. ఇక్కడ వివేకం కలవారు గమనించవలసినది ఏమి? అంటే-

## పైన ప్రస్తావించిన సందేహానికి సమాధానం!

రావణసంహారాన్ని చేయడంలో నిజానికి శ్రీరామునకు ఇంకొకరి సహాయం కావాలా? సహాయం అపేక్షించియే సుగ్రీవుని పరిగ్రహించాడా? - అని విమర్శించి చూడాలి. చరిత్రలను గమనించినపుడు, రావణుడు వేయి బాహువుల వీరుడైన కార్తవీర్యుని చేతిలో భంగపడ్డాడు. అతకుకూడా **"కోక్కుల మన్నరై మూవెழுకాల్ ఒరు కూర్ మழுవాల్ పోక్కియ దేవన్"** (భూమండలంలోని ప్రభువులందరిని ఇరవై ఒక్కమార్లు పరశువుతో వధించిన దేవుడు) అని, **"వెన్టి మామழுవేన్ది మున్ మణ్మిశై మన్నరై మూవెழுకాల్ కొన్ఱ దేవన్"** (జయశీలమైన గొప్ప గొడ్డలిని గైకొని పూర్వం

భూమిలోని క్షత్రియులను ఇరవై ఒక్క మార్లు వధించిన దేవుడు) అని **"మ*ఴు*వినాల్ అవని యరశై మూవె*ఴు*కాల్ మణిముడి పొడిపడుత్తు ఉదిరక్కు*ఴు*వు వార్పునలుళ్ కుళిత్తు వెమ్ కోపమ్ తవిర్న్దవన్"** (పరశువుతో క్షత్రియులను ఇరవై ఒక్కమార్లు వధించి, వారి కిరీటాలను పొడి చేసి, వారి రక్తంతో ఏర్పడిన సరస్సులో స్నానమాడి తీవ్రమైన కోపాన్ని తీర్చుకొన్నవాడు) ఈ విధంగా పొగడబడే పరశురాముని చేతిలో భంగపడ్డాడు. ఆ పరశురాముడు కూడా **"ఎన్‌విల్ వలి కణ్డు పో"** (నా వింటి బలాన్ని చూచిపో) అని ఎదిరించి వచ్చి, తన వింటితోపాటుగా తపస్సును కోల్పోయి, శ్రీరామునివద్ద భంగపడ్డాడు - అనేది మనకు బాగా తెలుసు. ఇటువంటి మహావీర సార్వభౌముడైన శ్రీరాముడు **"పొల్లా అరక్కనై కిళ్ళి క్కళైన్దాన్"** (దుష్టుడైన రాక్షసుని గిల్లి పారవేసినవాడు.) అని గోదాదేవి పల్కిన క్రమంలోను,**"శతుర మామదిళ్ శూ*ఴ్* ఇలఙ్గైక్కిఱైవన్ తలైపత్తుదిర వోట్టి ఓర్ వెఙ్గణై ఉయ్‌త్తవన్"** (నాల్గు వైపుల గొప్ప ప్రాకారాలను కల లంకకు ప్రభువైన రావణుని పది తలలను అవి రాలి పడేటట్లు గొప్పదైన ఒక బాణాన్ని ప్రయోగించినవాడు) అని తిరుప్పాణ్ ఆ*ఴ్వా*ర్లు పల్కిన సూక్తికి తగినట్లుగా రావణుని అవలీలగా సంహరించగల్గినవాడనేది ఏ సందేహం లేని విషయం. ఇటు వంటి గొప్పవీరుడు సుగ్రీవుని సహాయంగా పరిగ్రహించాడు- అనేది అసంభావితం.

**"దీనబంధుః"** అని, **"దీనదయాళుః"** అని ఘోషింపబడే తన గొప్ప గుణాన్ని లోకంలో ప్రకాశింప జేయడంకోసమే శ్రీరాముడు సుగ్రీవుని పరిగ్రహించాడు. పెరుమాళ్ తిరుమొ*ఴి*లో **"ఇళైయవర్ కట్కు అరుళుడైయాయ్ ఇరాకవనే!"** (చిన్నవారి పట్ల అనుగ్రహాన్ని కల రాఘవా!) అని కులశేఖరా*ఴ్వా*ర్ సంబోధించడం. దీనిని బలపరుస్తుంది. "పెద్దవాడైన వాలిని వధించి, అతని చిన్న తమ్ముడైన సుగ్రీవుని పట్ల దయ చూపినవాడా!"అని మాత్రమే దీనికి అర్థం కాదు. **"ఇళైయవర్‌కళ్"** (చిన్నవారు) అనేదానికి **"ఇళైత్తవర్‌కళ్"** (బల హీనులు) అనికూడా అర్థం. బలం లేని దీనులు - అని భావం. అటువంటి వారిని అనుగ్రహించడమే శ్రీరాముని స్వభావం కనుక, దీనికి తగినట్లుగా సుగ్రీవుని పరిగ్రహించాడు తప్ప, రావణుని వధించడంకోసం సహాయంగా చేసికొన్నట్లు మనస్సులో కూడా భావించదగదు. **"కలైయుమ్ కరియుమ్ పరిమావుమ్ తిరియుమ్ వానమ్ కడన్దుపోయ్ శిలైయుమ్ కణైయుమ్ తుణైయాక చ్చెన్ఱాన్ వెన్ఱి చ్చెరుక్కళత్తు"** (లేళ్ళు, ఏనుగులు, గుఱ్ఱాలు ఇత్యాది మృగాలు సంచరించే అరణ్యాన్ని దాటిపోయి, ధనుర్బాణాలను ధరించి, జయాన్ని కల్గించే యుద్ధరంగానికి



వెళ్ళినవాడు) అని తిరుమంగై ఆ*ఴ్వా*ర్లు అనుగ్రహించినట్లే శ్రీరామునకు తన విల్లు, బాణాలు సహాయం తప్ప వేఱేమీ సహాయం కాదు. విభీషణపరిగ్రహ ప్రకరణంలో**"అంగుళ్యగ్రేణ తాన్ హన్యామిచ్ఛన్ హరిగణేశ్వర!"** (సుగ్రీవా! నేను సంకల్పిస్తే కాలి వ్రేలి చివరి భాగంతో నేను వారినందరిని వధించగలను) అని సుగ్రీవుని ఉద్దేశించి శ్రీరాముడు పల్కిన రీతిలో సంకల్పం ఒక్కటే అతనికి తగిన సహాయం. రావణుని వధించడానికి శ్రీరాముడు అపరిమితమైన శ్రమను పడినట్లుగా కథలో కన్పించేది అంతా ఎందుకోసం? అనేదానిని గూర్చి ఇతఃపూర్వమే **"కః వీర్యవాన్?"** అనే రెండవ ప్రశ్నను వివరించేటపుడు విశదం చేశాము. ఈవిధంగా సుగ్రీవుని పరిగ్రహించడం అసమర్థకృత్యమనేది పస లేని మాట - అని తెలుస్తున్నది.

వాలిని వధించడం సుగ్రీవుని ప్రార్థనకోసం-అనికథా సందర్భం వల్ల తెలుస్తున్నప్పటికీ, యథార్థం అది కాదు. **"వినాశాయ చ దుష్కృతామ్"** అని గీతలో శ్రీరామునకు ఇది స్వభావంగా ఏర్పడినదే తప్ప వేఱు కాదు. దీనినిగూర్చి ఇంకొక చోట వివరిస్తాను.

## సముద్రశరణాగతిలో కన్పించే సందేహం

ఇక, శ్రీరాముని ఇంకొక కార్యాన్ని ఉదాహరిస్తాము. సముద్రాన్ని దాటి లంకకు వెళ్ళగోరి, సముద్రుని ఉద్దేశించి శ్రీరాముడు శరణాగతిని చేశాడనే కథను మనం గమనిస్తున్నాము. లోకంలో శరణాగతి చేయడమనేది అసమర్థుడు చేసే కార్యమే తప్ప, సమర్థుడు చేసే పని కాదు - అనేది వ్యాఖ్యానించనక్కఱలేని విషయం. **"నిశా స్త్రిస్రః అతిచక్రముః"** (మూడు రాత్రులు గడచిపోయాయి.) అని వాల్మీకి మహర్షి పల్కినట్లుగా మూడుదినాల పాటు తీరంలో శయనించినప్పటికీ సముద్రుడు ముఖాన్ని చూపించలేదు; అనుగ్రహించ లేదు. అపుడు **"క్రోధ మాహారయ తీవ్రమ్"** అనేటట్లుగా కోపాన్ని ఆరోపించుకొన్న శ్రీరాముడు లక్ష్మణుని చూచి వింటిని, కఠినమైన బాణాలను తీసికొని రమ్మని ఆజ్ఞాపించి, **"అసమర్థం విజానాతి మామయం మకరాలయః"** (ఈ సముద్రుడు నన్ను అసమర్థునిగా భావిస్తున్నాడు.) అని పల్కడం కూడా చూస్తాము. "అనుజా! ఈ సముద్రుడు తనను ఒక చేపల గుంటగా భావించకుండా, నన్ను అసమర్థునిగా భావిస్తున్నాడు" అని శ్రీరాముడన్నాడు. నిజానికి అసమర్థుడు చేయదగిన కార్యాన్ని (శరణాగతిని) తాను చేసి, ఈవిధంగా అనడం తగునా? అనేదానిని గమనించాలి. శరణాగతి చేసే పని తగునా? అనేదానిని గూర్చి

తరువాత విమర్శిస్తాము. అసమర్థపురుషుడు చేసే పనిని చేశాడనే దానినిబట్టి శ్రీరాముని అసమర్థుడని అనడంలో ఏమి అడ్డు? అని కొందఱు అంటారు.

## శ్రీరాముడు సముద్రునిపట్ల చూపిన సామర్థ్యం

నిజానికి శ్రీరాముడు ఎంతో సమర్థుడే తప్ప, అసమర్థుడు కానేకాడు - అనే విషయం ఇక్కడ తరువాత కథ చక్కగా వ్యక్తమవుతుంది. వింటిని, బాణాన్ని సంధించడం ఆరంభించగానే సముద్రరాజు భీతిల్లి, గడగడ వణకి పరుగెత్తి నిలువగా, అతని ప్రార్థనకు అంగీకరించి, కడుదూరంలో ఉండే అతని శత్రువులను క్షణ కాలంలో వధించేటట్లు బాణాన్ని ఆజ్ఞాపించి, ఆవిధంగానే నిర్వహించిన విషయాన్ని చూస్తే, శ్రీరాముని నిస్సమాభ్యధికమైన సామర్థ్యం సులభంగా తెలియవస్తుంది కదా! అయితే, అసమర్థకార్యమైన శరణాగతిని శ్రీరాముడు ఎందుకు చేశాడు? అనే ప్రశ్నకు సమాధానాన్ని చెప్పవలసిన అవసరం ఉన్నది. వినండి.

## సముద్రశరణాగతిలోని మర్మం

శ్రీరాముడు అవతరించడంలోని ఉద్దేశ్యం తన సాటి లేని కల్యాణగుణాలను ప్రకాశింపజేయడంకోసమే తప్ప, వేఱొకదానికోసం కాదు - అనేది పరమార్థం కనుక, చాలా గొప్పదైన ఒక గుణాన్ని వ్యక్తం చేయడంకోసమే ఈ శరణాగతి చేయబడింది. శ్రీరాముడు సముద్రుని శరణాగతి చేయడమనేది. కార్యం ఏవిధంగా ప్రసక్తమైనది? అనే విషయాన్ని కొంచెం గమనించాలి. శ్రీరాముడు సముద్రతీరానికి వచ్చి చేరినపుడు "సముద్రాన్ని దాటడం ఏవిధంగా?" అనే విచారణ ఏర్పడింది. అపుడు విభీషణుడు వచ్చి ఆశ్రయించడం మొదలైన కొన్ని వృత్తాంతాలద్వారా ఆ విచారం కొంత మఱుగు పడింది. విభీషణుని పరిగ్రహించిన తరువాత మళ్ళీ ఆ విచారణ మొదలైనది. అపుడు శ్రీరాముడు "ఈ విషయంలో మనకేమీ తెలియదు. విభీషణుని అడగాలి. అతడేమి ఉపాయాన్ని పల్కుతాడో, దానినే పరిగ్రహించాలి" అని అనగా, అపుడు సముద్రాన్ని దాటే ఉపాయాన్ని చెప్పే బాధ్యత విభీషణునిది అయినది. అతడాలోచించి, **"సముద్రం రాఘవో రాజా శరణం గంతు మర్హతి"** (శ్రీరాముడు సముద్రాన్ని శరణాగతి చేయాలి) అని అన్నాడు. దానిని విని శ్రీరాముడు "నాకు కూడా ఈ ఉపాయమే రుచిస్తున్నది" అని పల్కి, వెంటనే శరణాగతిలో ప్రవర్తించాడు - అనే కథను గమనిస్తాము.



ఇక్కడ విభీషణుని అడగాలని అనడంలో ఏమి కారణం? తనకంటే విభీషణుడు మేధావి - అని ఉద్దేశ్యమా! ఇతరులను అడిగి చేయాలనే అభిప్రాయమే అయితే, జాంబవంతుడు, హనుమంతుడువంటివారైన మహామేధావులు లేరా? వారిని అడుగవచ్చునుకదా! వారిని కూడా విడచిపెట్టి విభీషణుని అడగాలని అనడం ఎందుకు? ఆ విభీషణుడుకూడా తాను శ్రీరాముని గొప్పతనాన్ని యథాతథంగా తెలిసినవాడే కదా! శ్రీరాముని తాను శరణం పొందినపుడు **"సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే"** అని అన్నాడు కదా! సర్వలోకశరణ్యుడని తాను బాగా తెలిసిన శ్రీరాముని, ఒక ఉప్పుగుంటను ఉద్దేశించి శరణాగతిని చేయమని అనడం తగునా? గమనిస్తే ఇవి అన్నీ అసందర్భాలుగానే కన్పిస్తున్నాయి! అని శంకింపవచ్చు. ఇక్కడి మర్మాలను ఆలకించండి.

జాంబవంతుడు, హనుమానుడు మొదలైన మహావీరులు - చాలా కాలంగా భక్తులు అయినా, **"అన్నీన్ఱ కన్ఱుక్కు త్తాయిరఙ్గి మున్నణైన్ఱ కన్ఱైయుమ్, పుల్లిడ వన్దవర్కళైయుమ్ కొమ్బిలుమ్, కుళమ్బిలుమ్ ఏఱ్కుమాపోలే, పెరియపిరాట్టి యారైయుమ్, సూరికళైయుమ్ విట్టు స్నేహిత్తుక్కొణ్డుపోరుమ్"** (అపుడే ఈనిన దూడపట్ల తల్లి ఆవు ద్రవించి, ముందు తాను ఈనిన దూడను, తనకు గడ్డి వేయాలని వచ్చిన వారిని కొమ్ములతో, గిట్టలతో పొడిచి తన్నేటట్లే, లక్ష్మీదేవిని, నిత్యసూరులను సైతం విడచి స్నేహాన్ని ప్రదర్శిస్తాడు) అని శ్రీపిళ్ళైలోకాచార్యుల వారు (తత్త్వత్రయమ్ - 151వ సూత్రం) అనుగ్రహించిన క్రమంలో, అపుడే నూతనంగా వచ్చి శరణు పొందిన దాసుని పట్ల విశేషమైన ప్రేమను ప్రదర్శించడమే శ్రీరాముని స్వభావం. సీతాదేవి రావణుని చూచి ఉపదేశించేటపుడు - **"విదిత స్స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః"** అని శరణాగత వాత్సల్యాన్నే శ్రీరామునిలో తాను నిరూపించే గుణంగా అన్నది. ఆ గుణాన్ని రావణుని విషయంలోనే చూపించాలని ఆశపడిన శ్రీరాముడు, దానిని పొందలేకపోయినా, అతనికి పిమ్మట జన్మించిన విభీషణుని విషయంలో అయినా దానిని చూపకపోతే ధరించడం దుష్కరం కదా! వాత్సల్య మనేది అదే కదా! వత్సమంటే లేగదూడ. లేగదూడపట్ల తల్లి ఆవు చూపే ప్రేమ కదా వాత్సల్యమన బడుతుంది. ముందు ఈనిన దూడలవంటివారైన హనుమానుడు, జాంబవంతుడు మొదలైనవారిని కాదని, అపుడే ఈనిన లేగదూడవంటి విభీషణుని పట్ల విశేషమైన ప్రేమకల్గినందువల్లనే అతని మాటలపట్ల గౌరవాన్ని కల్గి ఉండాలని తోచి, అతనిని ఉపాయం చెప్పమని అడిగాడు, శ్రీరాముడు

## సముద్రశరణాగతిని చేయమనే విభీషణుని మాటలోని తాత్పర్యం

ఇక, సర్వలోకశరణ్యుడుగా తాను తెలిసికొన్న శ్రీరాముని సముద్రశరణాగతిని చేయమని విభీషణుడు ఏవిధంగా పలికాడు? అనేదానినిగూర్చి వినండి. లోకంలో ఒక రోగానికి పలు విధాలైన మందులుంటాయి. అందఱు ఒకే మందును చెప్పరు. ఒక్కొక్కరు ఒక్కొక ఔషధాన్ని తెల్పుతారు. ఎవడైనా తన అనుభవంలో గ్రహించిన మందునే ఇతరులకు చెప్పడం సహజం. అదే రీతిలో, విభీషణుడు కూడా తనకు శరణాగతియే తానాశించిన ప్రయోజనాన్ని పొందించిందని భావించాడు కనుక, "లోకంలో ఏ ప్రయోజనానికి అయినా అదే గొప్ప ఔషధం (ఉపాయం)" అని నిర్ణయించుకొని, "సర్వలోకశరణ్యుడైన శ్రీరామునకు ఇది తగదు" అనే విషయాన్ని మఱచి, శరణాగతియే తగిన ఉపాయమని అన్నాడు. అతడు చెప్పినా శ్రీరాముడు దానిని నిరాకరించవచ్చు. అసమర్థుడు చేయదగిన శరణాగతిని సమర్థుడు చేస్తే దాని ఫలితం ఏమవుతుంది? - అనేదానిని లోకం తెలిసికోనీ!-అనే భావనతోనే తాను ఆ మాటను అంగీకరించి, ఆచరించి దాని ఫలితాన్ని కూడా చూపించాడు. ఈవిధంగా ఇందువల్ల కూడా శ్రీరాముని గొప్ప సామర్థ్యం ఉన్నతంగా ప్రకాశిస్తున్నది.

## 11. ఏక ప్రియదర్శనః కః ? (గొప్ప సౌందర్యాన్ని కలవాడెవడు?)

శ్రీమద్వాల్మీకిరామాయణంలోని - నారద సంవాదంలో **"కః సమర్థః?"** అనే పదవ ప్రశ్న ఇంతకు ముందు వివరింపబడింది. ఇక **"ఏకప్రియదర్శనః కః?"** అనే పదకొండవ ప్రశ్న వివరింపబడుతున్నది.

### శ్రీరాముని సౌందర్యవివరణం

ఎంతసేపు చూస్తూ ఉన్నా తృప్తి కల్గించకుండా మధురంగానే తోచే దర్శనాన్ని కలవాడు ఎవడు? - అని ఈ ప్రశ్నతాత్పర్యం. గొప్ప అందాన్ని కల్గినవాడెవడు? అని ప్రశ్నించినట్లయినది. లోకంలో గొప్ప అందాన్ని కల్గిన వ్యక్తులను అనేకమందిని మనం చూస్తున్నాము. అయితే వారిలో ఒకటి, రెండు దినాలపాటు మాత్రం ఆదరంతో దర్శించడమనే స్పృహణీయత మాత్రం ఉంటుంది. దినాలు గడచే కొలది ఆ ఆదరం మాఱిపోతుంది. శ్రీరాముని అందం అటువంటిది కాదు. **"ఎప్పొழுదుమ్ నాళ్ తిజ్గళ్ ఆణ్డు ఊழியూழிతొఱుమ్, అప్పొழுదైక్కు అప్పొழுదు ఎన్నారావ ముదమే"** (ఎల్లప్పుడు దినాలు, నెలలు, సంవత్సరాలు, కల్పాల కాలం తరబడి దర్శించినా ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా భాసించే నా అపర్యాప్తామృతం) అని



నమ్మాழ்వార్లు పల్కినట్లుగా కల్పాల తరబడి ఎవరూ దర్శించినా అపూర్వంగానే కన్పిస్తుంది.

### రామనామశబ్దార్థం

అటువంటి అందం స్థిరంగా నిలచి ఉన్నందువల్లనే వశిష్ఠభగవానుడు రాముడనే తిరునామాన్ని పెట్టాడు. రామశబ్దం **"రమయతి"** అనే వ్యుత్పత్తివల్ల ఏర్పడే సంస్కృతపదం. తన అందాన్ని చూపి, నిరంతరం ఆనందింప జేసేవాడు - అనేది స్ఫుటపడిన తాత్పర్యం.

### "పుంసాం దృష్టిచిత్తాపహారి" అనే సూక్తి వివరణం

శ్రీరాముని సౌందర్యంలో ఎవరెవరు ఏఏవిధంగా చిక్కుకొన్నారు - అనే దానిని యథాతథంగా వివరించడం ఆరంభిస్తే చాలా విస్తృతి అవుతుంది. సారంగా, కొన్ని సందర్భాలను ఉదాహరించి చూపిస్తాను. దానికి ముందు శ్రీరాముని అందం వాల్మీకి మహర్షి మాటలలో ఏవిధంగా తెలుపబడింది? - అనేదానిని కొంచెం పల్కుతాను. (అయోధ్యాకాండలో) శ్రీరామునకు యువరాజపట్టాభిషేకాన్ని చేయగోరిన దశరథుడు శ్రీరాముని తన వద్దకు రమ్మని పిలిచాడు. తనవద్దకు వచ్చే రాముని దశరథుడు దూరం నుండే చూచేటపుడు అతని మనస్సు ఆనందించిన రీతిని వాల్మీకి **"చంద్రకాంతాననం రామ మతీవ ప్రియదర్శనమ్, రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్"** (చంద్రుని కంటే మించిన అందమైన ముఖాన్ని కల్గినవాడు, గొప్ప అందాన్ని కలవాడు, రూపంతో, ఔదార్యంతో, గుణాలతో పురుషుల దృష్టిని, మనస్సును అపహరించేవాడైన రాముని.) అని, **"న తతర్ప సమాయాంతం పశ్యమానో నరాధిపః"** (తనవద్దకు వచ్చే శ్రీరాముని ఎన్నిమార్లు చూచినా దశరథుడు తృప్తిని పొందలేదు.) అని అన్నాడు. **"చంద్రకాంతాననమ్"** అనే పదానికి చంద్రునివలె అందమైన తిరుముఖ మండలాన్ని కలవాడు - అనే అర్థాన్ని కొందఱు తెల్పుతారు. చంద్రునికంటె అందమైన తిరుముఖ మండలాన్ని కలవాడు - అనే అర్థమే ముని తలచిన అర్థం. **"కశ్చైక ప్రియదర్శనః?"** అనే ప్రశ్న ముని మనస్సులో ఊఱి, నిలకడగా ఉన్నందువల్లనే ఇక్కడ **"అతీవప్రియదర్శనమ్"** అనే మాట వెలువడింది. దీనికి పిమ్మట **"రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్"** అనేది చాలా అద్భుతమైన మాట. "రాముడు రూపసౌందర్యం మొదలైన గుణాలతో అందఱి నేత్రాలను, మనస్సును అపహరించే వాడు" అని చెప్పవలసిఉండగా, ముని ఆ విధంగా

పల్కకుండా, **"పుంసామ్"** అని విశేషించి పలికాడు. **"పుంసామ్"** - అంటే పురుషుల యొక్క - అని అర్థం. పురుషులకు మనోహరుడే తప్ప, స్త్రీలకు మనోహరుడు కాడు కాబోలు - అని కొందఱు భావిస్తారు. అది భ్రాంతి. సంస్కృతగ్రంథకారులు **"దండాపూపికాన్యాయమ్"** అనే ఒక న్యాయాన్ని తెల్పుతారు. అది ఏమంటే - ఒక ముసలివాడు తన కఱ్ఱకు వడలను గుచ్చి, రాత్రి నిద్రపోయాడు. ఉదయం లేచి ఆ వడలను తినాలని కఱ్ఱకోసం వెదికాడు. ఆ దండాన్ని ఎలుక తినివేసింది - అని తెలిసికొని, తన పత్నితో ఆ విషయాన్ని చెప్పాడు. ఆమె "దండం పోతే పోయింది, వడలున్నాయా?" అని అడిగింది. దానికి ఆ వృద్ధుడు "వడలను గుచ్చిన దండాన్నే ఎలుకలు భక్షించాయి అంటే, ఇక వడలను గూర్చి అడగాలా?" అని బదులిచ్చాడట. దీనినే సంస్కృతంలో దండాపూపికా న్యాయమని అంటారు. దీనికి కైముతిక న్యాయమని కూడా పేరు. పూర్వం ఉదాహరించిన వాల్మీకి మహర్షిశ్లోకం ఈ న్యాయాన్ని స్మరింపజేసేటట్లుగా అవతరించింది. శ్రీరాముని రూపసౌందర్యం పురుషుల నేత్రాలను, మనస్సును అపహరిస్తున్నదంటే, ఇక, స్త్రీల కన్నులను, మనస్సును కొల్లగొడుతున్నదని చెప్పాలా? లోకంలో పురుషులు ఎంత అందమైనవారైనా వారి అందాన్ని పురుషులు ఒక విషయంగా లెక్కించరు. స్త్రీల అందాన్ని చూచి పురుషులు మోహనపడడం, పురుషుల సౌందర్యాన్ని చూచి స్త్రీలు మోహించడం లోకసహజమే తప్ప, స్త్రీల అందాన్ని చూచి స్త్రీలు మోహించడం, పురుషుల అందాన్ని చూచి పురుషులు మోహించడం చాలా అరుదు. ఆ విధంగా మోహించినట్లు పలికే సందర్భం చూస్తే, ఆ అందం లోకాతీతమైనదని తెలుపబడినది కాగలదు.

ద్రౌపది విరాటనగరంలో నివాసం చేసినపుడు ఆమె స్నానం చేస్తూ ఉండగా ఆమె అందాన్ని చూచిన స్త్రీలు చాలా మోహాన్ని పొందారు - అని మహాభారతంలో తెలుపబడింది. అందువల్ల, ఆమె అందం లోకాతీతమని తెలుపబడినది అయినది. అదే రీతిలో ఇక్కడ కూడా శ్రీరాముని అందం పురుషులను మోహింపజేస్తున్నదని పలికే వాల్మీకిముని "శ్రీరాముని అందంలో మోహించని వారెవరూ లేరు" అనే అర్థాన్నే తెల్పినవాడయ్యాడు. **"కణ్ణిక్కాణ్బరేల్ ఆడవర్ పెణ్మైయై అవావుమ్ తోళినాయ్"** (కంటితో దర్శిస్తే మగవారు స్త్రీత్వాని కోరేటట్లు చేసే బాహువులను కలవాడా!) (కంబరామాయణం), **"వారాకా! వామననే! అరఙ్గా! వట్టనేమి వలవా! రాకవా! ఉన్ వడివు కణ్డాల్ మన్మదనుమ్ మడవారాక ఆదరమ్శెయ్వన్"** (తిరువరఙ్గత్తన్దాది) (వరాహరూపా! వామనా! శ్రీరంగనాథా! గుండ్రని చక్రాన్ని ఆయుధంగా కుడిచేతిలో



కలవాడా! రాఘవా! నీ రూపాన్ని దర్శిస్తే మన్మథుడు కూడా స్త్రీవలె మోహిస్తాడు) అనే రీతిలోని పలు పాశురాలు ఇక్కడ స్మరణీయాలు. ఇక, శ్రీరాముని రూప సౌందర్యంలో అభినివేశాన్ని పొందినవారినిగూర్చి కొంచెం తెల్పుతాను.

## శ్రీరాముని అందంలో విశ్వామిత్రమహర్షి అభినివేశం

ప్రప్రథమంగా విశ్వామిత్రమునినే తీసికొందాం. ఈయన, దశరథ చక్రవర్తి దగ్గర శ్రీరామలక్ష్మణులను పొంది, తిరిగి ప్రయాణం చేసేటపుడు సూర్యుడు అస్తమించగానే, రాజకుమారులు నిద్రించారు. తరువాత ఉదయ సంధ్యాకాలంలో శ్రీరాముని ప్రబోధించే విశ్వామిత్రముని **"కౌసల్యాసుప్రజా రామ!"** అనిఅన్నాడు. ఇది శ్రీరాముని గూర్చిన సంబోధన. దీనికి పూర్వాచార్యులు పలు విధాలైన అర్థాలు తెల్పుతున్నారు. రెండు రీతులలో వినండి. **"కౌసల్యా"** అనేది వ్యస్త పదంగాను, **"సుప్రజా"** అనేది వ్యస్తపదం గాను విడదీసి ఒక అర్థనిర్వాహం. వాటిని కలిపి ఒకే సమస్తపదంగా గ్రహించి ఇంకొక అర్థనిర్వాహం. ఒకేపదంగా గ్రహించే నిర్వాహంలో, "కౌసల్యాదేవి యొక్క చక్కని కుమారుడవైన శ్రీరామా!" అని సంబోధిస్తున్నట్లు అర్థం ఏర్పడుతుంది. వేఱ్వేఱు పదాలుగా విభజించి చూపే నిర్వాహంలో "కౌసల్యా దేవి చక్కని పుత్రుని పొందినది" అని పల్కి వాక్యం పూర్తి చేసేటట్లు అర్థం ఏర్పడుతుంది. "శ్రీరామా! పొద్దు పొడిచింది లే!" అని పలుకవలసిన ఈ సందర్భంలో కౌసల్యను ప్రశంసించడ మనేది ఎందుకోసం? అనే ప్రశ్న ఇక్కడ కల్గుతుంది. ఇక్కడ మన పూర్వాచార్యులు అరుదైన ఔషధంవంటి ఒక శ్రీసూక్తిని అనుగ్రహించారు, చూడండి. **"మునివన్, ఉణ్ణప్పుక్కు వాయై మఱప్పారైప్పోలే, తాన్ అధికరిత్త కార్యత్తై మఱన్దు పెఱ్ఱ వయిఱ్ఱుక్కు ప్పట్టమ్ కట్టుకిఱవనాయ్, ఒరు తిరువాట్టి పిళ్ళై పెఱ్ఱపడి ఎన్నే! ఎన్ఱు కౌసల్యైయారై క్కొణ్డాడుకిఱాన్. వడివఴకు పడుత్తు ప్పాడు!"** అనేది ఆ సూక్తి.

దీనిని కొంచెం వివరిస్తాము. (**"ఉణ్ణప్పుక్కు వాయై మఱప్పారైప్పోలే"**) - ఆకులో ప్రసాదభక్షణాలు వడ్డించబడి ఉంటే, భజించడానికి కూర్చున్నవాడు చేయవలసిన పని ఏమి? వాటిని గ్రహించి భుజించడమేకదా చేయవలసినది. దానిని చేయకుండా, "ఈ భక్ష్యాన్ని ఎవరు చేశారు? ఏవిధంగా చేశారు? దేనితో చేశారు?" అని ఈవిధంగా కొన్ని విచారణలను చేస్తూ ఉంటే, అతడు ఆ భక్షణాలు కన్పించే పొందికలో చాలా ఆసక్తుడయ్యాడు - అని తెలిసికోవచ్చుకదా! అదేవిధంగా, ప్రకృతంలో విశ్వామిత్ర

ముని శ్రీరాముని ప్రబోధించి అతనిని తీసికొనిపోయి నిర్వహించవలసిన కార్యం ముఖ్యమై ఉండగా, దానిని విడచిపెట్టి, "ఇంత అందమైన పుత్రుని పొందిన కౌసల్యాదేవి ఏమి నోము నోచిందోకదా!" అని ఆమెను పొగడడం ఆరంభించాడు. ఇది, శ్రీరాముని అందం పెట్టిన పాటు - అనేది తప్ప వేఱేమని చెప్పగలం!

## మిథిలానగరజనులు శ్రీరాముని అందంలో అభినివేశాన్ని పొందిన రీతి!

శ్రీరాముడు మిథిలానగరంలో రాజవీథులలో సంచరించేటపుడు అతనిని చూచిన ఆ నగరస్త్రీల స్థితిని వర్ణించే కంబకవి-

**తోళ్ కణ్డార్ తోళే కణ్డార్ తొడు క*ழ*ఙ్కమలమన్న**
**తాళ్ కణ్డార్ తాళే కణ్డార్ తడక్కై కణ్డారు మ.్.దే**
**వాళ్ కొణ్డ కణ్ణార్ యారే వడివినై ముడియ క్కణ్డార్**
**ఊ*ழ్* కణ్డ శమయత్తన్నానురువు కణ్ణారై యొత్తార్**

(శ్రీరాముని బాహువులను దర్శించినవారు ఆ బాహువులనే దర్శించారు. వికసించిన తామరపూవులవంటి పాదాలను చూచినవారు ఆ పాదాలనే చూచారు. బాహువులను చూచిన వారు కూడా అంతే. ఖడ్గంవలె నిశితమైన నేత్రాలను కల మిథిలా నగర స్త్రీలలో ఎవరు శ్రీరామసౌందర్యాన్ని పూర్తిగా దర్శించారు? కల్పాంతంలో భగవానుని రూపాన్ని దర్శించిన వారు ఆశ్చర్యాన్ని పొందినట్లుగా వీరుకూడా ఆశ్చర్యపడ్డారు) అని అన్నాడు. శ్రీరాముని ఒక్కొక్క అవయవంలోని అందాన్ని చూచినవారు ఇంకొక అవయవంలో చూపును సారించ లేనివారయ్యారు - అని పల్కిన ఈ సూక్తిద్వారా శ్రీరాముని దివ్యమంగళ విగ్రహసౌందర్యం సాటి మేటి ఏదీ లేనిది - అని తెలిపి నట్లయినది.

## కులశేఖరా*ழ*్వార్ చూపిన రామసౌందర్యం

శ్రీరాముని అందాన్ని దశరథచక్రవర్తి అనుభవించే రీతిని కులశేఖరా*ழ*్వార్ పల్కిన క్రమం చాలా విలక్షణమైనది. పెరుమాళ్ తిరుమొ*ழి*లో **"వా పోకు వా ఇన్నమ్ వన్దొరు కాల్ కణ్డు పో"** (రా, వెళ్ళు, రా, ఇంకొకసారి వచ్చి చూచిపో) అనే పాశురం పొందికలోని అందం అద్భుతం, పరమాద్భుతం. సుమంత్రుడు మొదలైన వారి ద్వారా దశరథుడు, శ్రీరాముని పిలిపించాడు. శ్రీరాముని తిరుమేని ముందు భాగంలోని అందాన్ని సేవించడంలోని ఆశతో **"రా"** అని అంటాడు. ముందు భాగంలో



కంటే వెనుక భాగంలో ఎక్కువ అందాన్ని కల్గినవాడు, శ్రీరాముడు. కనుక, వెనుక భాగంలోని అందాన్ని సేవించగోరి **"పోకు"** అని అంటాడు. మళ్ళీ, ముందు అందాన్ని సేవించదలచి **"వా"** అంటాడు. ఈవిధంగా మాటిమాటికీ శ్రీరామ సౌందర్యాన్ని సేవించినందున పిచ్చెక్కి "ఇంకా ఇంకొక మాఱు చూచి పో" అంటాడు. ఈ రీతిలో ఎన్నిమార్లు ఎంత దర్శించినా అతనికి తృప్తియే కలుగలేదు - అనేదానిని వాల్మీకి కూడా **"న తతర్ప సమాయాంతం పశ్యమానో నరాధిపః"** అనిఅంటూ పలికారు.

## శ్రీరామసౌందర్యంలో అరణ్యావాసుల అభినివేశం

ఇవి అన్నీ ఉండనివ్వండి. అందంలో అభినివేశాన్ని పొందడం తెలియని అరణ్యావాసులు కూడా శ్రీరాముని రూపసౌందర్యాన్ని చూచి ఆశ్చర్యపడ్డారు - అనే దానిని ఆరణ్యకాండం మొదటిసర్గలో వాల్మీకిమహర్షి **"రూపసంహననం లక్ష్మీం సౌకుమార్యం సువేషతామ్, దదృశు ర్విస్మితాకారా రామస్య వనవాసినః"** (శ్రీరాముని శరీరంలోని చక్కని అవయవాల పొందికను, తేజస్సును, సౌకుమార్యాన్ని దర్శించిన వనవాసు లందరూ ఆశ్చర్యపోయారు.) అని అన్నాడు. ఇక్కడ **"వనవాసినః"**, **"వనచారిణః"** అని పాఠభేదాలున్నాయి. జంతువులు సైతం ఆశ్చర్యంతో శ్రీరాముని అందాన్ని చూచాయట. ఇదికూడా ఉండనివ్వండి. ముక్కు చెవులు ఖండింపబడి, ఆక్రందిస్తూ ఖరదూషణాదుల దగ్గరకు పోయిన శూర్పణఖ "ఇద్దఱు పరమపాపిష్ఠి వారు నన్ను ఏమి పాట్లు పెట్టారు!" అని నిందించవలసిన నోటితో ఏమి పల్కినదో చూడండి-

## శ్రీరాముని అందంలో శూర్పణఖ పొందిన అభినివేశం

**"తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ, పుండరీవిశాలాక్షౌ చీరకృష్ణాజి నాంబరౌ, గంధర్వరాజప్రతిమౌ పార్థివవ్యంజనాన్వితౌ"** (యువకులు, అందమైన వారు, సుకుమారులు, గొప్ప బలాన్ని కలవారు, నారబట్టలను, కృష్ణాజినాన్ని ధరించిన వారు, గంధర్వ ప్రభువులవలె మనోహరులు, రాజలాంఛనాలను కలవారు) అని నోరార పల్కింది. శ్రీరాముని విషయంలో అంతు లేని ప్రేమను కల అయోధ్యా వాసుల నోటిలోకూడా ఈవిధమైన మాట రాలేదు కదా!

## శ్రీరామునిపట్ల వాలి అభినివేశాన్ని పొంది పల్కడం

రామబాణంతో వాలి కొట్టబడి, తాను మరణించే తరుణంలో శ్రీరామునితో వాదించేటపుడు కూడా **"ఓవియతె*ழ*ుద వొణ్ణా ఉరువత్తాయ్!"** అని సంబోధిస్తాడు.

మన ఇష్టానుసారంగా భావించి అందం నిండుగా ఉండేటట్లు లిఖించగల్గినది, చిత్రం. ఆ చిత్రంలోకూడా లిఖించడానికి సాధ్యం కానిది శ్రీరాముని రూపం (అని దీని భావం).

## శ్రీరాముని అందంలో హనుమానుని అభినివేశం

మారుతి శ్రీరాముని చూచిన మొదటి చూపు లోనే **"ఆయతా శ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః, సర్వభూషణభూషార్హాః కిమర్థం న విభూషితాః?"** (విశాలమైనవి, గుండ్రనివి, పరిఘలవంటివి, అన్నిభూషణాలకు తగినవి అయిన నీ బాహువులు ఎందుకు భూషింపబడలేదు?) అని బాహు సౌందర్యంలో మనస్సును పారవేసికొని పలికాడు. **"మజ్జైనత్తిరణ్డ కోల మేనియ మకళిర్ క్కెల్లామ్ నజ్జైన త్తక్కైయవాకి నళిరిరుమ్ పనిక్కు త్తేమ్బాక్క క్కజ్జమొత్తలర్న్ద కణ్ణ!"** అని కంబకవి పలికాడు.

## శ్రీరాముని అందంలో సీతాదేవి పొందిన అభినివేశం

అశోకవనంలో విలపించే సమయంలో సీతాదేవికూడా శ్రీరాముని రూపసౌంద ర్యాన్ని, నేత్రసౌందర్యాన్ని, గమనసౌందర్యాన్నిగూర్చి పల్కి రోదిస్తున్నది. **"తం పద్మ దళపత్రాక్షం మత్తమాతంగగామినమ్"** (తామరపూవుల రేకులవంటి నేత్రాలను, తామరాకు రంగువంటి శరీరవర్ణాన్ని కలవాడు, మదపుటేనుగువలె నడిచేవాడైన ఆ శ్రీరాముని) అనే ఈ ఒక శ్లోకాన్ని చింతించండి. ఇందులో **"పద్మదళపత్రాక్షమ్"** అనేదానికి ఒక మధురమైన అర్థాన్ని పెద్దలు తెల్పుతారు. ఇక్కడ **"పద్మదళ"** మనిగాని, **"పద్మపత్ర"**మని దాని ఏదో ఒకటి పల్కితే చాలు, దళం, పత్రం - అనేవి పర్యాయ పదాలు కనుక. **"దళపత్రాక్షమ్"** అని రెండిటిని కలిపి పల్కడం ఎందుకోసం? - అని విచారించవలసిన ఆవశ్యకత ఇక్కడ ఏర్పడుతుంది. నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళ్ళి ప్రబంధంలో **"శెక్కమలత్తలర్ పోలుమ్ కణ్ కై కాల్ శెమ్‌కనివాయ్, అక్కమలత్తిలైపోలుమ్ తిరుమేని అడిగళుక్కు"** (ఎఱ్ఱని తామరపూలవంటివి- భగవానుని నేత్రాలు, హస్తాలు, పాదాలు. ఆ తామర ఆకువర్ణంవంటి వర్ణాన్ని భగవానుని మేని కల్గి ఉన్నది) అని అనుగ్రహించిన సూక్తి పైన సూచించిన వాల్మీకి సూక్తిని స్పృశించియే - అని పెద్దలంటారు. ఏవిధంగా? అంటే, సంస్కృత భాషలో అక్షమనే పదానికి **"అక్ష మింద్రియ కాయయోః"** అనే నిఘంటు వచనం ప్రకారం రెండర్థాలున్నాయి. నేత్రమని, శరీరమని రెండర్థాలు. **"ఇరట్టుఱ మొళ్ళిదల్"** అనే ద్రావిడభాషామర్యాదప్రకారం **"పద్మదళపత్రాక్షమ్"** అనే ఈ పదసందర్భంలో



అక్షపదానికి ఈ రెండర్థాలను గ్రహించాలి. పద్మదళంవంటి నేత్రసౌందర్యాన్ని కలవాడు, పద్మపత్రం వంటి (అంటే - తామర ఆకు రంగువంటి రంగును కల) తిరుమేనిని కలవాడు - అని భావం. పైన ఉట్టంకించిన నమ్మాళ్వార్ల పాశురం దీనికి నిరూపకంగా ఉన్నది కదా!

## "మనత్తుక్కినియాన్" అని గోదాదేవి తిరునామాన్ని పెట్టడం

శ్రీకృష్ణుని ప్రేమించే గోదాదేవికూడా శ్రీరామునకు **"మనత్తుక్కినియాన్"** అనే తిరునామాన్ని సమర్పించింది. తిరుప్పావైలో - **"శినత్తినాల్ తెన్నిలజ్ఞైకోమానై చ్చెర్ఱ మనత్తుక్కినియాన్"** (కోపంతో దక్షిణ దిక్కులోని లంకాధీశుని వధించిన మనస్సుకు మధురమైన వాడు) అని పల్కడం గమనించాలి. **"పొల్లా అరక్కనై క్కిళ్ళిక్కళైన్దానై"** (దుష్టరాక్షసుని గిల్లి పారవేసిన వానిని) అని (ఈ గోదాదేవియే) పల్కిన రీతిలో అవలీలగా సంహరించవలసిన రావణుని శ్రీరాముడు చాలా ఆలసించి, ప్రయాసపడి సంహరించినట్లుగా కథ కన్పిస్తుంది. దీనికి కారణాన్ని వివరించే రీతిలో ఉన్నది **"శినత్తినాల్ తెన్నిలజ్ఞైక్కోమానై చ్చెర్ఱ మనత్తుక్కినియాన్"** (కోపంతో లంకాధిపతిని వధించిన మనస్సుకు మధురమైనవాడు) అనే గోదాదేవి సూక్తి. దీని అంతరార్థం ఏమి? అంటే **"పఞ్జైన శివక్కు మెన్‌కాల్ పావైయై ప్పిరిత్త పావి వఞ్జకన్"** (పత్తిని తొక్కినా కందిపోయే సుకుమారమైన పాదాలను కల సీతను విశ్లేషింపజేసినపాపి, వంచకుడు) అయిన రావణుని సంహరించే తీరాలనే అభిప్రాయం శ్రీరామునకు ఉండి ఉంటే, సముద్రానికి వారధిని కట్టి లంకకు రావాలి - అనే నిర్బంధం లేదు. తన అందాన్ని చూపి అయినా అతనిని వశపఱచుకోవాలి - అనే అభిప్రాయమే శ్రీరామునకు ఉన్నది. **"శూదనాయ్ క్కళ్వనాకి త్తూర్‌త్తరోడు ఇశైన్ద కాలమ్, మాదరార్ కయఱ్కణెన్నుమ్ వలైయుళ్ పట్టఴున్దువేనై, పోదరే! ఎన్ఱు శొల్లి ప్పున్దియిల్ పుకున్దు తన్‌పాల్ ఆదరమ్ పెరుక"** (జూదరినై, దొంగనై ధూర్తులతో తిరిగిన కాలంలో స్త్రీల చేపలవంటి కన్నుల వలలో చిక్కుకొన్న నన్ను **"ఇటురా"** అని పల్కి, తనపట్ల ఆదరాన్ని పెంపొందేటట్లు) చేయగల్గిన అందం తనకు ఉన్నందున ఆ అందాన్ని చూపి, ఆ రాక్షసునికూడా వ్యామోహపఱచి, వశం చేసికోవచ్చు - అనే భ్రాంతి శ్రీరామునకు ఉన్నది. కాని, ఈ అందాన్ని ఆ పాపిష్ఠివాడు లెక్కించలేదు. అందువల్ల కోపం కల్గింది. ఆ కోపంతో, ఇక ఇతనిని ప్రాణంతో నిలిపి ఉంచకూడదు- అని సంహరించాడు. అతడే **"మనత్తుక్కినియాన్"** చిత్తాపహారియైన అందాన్ని కలవాడు- అనేది అంతరార్థం.

### "భక్తులను ఆదరంతో చూచేవాడు" - అనే అర్థం

**"ఏకప్రియదర్శనః"** అనే సూక్తికి ఇంతవరకు వివరించిన అర్థం. "శ్రీరాముడు ఆనందంగా, మధురంగా దర్శించదగినవాడు" అనేదానిని పురస్కరించుకొని చేయబడింది. ఇక, వేఱొక రీతిలో కూడా ఈ పదానికి అర్థం చెప్పవచ్చు. శ్రీరాముని ఇతరులు దర్శించడం మధురం - అనే అర్థంవలెనే, "శ్రీరాముడు ఇతరులను కటాక్షించడం మధురం" అనే అర్థంకూడా పొసగుతుంది. అందువల్ల, ఈ అర్థం కూడా ఇక్కడ గ్రహించవచ్చు. అయోధ్యాకాండలో (17-14) ఒక అద్భుతమైన శ్లోకం ఉన్నది. అది ఏమంటే - **"యశ్చ రామం న పశ్యేత్తు యం చ రామో న పశ్యతి, నిందిత స్స భవేల్లోకే స్వాత్మాప్యేనం విగర్హతే"** అనేది. దీని భావం ఏమంటే - శ్రీరాముని దర్శించనివాడు, శ్రీరామునిచే కటాక్షింపబడనివాడు ఎవడో, అతడు లోకంచే నిందింపబడదగినవాడు. లోకంలోని వారు అతనిని నిందించడం అనేది అటు ఉండనీ. చివరకు తనను తానే నిందించుకొనవలసివస్తుంది - అని. ఇందువల్ల శ్రీరాముని దర్శించేటట్లే, శ్రీరామునిచే కటాక్షింపబడడం కూడా పురుషార్థమని తెలుస్తున్నందున, **"ఏకప్రియ దర్శనః"** అనే దానికి శ్రీరాముడు ఇతరులను కటాక్షించడం మధురమై ఉంటుంది- అనే అర్థాన్ని గ్రహించడం పొసగుతుంది. దీనికి ఉదాహరణగా ఒక సందర్భాన్ని చూపిస్తాము. శ్రీరాముడు శబరి ఆశ్రమానికి వేంచేసి, ఆమెను కటాక్షించగానే, ఆమె అంటున్నది - **"చక్షుషా తవ సౌమ్యేన పూతాస్మి రఘునందన!"** అని. "శ్రీరామా! నీ చల్లని కటాక్ష వీక్షణం నాపై పడగానే నేను మిక్కిలి పరిశుద్ధిని పొందాను" అని అన్నది. తిరుప్పావైలో **"అఙ్గణ్ ఇరణ్డుమ్ కొణ్డు ఎఙ్గళ్ మేల్ నోక్కుదియేల్ ఎఙ్గళ్ మేల్ శావమ్ ఇఱ్రిన్దు ఏలోర్ ఎమ్బావాయ్"** (అందమైన నేత్రాలు రెండిటితో నీవు మాపై కటాక్షిస్తే మాపై గల శాపం తీరిపోతుంది) అని అనుగ్రహించిన పాశురం దీనికి సాక్షిగా గమనించ దగినది.

ఈవిధంగా ఇంతవరకు **"ఏకప్రియదర్శనః"** అనే దానికి "కోరి దర్శించ దగిన అందాన్ని కలవాడు" అని, "భక్తులను కోరి దర్శించేవాడు" అని రెండు విధాలైన అర్థాలను వివరించాము.

## 12. ఆత్మవాన్ కః? (ఆత్మను కలవాడెవడు?)

శ్రీమద్వాల్మీకిరామాయణంలోని వాల్మీకి - నారద సంవాదంలో **"ఆత్మవాన్ కః"** - అనే పన్నెండవ ప్రశ్న ఇక వివరింపబడుతున్నది. **"ఆత్మవాన్"** అనే పదానికి



ఆత్మను కలవాడని అర్థం. **"ఆత్మా"** అనే పదానికి అయిదు అర్థాలు సంస్కృత భాషా నిఘంటువులలో చూపబడ్డాయి. **"ఆత్మా జీవే ధృతౌ దేహే స్వభావే పరమాత్మని"** అనే నిఘంటువును పూర్వులైన వ్యాఖ్యాతలు (శ్రీగోవిందరాజులు) ఉట్టంకించారు. ఆ అయిదు అర్థాలు ఏవి? అంటే - జీవాత్మ, ధైర్యం, శరీరం, స్వభావం, పరమాత్మ అనేవి. ఈ అయిదు అర్థాలు శ్రీరాముని విషయంలో పొసగే రీతిని ఇక వివరిస్తాము.

జీవాత్మలను కల్గినవాడు - అనేది మొదటి అర్థం. పరమాత్మ ఒక్కటే ఉన్నాడని, మిగిలిన చేతనాచేతనాలు ఏమీ లేవని, అవి ఉన్నట్లు భాసించడం మాయావిలసితమని అద్వైతసిద్ధాంతానికి చెందినవారి అభిప్రాయం. ఆ రీతిలో కాకుండా, శ్రీరాముడు పరమాత్మయై, సకలజీవాత్మలను కలవాడనే అర్థమే కాక, జీవాత్మయై ఉండే స్వభావాన్ని కలవాడనే అర్థంకూడా పొసగుతుంది. (**"ఆత్మవాన్"**- అనేదానికి **"ఆత్మత్వవాన్"** - అని అర్థం). శ్రీమన్నారాయణ మూర్తియే శ్రీరాముడై అవతరించాడు అనే పరమార్థం భాసిస్తూ ఉన్నా, **"పితరం రోచయామాస"** (తండ్రిగా ఇష్టపడ్డాడు) అని, **"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్"** (నన్ను మానవునిగా, దశరథుని కుమారుడైన రామునిగా భావిస్తున్నాను) అని పలికే రీతిలో మనుష్య జాతిలో జన్మించి, దశరథాత్మజునిగా ఒక జీవాత్మభావాన్ని తనలో ఆవాహనం చేసికొన్నాడు.

కనుక, దానికి ఈ అర్థం పొసగుతుంది. సకలాత్మలకు శేషియై, అంటే- అందఱు తనకు చేసే కైంకర్యాలను పరిగ్రహించేవాడై, అందువల్లనే, పరమాత్మయై ఉండేవాడైన సర్వేశ్వరుడు శ్రీరాముడై అవతరించి, తాను కైంకర్యం చేసే జీవాత్మ అయినాడు - అని భావం. ఎవరికి కైంకర్యం చేశాడు? అని అంటే, దానిని ఆలకించండి.

### శ్రీరాముని కింకరత్వస్వభావం

విశ్వామిత్రముని తాను ఒక యాగాన్ని చేయాలని ఆరంభించి, దానిని నిర్విఘ్నంగా పూర్తిచేయడంకోసం దశరథ చక్రవర్తి దగ్గరకు వచ్చి, శ్రీరాముని పంపమని అర్థించాడు. దానికి దశరథుడు అంగీకరించలేదు. రాక్షసులతో యుద్ధం చేయగల్గిన వయస్సు లేకుండా, చాలా చిన్న వయస్సులోనివాడైన నా కుఱ్ఱవానిని నేను నీతో పంపలేను - అని అన్నాడు దశరథుడు. దానికి విశ్వామిత్రముని దశరథుని చూచి "ఇతని గొప్పతనాన్ని నీవు తెలియలేదు. చాలా గొప్పవాడైన ఇతనిని చాలా చిన్నవాడని భావిస్తున్నావు. అంతే, **"వేదాహ మేతం పురుషం మహాంతమ్"** (ఇతనిని మహా

పురుషుడుగా తెలిసికొంటున్నారు) అని వేదం పల్కిన మహాపురుషుడుకదా ఇతడు. ఇతనినిగూర్చి నీకు ఎదురుగా వేంచేసి ఉండే, గొప్ప తపస్సును చేసిన గొప్ప మునులకు కూడా బాగా తెలుసు'' అని ఈ విధంగా పలు మాటలను పల్కి, శ్రీరామలక్ష్మణులను తీసికొని బయలుదేరి వెళ్ళాడు. తండ్రివద్ద ఈ విధంగా ముని పల్కి మాటలను అన్నిటినీ ఏకాంతంలో ఆలకించిన శ్రీరాముడు. ''శేషభూతుడనై, పరతంత్రుడనై వచ్చి జన్మించాలని ఆశపడి పుట్టిన నన్ను వీరు పరమాత్మ - అని వ్యక్తం చేశారే! ఇది నా అభిప్రాయానికి తగినది కాదు కదా! ఇంతేకాక, ఈ విశ్వామిత్రముని ఇంతవరకు ఎన్నో గొప్ప గొప్ప యాగాలను, తపస్సులను చేశారు. అపుడు ఎవరినీ సహాయంగా ప్రార్థించలేదు. ఇపుడు వీరు చాలా చిన్నదిగా చేయాలని తలచిన ఆఱు దినాల యాగానికి సహాయం కోరి రావడం ఉరికే కాదు. ఏదో ఒక విశేషం కోసమే అయి ఉండాలి. నన్ను ఆజ్ఞాపించి కార్యాన్ని నిర్వహించదలచే-అంటే - నేను ఆశపడిన శేషత్వాన్ని లోకం అంతా తెలిసేటట్లు చేయడంకోసమే - నన్ను కోరివచ్చారు కాబోలు'' అని భావించి, శ్రీరాముడు ఆ మునితో ఒక విన్నపాన్ని చేశాడు. **"ఇమౌ స్మ మునిశార్దూల! కింకరౌ సముపస్థితౌ, ఆజ్ఞాపయ యథేష్టం వై శాసనం కరవామ కిమ్"** (మునివరా! మేమిద్దరమూ నీకు సేవకులమై ఉన్నాము. మమ్ములను నీ ఇష్టానుసారంగా ఆజ్ఞాపించు. ఏ ఆజ్ఞను పాలించాలో తెలుపు.) అని అన్నాడు. దీని అర్థమేమంటే-''ముని సార్వభౌమా! నేను, నా తమ్ముడు లక్ష్మణుడు నీకు కైంకర్యం చేయడంకోసం వచ్చాము. ఎల్లప్పుడూ మీ సమీపంలో ఉండి, మీరు ఆజ్ఞాపించే కైంకర్యాలను చేయడానికి మేమిద్దరం కాచుకొని ఉన్నాము. మీకు ఏ కైంకర్యాన్ని చేయగలమో! అని ఎదురుచూస్తున్నాము'' అని.

### కింకరశబ్దార్థవివరణం

ఈ శ్లోకంలో ప్రయోగింపబడిన **"కింకర"** పదం చాలా గొప్పది. **"కిం కరవాణి కిం కరవాణి?"**- (ఏమి చేయగలను? ఏమి-చేయ గలను?) అని చేతులను జోడించి నిలచేవానికి కింకరుడని పేరు. లేక, **"కిం కృతవాన్ కిం కృతవాన్?"** ఆహా! (ఏమి చేశాడు? ఏమి చేశాడు!) అని యజమానిచే పొగడబడేవాడు- అనికూడా చెప్పవచ్చు. ఇటువంటి కింకరుడనే పదాన్ని పరిగ్రహించి, సేవ చేసే స్వభావం తనకు ఉన్నదని చూపడంకోసమే శ్రీరాముడు విశ్వామిత్రమునిని తన తండ్రివద్దకు రప్పించి, తనను సహాయంగా కోరేటట్లు చేసికొన్నాడు - అనే తత్త్వం ఇక్కడ జ్ఞాతవ్యమైనది. అందువల్ల, కైంకర్యం చేయడమనేది జీవాత్మస్వభావం కనుక, ఇటువంటి జీవాత్మత్వాన్ని



శ్రీరాముడు కలవాడు - అనేదానిని ఉద్దేశించియే **"ఆత్మవాన్"** అని అనబడ్డాడు - అని తెలిపినట్లయింది.

### ఆత్మశబ్దార్థమైన ధైర్యశబ్దవివరణం

ఇక, **"ఆత్మా"** అనే పదానికి రెండవ అర్థం - ధైర్యమనేది. దానిని కలవాడు శ్రీరాముడు - అని అర్థం. ధైర్యమంటే - స్థిరనిశ్చయం. దేనికీ జంకకుండా, చేబట్టిన కార్యాన్ని నెఱవేర్చగల్గిన మనఃస్థైర్యమే అది. దీనిని మనం శ్రీరామాయణంలో పలు సందర్భాలలో దర్శించవచ్చు. అయినా, ఒక సందర్భాన్ని ఉదాహరించి చూపిస్తాము. విభీషణాళ్వాన్ రావణునిచేత తిరస్కరింపబడి, **"త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః"** (పుత్రులను, భార్యను విడచిపెట్టి రాఘవుని శరణు పొందాడు.) అని వచ్చి చేరినపుడు వానర వీరులు పలువురు ''ఇతడు రావణుని తమ్ముడు. ఇక్కడి మర్మాలను తెలిసికొని పోవాలని వచ్చినవాడే తప్ప, వాస్తవానికి భక్తితో వచ్చినవాడు కాడు. ఇతనిని మనలో చేర్చుకోవడం తగదు. చేర్చుకొంటే మన కులం చెడిపోతుంది'' అని ఈరీతిలో పలుమార్లు అడ్డుపెట్టి పల్కి, మిక్కిలి గట్టిగా వాదించారు. అపుడు శ్రీరాముడు ఆ అడ్డుమాటలకు అన్నిటికి సమాధానాన్ని పల్కి, ''శరణాగతపరిత్రాణం చేసి తీరుతాను''- అని అన్నాడు. ఆ విధంగా పల్కినా, మళ్ళీ సుగ్రీవమహారాజు అడ్డుగా నిలచి పలు హేతువులను పల్కి, ''ఇతనిని చేర్చుకొనకూడనే కూడదు'' అని బలంగా ఆక్షేపించాడు. ఆ ఆక్షేపం వానర వీరులతో ఆగకుండా, తమ్ముడైన లక్ష్మణుడుకూడా ఆ ఆక్షేపం చేసేవారిలో కలిశాడు. దీనిని వాల్మీకిమహర్షి **"ఏవ ముక్తస్తు రామేణ సుగ్రీవః సహలక్ష్మణః, ఉత్థాయేదం మహాప్రాజ్ఞః ప్రణతో వాక్యమబ్రవీత్"** (ఈవిధంగా రామునిచే పల్కబడిన గొప్ప ప్రాజ్ఞుడైన సుగ్రీవుడు లక్ష్మణునితో పాటు పైకి లేచి నమస్కరించి ఈ వాక్యాన్ని పలికాడు) అనే శ్లోకంలో తెలిపాడు. ఈవిధంగా లక్ష్మణునితో పాటుగా పలువురు ఆక్షేపించినా, శ్రీరాముడు, తాను భక్తపరాధీనుడై నందున వీరిని అనువర్తించవలసినవాడైనా, తన మనఃస్థైర్యంనుండి కొంచెం (నూవు గింజ అంత) కూడా జంకలేదు. అపుడు అతడు పల్కిన మాటలు ఆశ్చర్యకర మైన అతని ధైర్యాన్ని వ్యక్తం చేస్తున్నాయి. వాటిలో ఒక శ్లోకాన్ని వినండి. **"పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం శ్చైవ రాక్షసాన్, అంగుళ్యగ్రేణ తాన్ హన్యామ్ ఇచ్ఛన్ హరిగణేశ్వర!"** అనేది ఆ శ్లోకం. దీని భావమేమంటే - ''సుగ్రీవా! ఈ విభీషణుని నేను చేర్చుకొంటే నాకు ఏదో ప్రళయంవంటి అపాయం కల్గుతుందని కదా నీవు భావిస్తున్నావు. ఈ రాక్షసుడొక్కడే కాదు. భూమండలంలో ఉండే అందఱు రాక్షసులు ఒకటిగా కలసి,

ఇంకా ఉండే పిశాచ - దానవ - యక్షాదులను కూడా కలుపుకొని నామీదకు రానీ. అసురరాక్షస సమూహాలు అన్నీ ఒకటిగా కలిసి ఎదిరించి వచ్చినా, నాకు విల్లుకూడా అక్కరలేదు. బాణాలు వద్దు. బాహువు అక్కరలేదు. ఒక కాలి చిటికెన వేలు చివరి భాగంతో ఆ శత్రువర్గాన్ని అంతటిని సంకల్పించి అవలీలగా సంహరిస్తాను చూడు. అవలీలగా అంటే ఏమో తెలుసుగా? **"ఇచ్ఛన్"** - కేవలం ఇచ్ఛామాత్రంతోనే సంహరిస్తాను - అని భావం.

## ఆత్మశబ్దార్థమైన దేహాన్ని కల్గి ఉండడాన్నిగూర్చి వివరణం

ఇక, **"ఆత్మా"** అనే పదానికి మూడవ అర్థం - దేహమనేది. దేహాన్ని కల్గిన వాడెవడు? అని అడిగినట్లయినది. లోకంలో దేహులై జన్మించిన వారందఱు దేహాన్ని కలవారై ఉండగా, ఈవిధమైన ప్రశ్నను అడుగవలసి ఉన్నదా - అని తోస్తుంది. వినండి. ఉపనిషత్తులలోని కొన్ని మూలలలో భగవానునకు చేతులు లేవు, కాళ్ళు లేవు, కళ్ళు లేవు, చెవులు లేవు, శరీరమే లేదు - అని తెలుపబడింది. **"అపాణిపాదో జవనో గ్రహీతా, పశ్యత్యచక్షుః స శ్రుణోత్యకర్ణః"** అని, **"అచక్షుశ్శ్రోత్ర మపాణి పాదమ్"** అని ఇత్యాదిగా. దీనినిబట్టి కొందఱు మతాంతరులు భగవానునకు చెవులు, నోరు, కళ్ళు, ముఖం, ముక్కు, శరీరం లేవు అని ప్రవచిస్తారు. అయితే, ఆ వేదాలలోనే **"విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖో విశ్వతో హస్త ఉత విశ్వత స్స పాత్"** అని, **"సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్"** అని గల భాగాలు ఆ భగవానునకు వేలాది దివ్యాంగాలున్నవని ఘోషిస్తున్నది. అంగాలు లేవని ఒకవైపు అనడం, వేలాది సంఖ్యలో అంగాలున్నాయని ఇంకొక వైపు చెప్పే రీతిలో ఉంటే, అది పరస్పరవ్యాహతభాషణమే కదా! యథార్థవాది అయిన వేదం ఈవిధంగా విరుద్ధంగా పలుకవచ్చునా? భగవానునకు దేహమున్నదా లేదా? ఉంటే, ఉన్నదని చెప్పాలి. లేకపోతే లేదని అనాలి. రెండు విధాలుగా వ్యాహతంగా పల్కితే ఇది పొసగడం లేదే!'' అని సామాన్యులు ఆలోచిస్తారు. ఇక్కడ వాస్తవమేమి? అంటే, మనవంటివారు పొందిన, పొందే దేహాలు కర్మమూలకంగా-అంటే - పుణ్యపాపాలనే రెండు విధాలైన కర్మల కారణంగా కలిగేవి. భగవానుడు పరిగ్రహించే దేహాలు అటువంటి కర్మనిబంధనాలు కాకుండా, **"ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః"** (తన సంకల్పంతో గ్రహించిన, తనకు ఇష్టమైన దేహాలను కలవాడు) అని పరాశర మహర్షి పల్కినట్లుగా, దాసుల ఇచ్ఛను, తన ఇచ్ఛను అనుసరించి గ్రహింపబడేవి. అంతేకాక, **"ఉయిరళిప్పాన్ ఎన్నిన్ద యోనియుమాయ్ ప్పిఱన్దాయ్ ఇమైయోర్తలైవా!"** (తిరువిరుత్తమ్-1) (జీవులను రక్షించడం కోసం ఎన్నెన్ని జాతులలో అవతరించావో, నిత్యసూరినాథా!) అని ఆళ్వార్లు అనుగ్రహించినట్లుగా సంసారిచేతనసంరక్షణార్థంగా కరుణతో పరిగ్రహింపబడేవి.



అందువల్ల, భగవానునకు దేహం లేదని పలికే సందర్భాలో - పుణ్యపాప ఫలంగా కలిగే దేహం లేదని, భగవాననకు దేహం ఉన్నదని పలికే సందర్భాలో- దయామూలంకమైన, అప్రాకృతదివ్యదేహం ఉన్నదని అర్థం. అందువల్ల ఏ విరోధం లేదు- అని వేదాంతుల నిర్వాహం. దీనిని పురస్కరించుకొనే వాల్మీకి మహర్షి **"ఆత్మవాన్ కః"** - దివ్యదేహాన్ని కలవాడెవడు? - అని అడిగాడు. మగవారినిసైతం స్త్రీలుగా భావింపచేయగల బహుసుందర విలక్షణదివ్యమంగళ విగ్రహాన్ని కలవాడు ఎవడు?- అని అడిగిన తీరు ఇది.

## ఆత్మశబ్దార్థమైన స్వభావాన్ని కల్గి ఉండడమనేదాని వివరణం

ఇక, **"ఆత్మా"** అనేదానికి నాల్గవ అర్థం - స్వభావమనేది. స్వభావాన్ని కలిగిన వాడెవడు? అనికూడా ఒక ప్రశ్న ఉంటుందా? ఇది అసంభావితమైన ప్రశ్న కనుక, దీని భావాన్ని వేఱువిధంగా గ్రహించాలి. ఏవిధమైన స్వభావాన్ని కలవాడు? అని అడిగినట్లు గ్రహించాలి.

భరతాళ్వాన్ చిత్రకూటానికి వచ్చి, శ్రీరాముని అయోధ్యానగరానికి తిరిగి వేంచేయాలని వేడినపుడు, శ్రీరాముడు అది వీలు కాదన్నాడు. అపుడు వశిష్ఠ మహర్షి శ్రీరాముని ఉద్దేశించి **"భరతస్య వచః కుర్వన్ యాచమానస్య రాఘవ, ఆత్మానం నాతివర్తేథాః సత్యధర్మపరాక్రమ!"** (రాఘవా! నిన్ను యాచించే భరతుని మాట ప్రకారం చేస్తూ, నీ సహజ స్వభావమైన ఆశ్రిత పారతంత్ర్యాన్ని విడువకు) అని అన్నాడు. ఈ శ్లోకార్థం తిరువాయ్మొళి ఈడు వ్యాఖ్యలో **"తేవుమ్ తన్నైయుమ్"** (2-7-4) అనేచోట నంబిళ్ళై అనుగ్రహించారు. దానిని వినండి - **"తేవుమెన్గిఱదు - ఐశ్వర్యత్తై. తన్నై ఎన్గిఱదు- ఆశ్రిత పారతంత్ర్యత్తై, ఆత్మభూతం భరతం నాతివర్తేథాః - ఎన్గిఱాన్ ఎన్ఱు శిలర్ శొల్లువర్కళ్. భట్టర్, నీరాన తన్మైయాకిఱదు - ఆశ్రితపరతంత్రరాకై. ఉమ్ముడైయ తమ్బి శొన్న వార్త్తైయై మఱన్దు నీరాన తన్మైయై ఇళవాదే కొళ్ళు మెన్గిఱాన్ - ఎన్ఱు"** (**"తేవుమ్"** - అంటే - ఐశ్వర్యం. **"తన్నై"**-అంటే-ఆశ్రిత పారతంత్ర్యం. నీకు ఆత్మ స్థానీయుడైన భరతుని అతిక్రమించకు - అని కొందఱన్నారు. నీ స్వభావం - ఆశ్రిత పారతంత్ర్యం. నీ తమ్ముడు పల్కిన మాటను మీఱి నీ స్వభావాన్ని కోల్పోకు - అని అంటున్నాడు - అని భట్టర్ పలికారు.) అనేది ఈడు శ్రీసూక్తి. ఇందువల్ల వ్యక్తమయేది

ఏది? అంటే, భక్తులకు పరతంత్రుడై ఉండడమనే ఆశ్రిత పారతంత్ర్యమే శ్రీరామునకు స్వభావం - అనేది. ఈవిధంగా భక్తపరాధీనుడైనవాడు ఎవడు? అని ప్రశ్నించినట్లయినది. శ్రీరాముడు భక్తపరాధీనుడై చేసిన కార్యాలను చెప్పు - అని నారద మహర్షిని, వాల్మీకి మహర్షి అడిగినట్లుగా అయినది. శ్రీరాముడు ఆవిధంగా భక్తపరాధీనుడై చేసిన కార్యాలలో ఒక కార్యాన్ని గూర్చి తెల్పుతున్నాను. వినండి.

## ప్రసంగవశాత్తు వాలివధను ఉపపాదించడం :

శ్రీరాముడు వాలిని వధించిన కార్యం లోకప్రసిద్ధం. అతనిని వధించవలసిన దోషం ఉన్నందువల్లనే శ్రీరాముడు వధించాడు - అనేది వాస్తవమైనా, లోకంలో దోషిని దండించే ప్రభువులు అతనిని నేరుగా తమ వద్దకు పిలిపించి, విచారించి దండిస్తారే తప్ప, ఎదుటి వ్యక్తి (రెండవ వ్యక్తి) చెప్పిన మాటను మాత్రమే గ్రహించి, వధించరు. ఆ క్రమంలో శ్రీరాముడు వాలిని నేరులో విచారించే వధించి ఉండాలి. ఆ విధంగా చేసినట్లు శ్రీరామాయణంలో కన్పించడం లేదు. పూర్వం కబంధవధను చేసినపుడు అతడు (కబంధుడు) విమానంలో ఉండి, సుగ్రీవుని మంచితనాన్ని, వాలి దౌష్ట్యాన్ని గూర్చి పలికాడు. అతడు అసత్యం చెప్పినట్లయితే, అతనిని విమానం మోసి ఉండేది కాదు. అతనిని విమానం మోస్తూ ఉన్నందున కబంధుడు చెప్పినది నిజమే అనే నమ్మకం శ్రీరామునకు బలంగా కల్గింది. అందువల్ల సుగ్రీవుని విషయంలో గొప్ప గౌరవాన్ని పెట్టుకొని, అతనిని పరమభక్తునిగా భావించి, అతనికి పరతంత్రుడై, అతని మాటప్రకారం (లేక, అతని తృప్తికోసం) వాలివధను చేశాడు - శ్రీరాముడు - అని మన పూర్వాచార్యులు నిర్వహిస్తారు. దీనిని ఇక్కడ తెలియాలి.

## శ్రీరాముడు పరమాత్మగా ఉండే స్థితిలోకూడా దోషరహితుడు

ఇక, ''ఆత్మా'' అనే పదానికి అయిదవ అర్థం - పరమాత్మ అని. పరమాత్మను కలవాడెవడు? (అంటే), పరమాత్మయై ఉండే స్వభావాన్ని కల్గినవాడెవడు? అని అడిగినట్లయింది. **"ఆత్మానం మానుషం మన్యే రామం దశథాత్మజమ్"** అని తానే పల్కినట్లు ఒక మానవుడై పుట్టినప్పటికీ, పరమాత్మయై ఉండే స్వభావంలో కూడా లోటు లేనివాడు. శ్రీరాముని యథార్థస్వభావాన్ని మఱుగుపరచి పలికే వాల్మీకిముని కూడా అయోధ్యాకాండ ప్రారంభంలో - **"స హి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః, అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణు స్సనాతనః"** (గర్వించిన రావణుని వధను కోరిన దేవతలచే ప్రార్థింపబడిన సనాతనుడైన విష్ణువు మానవ లోకంలో అవతరించాడు.)



అని పట్టపగలు చేశాడు. ఈ శ్రీరాముడే శ్రీకృష్ణుడుగా అవతరించి, గీతాశాస్త్రాన్ని అనుగ్రహించేటపుడు అందులో అవతార రహస్యాన్నిగూర్చి పల్కుతూ **"అజోఽపి సన్ అవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్, ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా"** (నేను పుట్టుక లేనివాడనైనా, అవ్యయుడనైనా, భూతాలకు ఈశ్వరుడనైనా నా పరత్వాన్ని అధిష్ఠించి నా సంకల్పంతో అవతరిస్తాను) అని అన్నాడు. పరమాత్మగా ఉండే స్వభావాన్ని విడువకుండా వచ్చి తాను జన్మించేటట్లుగా ఈ సూక్తిలో తెలిపాడు. అందువల్ల, జీవాత్మగా ఉండే స్వభావంతో కూడా పరమాత్మగా ఉండే స్వభావాన్ని కల్గి ఉండేవాడెవడు? - అని ప్రశ్నించినట్లయినది. శ్రీరామావతారంలో పరమాత్మ స్వభావంతో చేసిన కార్యమేమి? - అని గమనించాలి.

## పరమాత్మత్వం సువ్యక్తమైన ఒక సందర్భాన్ని ప్రదర్శించడం

జనస్థానంలో ఖరదూషణాదివధను చేసినపుడు **"చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్, ఏకశ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి?"** (భయంకరమైన యుద్ధాన్ని చేసే రాక్షసులు పదునాల్గువేలమంది. ధర్మాత్ముడైన రాముడొక్కడే. యుద్ధం ఏ విధంగా జరుగుతుందో!) అనే రీతిలో పధ్నాలుగు వేలమంది రాక్షసులతో శ్రీరాముడు ఒంటరిగా ఏ రీతిలో యుద్ధాన్ని చేయగలడు? - అని ఆకాశచారులు కలత చెందగా, శ్రీరాముడు అసహాయశూరుడై- ఒక క్షణకాలంలో అంతమంది రాక్షసులను సంహరించడం పరమాత్మభావానికే తగినది- అని కొందఱు అంటారు. దశరథుడు, కార్యవీర్యుడు మొదలైనవారు కూడా ఈవిధంగా పలు గొప్ప యుద్ధాలను చేశారు కనుక, ఇది పరమాత్మ భావానికే అసాధారణమని గ్రహించనక్కర లేదు. **"మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకాన నుత్తమాన్"** (నాచే నీవు అనుమతింపడ్డావు. నీవు ఉత్తమ లోకాలను పొందు) అని పల్కి, జటాయు మహారాజుకు మోక్షాన్ని శ్రీరాముడిచ్చాడు. మోక్ష ప్రదానత్వమనేది భగవానునకు మాత్రమే అసాధారణం కనుక ఈ చరిత్రవల్ల పరమాత్మత్వం వ్యక్తమవుతున్నది కొందఱు పెద్దలంటారు. ఇక్కడ కూడా **"సత్యేన లోకాన్ జయతి"** అనే ప్రమాణాన్ని గొని ''జటాయువుకు మోక్షాన్ని ఇవ్వడం పరమాత్మ భావంతో కాదు. సత్యవాక్కుయొక్క మహిమవల్లనే'' అని నంబిళ్ళై మొదలైన పూర్వా చార్యులు అర్థనిర్వాహాన్ని చేశారు. అది శ్రీరాముని మనుష్యభావనకు పొసగేటట్లు చేయడం కోసమే కనుక, దానివల్ల పరమాత్మ స్వభావం ప్రకాశించిందని అనడంలో అడ్డు లేదు. ఈవిధంగా **"ఆత్మా జీవే ధృతౌ దేహే స్వభావే**

**పరమాత్మని"** అనే నిఘంటువులో కన్పించే అర్థాలన్నీ **"ఆత్మవాన్ కః"** అనే ప్రశ్నలో పొసగిన రీతిని వివరించాము.

## 14. కః ద్యుతిమాన్? (కాంతిని కలవాడెవడు?)

### వరుసలో పదమూడవప్రశ్న వివరణాన్ని విడువడంలోని కారణం

**"ఆత్మవాన్ కః?"** అనే పన్నెండవ ప్రశ్న ఇతః పూర్వం వివరింపబడింది. ఇక, **"జితక్రోధఃకః?"** అనే పదమూడవ ప్రశ్న వివరింపబడాలి. అయితే అది, **"కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే?"** అనే పదహారవ ప్రశ్నతో చేర్చి వివరింప బడవలసినది అయినందున, ఇపుడది విడువబడుతున్నది. ఎందుకంటే, **"జితక్రోధః కః?"** అనే దానికి కోపాన్ని జయించినవాడెవడు? - అని అర్థం. తరువాత, పదహారవ ప్రశ్నలోని అర్థం చూస్తే - దీనికి విరుద్ధంగా కన్పిస్తున్నది. యుద్ధరంగంలో ఎవని కోపాన్ని చూసి దేవతలు కూడా భయపడి వణకిపోతారు? - అనేది చివరి ప్రశ్న. **"కః జితక్రోధః?"** అనే పదమూడవ ప్రశ్నను ఆ పదహారవ ప్రశ్నను ఒకటిగా కలిపి వివరిస్తాము. ఇపుడు **"కః ద్యుతిమాన్?"** అనే పధ్నాలుగవ ప్రశ్నను వివరిస్తాము.

### రామసూర్యునకు సీతాదేవి ప్రభ

ద్యుతి అంటే - కాంతి. కాంతిని కలవాడెవడు? అని అడిగినట్లయినది. లోకంలో సూర్యుని కాంతిని కలవానినిగా చూస్తున్నాము. గొప్ప రత్నాన్ని కాంతిని కల్గిన దానినిగా చూస్తున్నాము. ఆ విధంగా, శ్రీరాముని సూర్యునిగా, రత్నంగా వ్యవహరిస్తున్నారు. శ్రీరామాయణంలో **"రామదివాకరః"** (సుందరకాండ) అని చెప్పబడినందున శ్రీరాముడు సూర్యునివంటి వాడనేది శ్రీరామాయణ సిద్ధం. రామరత్నమని పలువురు పేరుపెట్టు కొంటున్నందున, ఆళ్వార్లు **"మణియే మణిమాణిక్కమే"** అని రత్నంగా సంబోధించి నందున శ్రీరాముడు రత్నంవంటివాడని వ్యక్తమవుతున్నది. సూర్యునకు, రత్నానికి కాంతివల్ల గొప్పతనం. ఈ శ్రీరామసూర్యునకు, రామరత్నానికి గొప్పతనాన్ని కల్గించే కాంతి ఏది? అంటే, సీతాదేవియే. ఆమెను కాంతిగా శ్రీరామాయణమే స్పష్టంగా తెల్పుతున్నది. ఏవిధంగా? అంటే, సీతాదేవి రావణుని చూచి పలికేటపుడు **"అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా"** అని అన్నది. ''సూర్యునకు కాంతివలె, శ్రీరామునకు నేను'' అని పల్కినట్లయినది. ఈ విషయమే శ్రీరాముని వాక్కులో కూడా ఒక సమయంలో వ్యక్తమైనది. **"అనన్యా హి యా సీతా భాస్కరేణ ప్రభా యథా"** అని. ''సూర్యునకు కాంతివలె, నాకు సీత'' అని దీని భావం. ప్రభావాన్



అయిన సూర్యుడు ప్రభను విడచి ఉండనట్లే, భగవానుడు సీతాదేవిని కలసి, విశ్లేషించ కుండా ఉంటుంది-అనే తాత్పర్యం ముందుగా గ్రహించాలి. అవతారంలో ఒకానొక సమయ విశేషంలో కలసినట్లు, ఇంకొక కాలవిశేషంలో విశ్లేషించినట్లు, తిరిగి ఆమెతో కలసినట్లు, విశ్లేషించినట్లు కథాగమనంలో తెలుస్తున్నా, ఈ రెండు తత్త్వాలు పరస్పరం ఒకరిని విడచి ఇంకొకరు ఉండని తత్త్వాలు.

### సీతాదేవి (లక్ష్మీదేవి) యొక్క నిత్యానపాయిత్వం

తిరుమంత్రార్థంలో శ్రీపిళ్ళైలోకాచార్యులవారు **"అవన్ మార్పైవిట్టు ప్పిరియిల్ ఇవ్వక్షరమ్ విట్టు ప్పిరివదు"** (భగవానుని వక్షఃస్థలాన్ని విశ్లేషిస్తే కదా, ఈ అకారాన్ని విడుస్తుంది) అని అనుగ్రహించిన శ్రీసూక్తిని చూడవచ్చు. **"నిత్యానపాయినీ"** అని లక్ష్మీదేవి నిర్దేశింపబడుతున్నది. భగవానుడు దేవేంద్రుని వేడికోలుకు జాలిపడి అంగీకరించి, మహాబలి దగ్గరకు యాచకుడై వెళ్ళినపుడు బ్రహ్మచారిగా వెళ్ళాడు - అనే విషయం ప్రసిద్ధం. భార్య లేనివారికి బ్రహ్మచారి అని పేరు. అటువంటి బ్రహ్మచారి స్థితిలో కూడా శ్రీమహాలక్ష్మి భగవానుని వక్షఃస్థలాన్ని వీడలేదని పురాణం పల్కుతున్నది. **"కృష్ణాజినేన సంవృణ్వన్ శ్రియం వక్షఃస్థలస్థితామ్"** (కృష్ణాజినంతో వక్షఃస్థలంలోని లక్ష్మిని దాచిపెడుతూ) అనేది పురాణవచనం. వక్షస్సులో ప్రకాశించే లక్ష్మీదేవిని వామనబ్రహ్మచారి అయిన భగవానుడు జింకచర్మంతో కప్పుకొంటూ వెళ్ళాడని పల్కింది. దీనిని శ్రీవేదాంత దేశికులుకూడా తిరుక్కోవలూర్ దివ్యదేశంలోని త్రివిక్రమస్వామి విషయంగా అనుగ్రహించిన దేహళీశ స్తుతిలో - **"భిక్షోచితం ప్రకటయన్ ప్రథమాశ్రమత్వం కృష్ణాజినం యవనికాం కృతవాన్ ప్రియాయాః"** (భిక్షకు తగిన మొదటి ఆశ్రమాన్ని - బ్రహ్మచర్యాన్ని - వ్యక్తం చేస్తూ, తనకు ప్రియురాలైన లక్ష్మికి కృష్ణాజినాన్ని ఆవరణంగా చేశాడు) అనే శ్రీసూక్తిద్వారా వ్యక్తం చేశారు.

### కొన్ని విరోధ - పరిహారాలు

ఆ విధంగా అయితే మిథిలకు వెళ్లి సీతావివాహం చేసికొన్నాడెందుకు? పంచవటిలో సీతాదేవిని రావణుడు అపహరించినట్లు, దానివల్ల విశ్లేషం సంభవించినట్లు, అపుడు శ్రీరాముడు రోదించినట్లును చెప్పడం ఎందుకు? ఇదంతా అసత్యమా? అని కొందఱు అడుగవచ్చు. నారదమహర్షి వల్ల ఉపదేశాన్ని పొంది, చతుర్ముఖుని అనుగ్రహాన్ని పొంది వాల్మీకిమహర్షి రచించిన శ్రీరామాయణానికి **"న తే వాగనృతా కావ్యే కాచిదత్ర భవిష్యతి"** (ఈ కావ్యంలో అసత్యమైన మాట ఒక్కటి

కూడా ఉండదు) అనే దేవతానుగ్రహం ప్రసిద్ధమైనది కనుక, శ్రీరామాయణ వృత్తాంతాలలో అసత్యం ఉన్నదని మనస్సులో కూడా భావించరాదు. **"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్"** అని రావణవధకు పిమ్మట దేవతలను ఉద్దేశించి శ్రీరాముడు స్వయంగా పల్కినట్లుగా, తాను పరిగ్రహించిన మానుష భావనకు తగినట్లుగా వర్తించిన రీతి ఇతిహాసపురాణాలలో ఉన్నది. శ్రీమన్నా రాయణుడైన స్థితికి తగిన తత్త్వాలు ప్రత్యేకమైనవి. మనుష్యభావనతో శ్రీరాముడై పుట్టి నటించిన నటనకు తగిన తత్త్వాలు వేఱయినవి. దీనిని పురస్కరించుకొని దానిని కాదనడంగాని, దానిని పురస్కరించుకొని దీనిని కాదనడం గాని తగదు. ఒకటి దివ్యాత్మ స్వరూపానికి చెందినది. ఇంకొకటి దివ్యమంగళవిగ్రహానికి చెందినది - అని భావించినా కొఱత లేదు. వాల్మీకిముని నారదమహర్షిని చూచి అడిగిన ప్రశ్నలలో రెండు కలసి ఉన్నందున, రెండు విధాలైన తత్త్వాలనే నేను అక్కడక్కడ వివరిస్తూ వస్తున్నాను. శ్రీపిళ్ళైలోకాచార్యుల వారు **"ఇవళోడే కూడియే వస్తువినుడైయ ఉణ్మై"** (ఈమెతో కూడియే పరతత్త్వానికి సత్త) అని ఒకవైపు అనుగ్రహించినా, ఇంకొక వైపు **"ఇవళ్ సన్నిధియాలే కాకమ్ తలై పెఱ్ఱదు, అదిల్లామైయాలే రావణన్ ముడిన్దాన్"** (ఈమె సాన్నిధ్యంవల్ల కాకాసురుడు బ్రతికాడు. అది లేనందువల్ల రావణుడు అంతమయ్యాడు.) అని పల్కడం, శ్రీవచన భూషణంలో **"పిరాట్టి ముఱ్పడ ప్పిరిన్దదు..... నడువిల్ పిరిన్దదు. అనన్తరమ్ పిరిన్దదు"** అని అనుగ్రహించడం వంటివి పైపైన చూచినపుడు విరుద్ధంగా తోస్తాయి. కాని, అవి విరుద్ధాలు కావు. ఆలయాలలో భగవానుని అర్చామూర్తిలోనే వక్షఃస్థలలక్ష్మి ప్రకాశిస్తూ ఉన్నా, ప్రత్యేకమైన కోవెల లక్ష్మీదేవికి కూడా ఉంటుంది. భగవానుని ప్రత్యేకంగా సేవించేటట్లు పిరాట్టిని ప్రత్యేకంగా సేవించేటట్లు కొన్ని సమయాలలో ఇద్దరు కలసి వేంచేసి ఉండే సన్నివేశంలో గౌరవించేటట్లు మనం వ్యవహరిస్తున్నాము.

అందువల్ల, **"అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్మేల్మఙ్గై యుఱై మార్పా!"** (ఒక క్షణమైనా విశ్లేషించలేనని పలికే పద్మావతి నిత్యవాసం చేసే వక్షస్సును కలవాడా!) అని ఆళ్వార్లు పల్కిన రీతిలో ఒకరిని ఇంకొకరు విడచి ఉండని స్థితి ఒకటి ఉన్నది కనుక, దానిని మనస్సులో భావించే **"ద్యుతిమాన్ కః?"** అనే ప్రశ్న ఉదయించింది. సూర్యుడు ప్రభను విడచి ఉండని రీతిలో భగవానుడుకూడా నిత్యసిద్ధమైన లక్ష్మీ సంబంధాన్ని కలవాడై ఉంటాడు - అని తెలిపినట్లయినది.



## లక్ష్మీదేవిని కాంతిగా భావించి వివరించడం

ఇక, రత్నమనేది దాని కాంతివల్ల విలువను పొందేటట్లే, భగవానుడు కూడా లక్ష్మీదేవివల్లనే గౌరవాన్ని పొందుతున్నాడు - అనేది ఇక్కడ గమనించదగినది. **"పొల్లాద దేవరై దేవరల్లారై త్తిరువిల్లా త్తేవరై త్తేఱేల్మిన్ తేవు"** (తగని దైవాలను, పరదైవం కాని అలక్ష్మీకులను పరదైవంగా కొలువవద్దు) అనే తిరుమழிశైప్పిరాన్ శ్రీసూక్తితోను, **"వేదాంతా స్తత్త్వచింతా మురభిదురసి యత్పాదచిహ్నై స్తరంతి"** (వేదాంతాలు పరతత్త్వ విచారాన్ని భగవానుని వక్షఃస్థలంలో గల ఏ లక్ష్మీదేవి పాదముద్రలను చూచి విరమిస్తున్నాయి.) **"తవ స్పర్శాదీశం స్పృశతి కమలే! మంగళ పదమ్"** (నీ స్పర్శవల్లనే భగవానునకు మంగళపదం ఏర్పడినది) అనే భట్టర్ శ్రీసూక్తిని పురస్కరించు కొని, **"పూర్ణం తేజః స్ఫురతి భవతీపాదలాక్షారసాంకమ్"** అనే వేదాంతదేశికుల శ్రీసూక్తిని బట్టి దీనిని తెలియవచ్చు. పూర్వం **"ధర్మజ్ఞః కః?"** అనే మూడవ ప్రశ్నను వివరించే టపుడు శ్రీరామాయణ వృత్తాంతాలద్వారానే దీనిని విస్తృతంగా వివరించాను. అక్కడ గమనించవచ్చు.

## కల్యాణగుణాలను ద్యుతిగా భావించి అర్థనిర్వాహం చేయడం

ఈరీతిలో కాంతి స్థానంలో లక్ష్మీదేవిని భావించి ఇంతవరకు వివరించాము. ఇక, కాంతిస్థానంలో కల్యాణగుణాలను భావించి నిర్వహించవచ్చు. దీనిని భట్టర్ శ్రీరంగరాజస్తవంలో **"జ్ఞానైశ్వరీశకనవీర్యబలార్చిష స్తే త్వాం రంగేశ! భాస ఇవ రత్న మనర్ఘయంతి"** (శ్రీరంగనాథా! జ్ఞానం, ఐశ్వర్యం, శక్తి, వీర్యం, బలం, తేజస్సు - అనే ఆఱు గుణాలు నిన్ను, రత్నాన్ని కాంతివలె, గొప్ప విలువను కలిగినవానినిగా చేస్తున్నాయి.) అని పల్కిన సూక్తి ఇక్కడ చాలా పొసగుతుంది. ఈ శ్లోకంలోని భావం ఏమంటే- ''కాంతి అనేది రత్నాన్ని విలువను కల్గినదిగా చేసేటట్లే, రంగనాథా!, నీ కల్యాణగుణాలు నిన్ను విలువను పొందిస్తున్నాయి''- అని. దీనివల్ల భగవానుడు లక్ష్మీదేవివల్ల అతిశయాన్ని పొందేటట్లుగా, కల్యాణగుణాలవల్ల గౌరవాన్ని పొందు తున్నాడనే అర్థం స్ఫురిస్తున్నది. నారదమునిని చూచి వాల్మీకి మహర్షి అడిగిన పదహాఱు ప్రశ్నలు కల్యాణగుణాలకు సంబంధించినవే అయినా, వ్యక్తంగా పల్కిన గుణాలు పోగా, మిగిలిన గుణాలన్నీ **"ద్యుతిమాన్ కః?"** అనే ఈ ప్రశ్నలో అంతర్భవిస్తాయి. పరమపదంలో విలువను పొందలేని కల్యాణ గుణాలు విలువను పొందడంకోసమే ఈలోకంలోకి వచ్చి అవతరించడం - అనేది పరమార్థం కనుక

శ్రీరామాయణంలో గోచరించే వృత్తాంతాలన్నీ కల్యాణగుణాలనే ప్రకాశింపజేయడం కోసం ప్రవృత్తమైనవి కనుక, శ్రీరామాయణానికి కల్యాణ గుణాలే జీవనాడి. సకల కల్యాణగుణాలను కలవాడు ఎవడు? అని దీనివల్ల ప్రశ్నించినట్లయినది. తమిళంలో **"ఇరట్టఱ మొழ్రితల్"** (రెండర్థాలు స్ఫురించేటట్లు పల్కడం) అనే క్రమం ఉన్నదికదా. ఆ రీతిలో నిరంతరమైన లక్ష్మీ సంబంధాన్ని కలవాడెవడు? కల్యాణగుణాలతో వెలిగేవాడెవడు? - అని రెండు ప్రశ్నలు ఒకే ప్రశ్నలో అణగి ఉన్నదని గ్రహించవచ్చు.

## లక్ష్మీదేవి, కల్యాణగుణాలు కలిసియే ద్యుతిశబ్దార్థం

ముముక్షుప్పడి ద్వయప్రకరణంలో - **"పురుషకారబలత్తాలే స్వాతంత్ర్యమ్ తలై శాయ్న్దాల్ తలై ఎడుక్కుమ్ గుణఙ్గళై చ్చొల్లుకిఱదు-నారాయణపదమ్"** (పురుషకారబలం వల్ల స్వాతంత్ర్యం తలవాల్చినపుడు తలఎత్తే గుణాలను నారాయణపదం తెల్పు తున్నది) అని శ్రీపిళ్ళై లోకాచార్యులవారు అనుగ్రహించిన రీతిలో లక్ష్మీసంబంధం మూలంగానే కల్యాణ గుణాలు తల ఎత్తుతాయి (ఉద్బుద్ధాలవుతున్నాయి) కనుక, రెండు ఒక ప్రశ్నలో అమరి ఉండి ప్రకాశించడం సుందరమైనది.

## ప్రాసంగికంగా శ్రీరామగుణానుభవాలు

ఇక ఈ ప్రసంగంలో శ్రీరామగుణవిశేషాలను కొంచెం అనుసంధించుకొనవలసి ఉన్నది. వాల్మీకి మహర్షి, శ్రీరాముడు అవతరించాడనే కథను బాలకాండ పద్దెనిమి దవ సర్గలో వ్రాసి, ఆ సర్గలోనే విశ్వామిత్రముని వచ్చాడనే విషయాన్ని కూడా వ్రాశాడు. ఆ సమయం నుండే శ్రీరాముని వృత్తాంతాలు మనకు తెలుస్తున్నది. శ్రీరాముడు విశ్వామిత్రమునివెంట వెళ్ళేటపుడు అతడు పన్నెండేళ్ళ వయస్సును కలవాడని నిశ్చయింపబడినది. అందువల్ల పన్నెండేళ్ళ వయస్సువరకు శ్రీరాముడు ప్రదర్శించిన కల్యాణగుణాలనుగూర్చి మనకు తెలిసికోవడానికి ప్రమేయం (ఆధారం) ఏమీ లభించడం లేదు. తమ్ముడు లక్ష్మణునిగూర్చి పలికేటపుడు **"బాల్యాత్ ప్రభృతి సుస్నిగ్ధః"** (బాల్యం నుండి చాలాస్నేహాన్ని కలవాడు) అని వాల్మీకిమహర్షి అన్నాడు. బాల్యంనుండే తమ్ముడు శ్రీరాముని పట్ల చాలా ప్రేమను కలవాడని దీని అర్థం. రెండు మూడు ఏళ్ళు గడచిన తరువాతనే బాల్యమని చెప్పబడుతుంది. అయినా, **"బాల్యాత్ ప్రభృతి"** అనే ఈ ప్రయోగాన్ని అర్థాన్ని తెలిపే మన పూర్వాచార్యులు తొట్టిలో పరుండి ఉండే వయస్సునుండి - అని వివరించారు. (అంటే - శైశవ ప్రాయాన్నే బాల్యంగా గ్రహించారని భావం) తొట్టిలో పరుండే పరువంనుండే



లక్ష్మణుడు శ్రీరామునిపట్ల చాలా ప్రేమను కల్గి ఉన్నాడనేది ఏవిధంగా తెలిసింది? అంటే చక్రవర్తికి నల్గురు కుమారులు పుట్టగానే, తొట్టెలో పెట్టే దినంలో ప్రత్యేకంగా నాల్గు ఊయెలలను పెట్టి, శిశువులను అవతారక్రమంలో మొదట శ్రీరాముని పరుండబెట్టి, రెండవ తొట్టిలో భరతుని పరుండబెట్టి, మూడవ తొట్టిలో లక్ష్మణుని శయనింపజేసి, ఆ తొట్టెలను వరుసగా నిలిపారు. అపుడు లక్ష్మణుని తొట్టి శ్రీరాముని తొట్టికి ప్రక్కనే లేనందువల్ల కొంచెం దూరంలో ఉండడం తటస్థించింది. దానిని సహించలేక లక్ష్మణుడు విలవిలలాడి ఆక్రందించాడు. ఆవిధంగా అతడు ఏడ్చే కారణాన్నిగూర్చి తెలియలేని తల్లులు మొదలైనవారు "తేలు కుట్టిందా? పాము కఱచి ఉంటుందా?" అని భయపడి, తొట్టిలో వెదికారు. అక్కడ చిన్న చీమ కూడా కన్పించలేనందున, ఎంతగానో లక్ష్మణుని సముదాయించారు. అయినా, లక్ష్మణుడు ఏడుపు మాననందున వశిష్ఠభగవానుని వద్దకుపోయి, "స్వామీ! లక్ష్మణుడు చాలా ఎక్కువగా నిలువకుండా ఏడుస్తున్నాడు. ఏమి కారణం? చూచి చెప్పండి" అని అన్నారు. వశిష్ఠ మహర్షి వచ్చి చూచి, "లక్ష్మణుని ఊయెల శ్రీరాముని ఊయెలకు తరువాత లేకుండా, దూరంలో ఉండడమే దీనికి కారణమై ఉంటుంది" - అని భావించి, "శ్రీరాముని ఊయెలకు తరువాత ప్రక్కనే లక్ష్మణుని ఊయెలను పెట్టండి" అని పల్కి వెళ్ళిపోయాడు. ఆ విధంగానే లక్ష్మణుని ఊయెలను శ్రీరాముని ఊయెలకు ప్రక్కనే పెట్టగా లక్ష్మణుని ఏడుపు కొంచెం తగ్గింది. అయినా పూర్తిగా తగ్గలేదు. అందువల్ల మళ్ళీ వశిష్ఠమహర్షి దగ్గరకు వెళ్ళి - "స్వామీ! మీరు చెప్పినట్లే చేశాము. లక్ష్మణుని ఏడ్పు ఏదో కొంచెం తగ్గింది తప్ప, పూర్తిగా తగ్గలేదు"అని అన్నారు. "అయితే, లక్ష్మణునకు ప్రత్యేకమైన ఊయల వద్దు. శ్రీరాముని ఊయెల లోనే అతని ప్రక్కనే పరుండబెట్టండి" అని ముని పలికాడు. ఆవిధంగానే చేయగా లక్ష్మణుని రోదనం తగ్గి పోవడమేకాక, నవ్వడం ఆరంభించాడు. ఈ విషయాన్నే **"బాల్యాత్ ప్రభృతి సుస్నిగ్ధః"** అని అనడం ద్వారా వాల్మీకి మహర్షి సూచించాడని పెద్దలంటారు. ఈ విధంగా శిశువులకు కూడా అభినివేశాన్ని పొందించే అందం, గుణాలు బాల్యంలోనే కల్గినవాడు, శ్రీరాముడు-అనే విషయం దీనివల్ల తెలుస్తున్నది.

## విశ్వామిత్రుని రాకలో ముఖ్యమైన కారణం

ఇక, తరువాత వృత్తాంతాన్నిగూర్చి పల్కుతాము. విశ్వామిత్రమహర్షి సామాన్యుడు కాడు. చాలా అరుదైన తపస్సులను అవలీలగా చేసినవాడు. అటువంటి

వాడు తాను చేయగోరిన ఒక చిన్న యాగానికి శ్రీరాముని సహాయంగా కోరి వచ్చాడనేది, దశరథచక్రవర్తి తాను చతురంగ బలసమేతుడై వచ్చి రక్షిస్తానని పల్కినప్పటికీ, ‘‘నీవు రానక్కరలేదు, నీ పుత్రునిమాత్రమే పంపించాలి’’ అని నిర్బంధంగా శ్రీరాముని తీసికొనిపోయాడనేది గమనించదగిన విషయాలు. విశ్వామిత్రునకు తన యాగం ఏ లోటు లేకుండా పూర్తికావడమే కదా ముఖ్యం. దశరథ చక్రవర్తియే సాక్షాత్తుగా వచ్చి నెఱవేరుస్తానని పల్కినపుడు దానిని ఈ ముని కాదన వలసిన కారణమేమి? అని పరీశీలించినపుడు, శ్రీరాముడు విశ్వామిత్రమహర్షి వెంట వెళ్ళే నెపంతో తన కొన్ని కల్యాణగుణాలను వ్యక్తం చేయాలని భావించి, అందు కోసమే ఆ మునిని వచ్చేటట్లు చేసి, తననే పంపించేటట్లుగా నిర్బంధంగా అడిగేటట్లు చేశాడు. ఆవిధంగానే ఆ మునితో వెళ్ళేటపుడు వ్యక్తం చేసిన కల్యాణగుణాలలో ఒకటి రెండు గుణాలను ఇక్కడ వివరిస్తాము.

## విశ్వామిత్రుడు ప్రబోధించడంలోని విశేషం

శ్రీరాముడు, లక్ష్మణుడు చిన్న వయస్సులోనివారు కనుక, సాయంకాలం కాగానే నిద్రించారు. ఉదయకాలంలో ముని ఆ బాలురను ప్రబోధించడంకోసం సుప్రభాతాన్ని పలుకవలసి వచ్చింది. అపుడు ఇద్దరిని నిద్ర లేపవలసి ఉన్నా, శ్రీరాముని ఒక్కని మాత్రమే నిద్రలేపినట్లు శ్లోకం తెల్పుతున్నది. **“కౌసల్యాసుప్రజా రామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే, ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్”** (కౌసల్యాదేవి సత్‌పుత్రుడవైన శ్రీరామా! ఉదయసంధ్యాకాలమైనది. నిద్ర లే. ఓ నరశార్దూల! ఉదయకాలంలోని కర్తవ్యాలను నిర్వహించాలి) అనేది ఆ శ్లోకం. **“మన్నుపుకఝ్ కౌశలైతన్ మణివయిఱు వాయ్‌త్త”** (స్థిరమైన కీర్తిని కల కౌసల్యయొక్క అమూల్యమైన గర్భాన్ని పండించిన) శ్రీరామా! సంధ్యా వందన మొదలైన నిత్యకర్మలను చేయాలి కదా! నిద్ర లే అని పల్కి ప్రబోధించేటట్లుగా ఈ శ్లోకం అమరి ఉన్నది. సకలకర్మలచేత (అంటే-నిత్య, నైమిత్తిక - కామ్యాలనే అన్ని కర్మలతోను) ఆరాధ్యుడైన శ్రీమన్నా రాయణమూర్తియే శ్రీరామునిగా వచ్చి అవతరించాడనేదానిని తెలియనివాడు కాడు, ఈ విశ్వామిత్ర ముని బాగా తెలిసినవాడే. లోకంలోనివారు ఇతనిని ఉద్దేశించి కర్మలను చేయాలి తప్ప, ఇతడు ఏ కర్మను చేవలసిన పనిలేదు - అనే విషయాన్ని బాగా తెలిసినవాడైనా, **“కర్తవ్యం దైవమాహ్నికమ్..... ఉత్తిష్ఠ”** అణి పల్కి నిద్రలేపి నందున ఏమి తెలుస్తున్నది? భగవద్గీతలో **“న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన, నానవాప్త మవాప్తవ్యం**



**వర్త ఏవ చ కర్మణి”** (3-22) (అర్జునా! ఈ ముల్లోకాలలో నేను చేయవలసిన కర్మలేమీ లేవు. పొందవలసినది కూడా లేదు. అయినా, నేను కర్మలను చేస్తూనే ఉంటాను) అని శ్రీకృష్ణ భగవానుడు - ‘‘నేను నిత్యకర్మలను వేనిని చేయనక్కరలేక పోయినా, దానిని తప్పకుండా చేస్తూనే ఉంటాను’’ అని పల్కినది కేవలం మాటమాత్రం కాదు, వాస్తవంగా అనుష్ఠించేదే - అని తన ఆచరణతో చూపించిన విషయాన్ని తెల్పుతున్నది. సీతాదేవిని విశ్లేషించి బాధపడుతూ ఉన్నప్పటికీ సరస్సుల వద్దకు పోయి సంధ్యావందనాదులను లోటు లేకుండా చేశాడని అక్కడక్కడ వాల్మీకి మహర్షి సూచించారు. ఒక సందర్భాన్ని గమనించండి. యుద్ధకాండలో (5-22) సూర్యుడు అస్తమించాడని, అపుడు శ్రీరాముడు సీతాదేవిని భావించి చాలా మిక్కిలి బాధపడుతూ ఉన్నాడని పల్కి, తరువాత శ్లోకంలో **“ఆశ్వాసితో లక్ష్మణేన రామ స్సంధ్యా ముపాసత”** (లక్ష్మణునిచే ఓదార్చబడినవాడై శ్రీరాముడు సంధ్యావందనాన్ని ఆచరించాడు) అని చెప్పబడింది. శాస్త్రోక్త కర్మలలో శ్రద్ధను కల్గి ఉండడమనే గుణం ఇది.

## “కింకరౌ సముపస్థితౌ” అని పల్కిన మహాగుణం

ఇంకొక విషయాన్ని గమనించండి. విశ్వామిత్రమునివరుని ఉద్దేశించి శ్రీరాముడు పల్కుతున్నాడు **“ఇమౌ స్మ మునిశార్దూల! కింకరౌ సముపస్థితౌ, ఆజ్ఞాపయ యథేష్టం వై శాసనం కరవామ కిమ్”** అని దీని భావమేమంటే - ‘‘నేను, నా తమ్ముడు నీవు ఆజ్ఞాపించే సేవలను అన్నిటిని వినయంతో చేయడంకోసమే వచ్చాము. కొంచెం కూడా సంకోచించకుండా మాకు నీ ఆజ్ఞను ఇవ్వాలి. దేనిని కావాలని భావించినా దానిని చేయడానికి సిద్ధంగా ఉన్నాము’’-అని. శ్రీరాముడు మహావిష్ణువు అనే స్థితిని మఱుగుపఱచి నప్పటికీ చక్రవర్తి కుమారుడనే స్థితికి లోటులేదు కదా! ఆవిధంగా మహారాజపుత్రుడై నీచసేవలను చేయడంకోసమే మీవద్దకు వచ్చాము - అని చేతులను జోడించి పలికే మహాగుణాన్నిగూర్చి ఏమని పలకాలి!

## గుహునిపట్ల చూపిన మహాగుణం

ఇక, అయోధ్యాకాండలో గమనిద్దాం. **“కూరణీన్ద వేల్‌వలవన్ కుకనోడు కణ్ణై తన్నిల్ శీరణీన్ద తోఝమై కొణ్డదుమ్ ఓరడైయాళమ్”** (నిశితమైన బల్లెం ఆయుధంగా కల గుహునితో గంగాతీరంలో గొప్పస్నేహాన్ని చేయడం ఒక చిహ్నం) అని హనుమానుని మాటగా పెరియాఝ్వార్లు పలికే రీతిలో గుహుడనే ఒక బోయవానితో

స్నేహాన్ని చేసిన గుణం ఏమి! దీనినిగూర్చి తిరుమఙ్గైయాళ్వార్ పలికేటపుడు **"ఏళై ఏదలన్ కీళ్మకన్ ఎన్నాదు ఇరఙ్గి మత్తవఱ్కిన్నరుళ్ శురన్దు, మాళైమాన్ మడనోక్కి ఉన్ తోళి ఉమ్బి పెమ్బి ఎన్ఱొళిన్దిలై ఉకన్ద తోళన్ నీ ఎనక్కిఙ్గొళి ఎన్ఱ శొఱ్కళ్ వైత్తు అడియేన్ మనత్తిరున్దిడ"** అని మనస్సులో ఆనందించి పలికారు.

క్షత్రియజాతిలో, సూర్యవంశంలో ఇక్ష్వాకుకులంలో అవతరించినవాడు, చక్రవర్తి కుమారుడు, సకలైశ్వర్యసంపన్నుడు, మహాబుద్ధిమంతుడు, శత్రువులపట్ల కూడా ప్రేమను కలిగినవాడైన శ్రీరాముడు గుహుని చూచినపుడు, అతని నీచమైన బోయజాతికి చెందినవాడని, అందువల్ల వివేకజ్ఞానంలేని అవివేకి - అని, ఆ జాతికి సహజమైన క్రూరత్వంచేత అన్నిప్రాణులతో పగను కల్గి ఉండేవాడని నిందించవలసి ఉన్నా, ఈ విధంగా నిందించకుండా, తన గొప్పతనాన్ని గుణాలను చూడకుండా, ఇతనితో కలసి వర్తించిన శీలగుణాన్ని ఉద్దేశించి వాక్కులతో వర్ణించగలమా? ''ఓ గుహా! నాపత్ని అయిన ఈ సీత నీకు స్నేహితురాలు. నా తమ్ముడైన లక్ష్మణుడు నీకు తమ్ముడే. నీవు నా ప్రాణసఖుడవు'' అని, ''ఇంతవరకు మేము తోడబుట్టిన వారం నల్గురం. ఇపుడు నీతో అయిదుగురం - అయినాము'' అని సౌహార్దంతో పలికిన మాటలు మనస్సును ద్రవింపజేస్తాయి కదా.

### దండకారణ్యమునుల పట్ల చూపిన మహాగుణం

ఇక, ఆరణ్యకాండలో గమనిద్దాం. శ్రీరాముని దర్శించాలని మునులు పలువురు కలిసి, శ్రీరాముని పర్ణశాలకు వచ్చి చేరినపుడు, శ్రీరాముడు వారికి నమస్కరించి, చేతులను జోడించి నిలచి **"ప్రసీదంతు భవంతో మే హ్రీ రేషా హి మమాతులా, యదీదృశై రహం విప్రై రుపస్థేయై రుపస్థితః"** అని అన్నాడు. ''మునులారా! దాసుడనైన నన్ను మీరు చాలా మన్నించాలి. మీ నివాసాలవద్దకు నేనే వచ్చి మీ యోగక్షేమాలను విచారించవలసి ఉండగా, నేనున్న చోటును వెదకి మీరు వచ్చే రీతిలో, అయ్యో, నేను అపచారం చేశానే!'' - అని దీని భావం. ఈ వినయం, మధుర భాషణం వేఱెవ్వరికి అనుకరించడానికి కూడా సాధ్యం కానివి కదా!

### సుగ్రీవునిపట్ల చూపిన మహాగణం

ఇక, కిష్కింధాకాండలో గమనిద్దాం. **"లోకనాథః పురా భూత్వా సుగ్రీవం నాథమిచ్ఛతి"** అని,**"సుగ్రీవం శరణం గతః"** అని పలికే రీతిలో ఒక వానరం కాళ్ళకు నమస్కరించిన (శరణాగతి చేసిన) ఒక మహాగుణం చూపబడింది. రావణుని



వధించడానికి సుగ్రీవుని సహాయంగా చేసికొన్నట్లు, దానికోసమే అతనిని శరణు పొందినట్లు లోకం భావించేటట్లుగా కథ ఉన్నది. వాలి వద్ద వాచామగోచరమైన పరాభవాన్ని పొందిన రావణుని వధించడానికి, ఆ వాలిని అవలీలగా వధించే సామర్థ్యాన్ని కల్గిన శ్రీరాముడు సుగ్రీవుని సహాయంగా చేసికొన్నాడు - అనేది తగని మాట. **"ఇళైయవర్కట్కు అరుళుడైయాయ్! ఇరాకవనే!"** (చిన్నవారిపట్ల దయ గలవాడా? రాఘవా!) అని కులశేఖరాళ్వార్లు పల్కినట్లుగా తన దీనదయాళుత్వాన్ని ప్రకాశింపజేయడంకోసమే శ్రీరాముడు సుగ్రీవుని అన్వేషించి వచ్చాడనేది తత్త్వం. ఆవిధంగా అతనిని అనుగ్రహించడంకోసం వెళ్ళినపుడు తన గొప్పతనాన్ని చూడకుండా, **"సుగ్రీవం శరణం గతః"** అని అనేటట్లుగా సౌలభ్యాన్ని ప్రదర్శించడం గుణాలలో ఉత్తమమైనది కదా! ఈవిధంగా ఇటువంటి పలుపలు కల్యాణగుణాలతో గొప్పతనాన్ని పొందినవాడు - అనేదే **"ద్యుతిమాన్"** అనేదానికి అంతరార్థం.

## 15. కః అనసూయకః? (అసూయ లేనివాడెవడు?)

శ్రీరామాయణంలోని వాల్మీకి నారదసంవాదంలో **"కః అనసూయకః?"** అనే పదిహేనవ ప్రశ్న ఇక వివరింపబడుతున్నది. ''అసూయ లేనివాడెవడు'' అనేది ఈ ప్రశ్నయొక్క అర్థం. గుణాలను కూడా దోషాలుగా గ్రహించే దుర్గుణం అసూయ అనబడుతుంది. దానిని లేనివాడు శ్రీరాముడు - అని దీనివల్ల స్ఫుటపడుతుంది.

### అసూయాప్రభావం

లోకంలో మానవుల స్వభావాలు ఒక్కొక్కరిలోను ఒక్కొక్క విధంగా ఉంటాయి. గుణాలను గుణాలుగానే గ్రహించం కొందఱి స్వభావం. గుణాలను కూడా దోషాలుగా గ్రహించడం మఱి కొందఱి స్వభావం. దోషాలనుకూడా గుణంగా గ్రహించడం చాలా గొప్ప గుణవంతుల స్వభావం. దోషాలను దోషాలుగా, గుణాలను గుణాలుగా గ్రహించడంకూడ గొప్ప గుణమని చెప్పవచ్చు. ఎందుకు? అంటే, గుణాలను దోషాలు గానే గ్రహించే స్వభావం కలవారు నిండిన ఈ లోకంలో, ఉన్నది ఉన్నట్లుగా గ్రహించే వారుంటే అది ఆశ్చర్యపడవలసినదే కాగలదు. అటువంటి వారు **"మనుష్యాణాం సహస్రేషు కశ్చిత్"** (పలువేలమంది మానవులలో ఎవడో ఒకడు) అని గీతలో పల్కినట్లుగా పలు వేలమందిలో ఎవరో ఒక్కరు మాత్రమే ఉంటారు. గుణాలను దోషాలుగా గ్రహించడమే అసూయ కనుక, ఆ దుర్గుణాన్ని జయించినవారు లోకలో ప్రయత్నించి అన్వేషించి చూడవలసిన స్థితిలో ఉంచారు. లోకంలో సకలవిధమైన

వ్యక్తులకు మందు ఉన్నది. అసూయ అనే వ్యాధికి మాత్రం మందులేదు. సంకల్పసూర్యోదయంలో వేదాంతదేశికులు అద్భుతంగా రెండు శ్లోకాలను రచించారు. అవి **1. "మయి దత్తావధానాయామ్", 2. "నిరవధిగుణగ్రామే"** అనేవి. వీటిలో మొదటి శ్లోకంలోని భావం ఏమంటే - అసూయా దేవి అలసటతో సోమరితనంతో నిద్రపోతేనే భగవానుడు గుణశాలి అనే పేరును పొందడం సాధ్యం. ఆ అసూయాదేవి నిద్రపోని సమయంలో భగవానునిచే కూడా దోషరహితుడనే పేరును పొందడం సాధ్యం కాదు" - అని. రెండవ శ్లోక భావం ఏమంటే - దోషమనేది ఏ కొంచెం కూడా లేనివాడు, అంతులేని కల్యాణగుణాలకు సముద్రంవంటివాడైన శ్రీరాముని విషయంలో కూడా కొంతమంది పాపిష్ఠివారు దోషాలను పల్కుతున్నారు కదా! ఏవిధమైన దోషాలను పల్కుతున్నారు? అని అంటే, మొట్టమొదటగా తాటక వధ అనే స్త్రీవధను చేశాడని, ఏ దోషం లేని వాలిని చెట్టుచాటున ఉండి వధించాడని, ఖరవధ సమయంలో వెనుకంజ వేశాడని - ఈవిధమైన దోషాలను పల్కు తున్నారు. గుణసముద్రుడైన శ్రీరాముని విషయంలోనే ఈవిధంగా పలికేటపుడు, చాలా పరిమిత మైన గుణాలను కలవారమై, దోషమే మూర్తీభవించినట్లుగా ఉండేవారమైన మనవంటివారిపట్ల లోపం దోషాలను పల్కడం ఆశ్చర్యమా! అని భావం.

ఈవిధంగా గుణాలను దోషాలుగా భావించడం, ఆ విధంగా ఇతరులను ఉద్దేశించి పల్కడం అనే స్వభావానికి అసూయ అని పేరు, దీనికి వ్యతిరేకమైన గుణానికి వాత్సల్యమని పేరు. **"కః వత్సలః?"** అనే ప్రశ్నయొక్క స్థానంలోనే ఇక్కడ **"కః అనసూయః?"** అనే ప్రశ్న చేయబడింది. అసూయ లేకపోవడమనేది మాత్రం ఉన్నత గుణం కాబోదు, కనుక, దోషాలను గుణాలుగా గ్రహించడంతో నిలువ కుండా, గుణలుగా గ్రహించడమనే వాత్సల్యాన్ని కలవాడెవడు! - అని ప్రశ్నించడమే ప్రకృత విషయం.

## దోషాలను గుణాలుగా గ్రహించడంలోని గొప్పతనం

ప్రేమాతిశయంవల్ల దోషాలను చూడకుండా ఉండడం అనేది ఉన్నదిగాని, దోషాలను గుణాలుగా గ్రహించడం ఉన్నదా? మన గారాబు పట్టి తప్పులు చేస్తే, వానిని చూచి కోపించి దండించడం కొన్ని సమయాలలో జరుగుతుంది. కొన్ని సమయాలలో దోషాలను చూడకుండా (దండించకుండా) వదలిపెట్టడం కూడా జరుగుతుంది. ఇంతమాత్రమే తప్ప దోషాలను గుణాలుగా భావించడం అనేది



ఉన్నదా? అని కొందఱు సందేహపడతారు. వారిని తేటపరచడానికి ఒక చిన్న విషయాన్ని పల్కుతున్నాము. తండ్రి బయటకు వెళ్ళిన సమయంలో కొడుకు పలు అల్లరి పనులను చేస్తాడు. తండ్రి ఇంటికి రాగానే సాక్ష్యాన్ని చెప్పేవారు - ఆ అల్లరి పనులనుగూర్చి పల్కినపుడు, తండ్రి కొడుకును స్తంభానికి కట్టి, దండించవచ్చు. లేక, పోతే పోనీ - అని తలచి ఉపేక్షించి వదలిపెట్టవచ్చు. చేసిన తప్పుకు సమీపించి, ఎత్తుకొని ఆలింగనం చేసికొని, ముద్దు పెట్టుకొని, శిరస్సును మూర్కొని, మనస్సులో ఆనందించిన వైనాన్ని ప్రదర్శించవచ్చు కూడా. శ్రీకృష్ణుడు మిద్దెలపైకి వెళ్ళి, గోపికలను చేరి, వారి కంచుకాలను చించి, **"మచ్చొడు మాళిక్తై ఏఱి మాతర్‌కళ్ తమ్మిడమ్ పుక్కు క్కచ్చొడు పట్టై క్కిఴిత్తు క్కామ్బు తుకిలవై క్కీఱి త్తీమైకళ్"** (అంతస్థులు కల భవనాలను ఎక్కి అక్కడ ఉండే కన్యల వద్దకు పోయి వారి కంచుకాలను చించి, వస్త్రాలను చించి తుంటరిపనులను చేసే) అనే రీతిలో పలు తుంటరి పనులను చేసినవానిని ప్రస్తావించి, మొఱపెట్టినపుడు యశోదాదేవి చాలా కోపించినదై ఒక పొడుగైన దారంతో, కట్టి దండించింది. ఇంకొకసారి **"నానుమ్ ఉరైత్తిలేన్ నన్దన్ పణిత్తిలన్ నఙ్గైకాళ్! నాన్ ఎన్ శెయ్‌వేన్?"** (ఓ కాంతలారా! నేను మందలించలేను. నందుడు కూడా మందలించడు.) అని అన్నది. మఱొకసారి **"అఙ్జ ఉరైప్పాళ్ అశోదై ఆణాద విట్టిట్టిరుక్కుమ్"** (యశోద శ్రీకృష్ణుని భయపెట్టదు. అతనిని ఊరికే విడచిపెడుతున్నది.) అనే రీతిలో **"ఎన్‌కుట్టనే! ముత్తమ్ తా"** (నా కుర్రవాడా! ముద్దు ఇయ్యి.) అని అన్నది. దోషాలను గుణాలుగా గ్రహించే దశ ఇదే సుమా! ఇటువంటి స్థితి భగవానునకు చేతనులలో కొందఱిపట్ల కొన్ని కొన్ని సమయాలలో కలుగవచ్చు. **"తన్నడియార్‌తిఱత్తకత్తు త్తామరైయాళాకిలుమ్ శిదకురైక్కుమేల్, ఎన్నడియార్ అదు శెయ్యార్, శెయ్‌దారేల్ నన్ఱు శెయ్‌దార్ ఎన్బర్‌పోలుమ్"** (తన భక్తుల విషయంలో లక్ష్మీదేవి దోషాలను పల్కినా, నా భక్తులు తప్పులు చేయరు, చేస్తే మంచినే చేస్తారు- అని భగవానుడు అంటాడు) అనే పెరియాఴ్వార్ల పాశురంలోని మధురమైన అర్థాన్ని వివరించగల్గినవారివద్ద దీని వివరం అడిగి తెలిసికోవాలి.

## విభీషణాఴ్వాన్ పట్ల చూపిన వాత్సల్యం

శ్రీరామాయణంలో శ్రీరాముడు మహాగుణాన్ని ప్రదర్శించిన సందర్భాలలో ఒక ముఖ్యమైన సందర్భాన్నిగూర్చి వినండి. విభీషణుడు **"సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే, నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్"** (సర్వలోక

శరణ్యుడు, మహాత్ముడైన శ్రీరామునితో విభీషణుడు శరణార్థియై వచ్చాడని వేగంగా చెప్పండి) అని అంటూ పెద్దగా ఎలుగెత్తి ప్రార్థించి, శరణు పొందినపుడు రెండు పక్షాలు ఏర్పడ్డాయి. "ఇతడు దుష్టుడు కనుక అంగీకరించదగినవాడు కాదు" - అని సుగ్రీవుడు మొదలైనవారు అన్నారు. "ఇతడు దుష్టుడు కాదు కనుక (యోగ్యుడు అయినందున) అంగీకరించ దగినవాడు" - అని హనుమానుడు అన్నాడు. ఇవి రెండు అందఱికి తెలిసినవే. శ్రీరాముడు సుగ్రీవపక్షాన్ని ఖండించి, హనుమానుని పక్షాన్ని ఆదరించాడని అందఱు భావిస్తారు. ఆ రీతిలో కాకుండా, శ్రీరాముడు సుగ్రీవపక్షాన్నివలె హనుమానుని పక్షాన్నికూడా ఖండించి, మూడవది అయిన ఒక విలక్షణమైన పక్షాన్ని వ్యక్తం చేశాడని అభయప్రదానసారంలో వేదాంతదేశికులు అద్భుతంగా అనుగ్రహించారు. ఆ మూడవ పక్షం ఏమయి ఉంటుంది? అని విజ్ఞులు తమ తమ మనస్సులలో కొంచెం ఆలోచించి చూడాలి. ఎంతగా విచారించినా, అది మనవంటి వారి మేధకు అందదు. "విభీషణుని పరిగ్రహించి తీరాలి" - అని హనుమానుడన్నాడు. చివరకు శ్రీరాముడతనిని (విభీషణుని) పరిగ్రహించాడు. అందువల్ల సుగ్రీవపక్షాన్ని కాదని, మారుతిపక్షాన్ని ఆదరించాడు - అని ఏతావన్మాత్రమే మనవంటివారిచే గ్రహించడానికి సాధ్యం. సుగ్రీవాదులు పల్కిన పక్షాన్ని పూర్తిగా ఆమోదించాడా? హనుమానుడు పల్కిన పక్షాన్ని పూర్తిగా ఆదరించాడా? - అని గమనించాలి. పరిశీలించి చూస్తే, రెండిటిని పూర్తిగా ఆదరించలేదు- అని తెలుస్తుంది. సుగ్రీవుని వాదంలో "విభీషణుడు దుష్టుడైనందున గ్రహించదగని వాడు"అని ఉన్నది. ఇందులోని "గ్రహించదగని వాడు" అనేదానిని మాత్రం శ్రీరాముడు ఖండించాడు తప్ప, "దుష్టుడైనందున" అనే హేతువును ఖండించలేదు. మారుతి పక్షంలో "విభీషణుడు యోగ్యుడైనందున పరిగ్రహించదగినవాడు" అని ఉన్నది. ఇందులో "పరిగ్రహించదగినవాడు" అనేదానిని మాత్రం శ్రీరాముడు ఆదరించాడు తప్ప, "యోగ్యుడైనందున" అనే హేతువును ఆదరించలేదు. అందువల్ల రెండు వాదాలలోను ఆదరించిన అంశం ఉన్నది; తిరస్కరించిన అంశం కూడా ఉన్నది - అని తెలుస్తున్నది. ఇక, శ్రీరాముని మూడవ పక్షంగా ఆవిర్భవించినదేది? అంటే, "విభీషణుడు దోషాన్ని కలవాడు కనుక, పరిగ్రహించదగినవాడు" అనేదే. ఇది అంశతః సుగ్రీవపక్షంలోను ఉన్నది, హనుమానుని పక్షంలోను ఉన్నది - అనే విషయాన్ని ప్రత్యేకించి చెప్పాలా!



## శ్రీవేదాంతదేశికుల శ్రీసూక్తి వివరణం

లోకంలో ఆశ్చర్యకరంగా శ్రీరామాయణ ప్రవచనాన్ని చేసే వారనేకులున్నారు. అయితే ఇటువంటి రస్యమైన, రహస్యమైన అర్థవిశేషం వేదాంతదేశికుల వాక్కు నుండి ఆవిర్భవించినా, దీనిని ప్రస్తావించి వివరించేవారు, చాలా కొద్దిమందే. ఈవిధంగా అర్థం చెప్పేటట్లు శ్రీరామాయణం మూలంలో ఏమి ఉన్నది? అని అంటే, **"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన"** అని, **"దోషో యద్యపి తస్య స్యాత్ సతా మేతదగర్హితమ్"** అని ఉన్నది. వీటిని కొంచెం వివరిస్తాము. **"మిత్రభావేన"** అనేచోట మిత్రశబ్దం భక్తుడనే అర్థాన్ని కల్గినది. స్నేహితుడనే అర్థాన్ని గ్రహించినా దోషం లేదు. విభీషణుడు యథార్థంగా మిత్రునిగా వచ్చినవాడు కాక, మిత్రుని వేషాన్ని ఆరోపించుకొని వచ్చినవాడే కానీ. అటువంటివానినికూడా నేను వదలి పెట్టను- అని శ్రీరాముడు అంటున్నాడు. ఇక, **"దోషో యద్యపి తస్య స్యాత్"** అనేది ప్రాణభూతమైనది. ఇందులో, **"యద్యపి"** అనేది వాక్యాలంకారంగా భావించి వదలిపెట్టి, **"దోషః తస్య స్యాత్"** నేను పరిగ్రహించేటపుడు అతనికి దోషం తప్పక ఉండాలి. అంటే - అతడు దుష్టుడుగానే ఉండాలని భావం. (ఈవిధంగా శ్రీవేదాంత దేశికులు అర్థాన్ని తెలిపారు). శ్రీరాముడు గుణాలు నిండినవానినే పరిగ్రహించాలి అనే వ్రతాన్ని స్వీకరిస్తే, అధికారి ఒక్కడు కూడా దొరకడు-అనేదే కాకుండా, శ్రీరాముని కరుణకు గొప్పతనం లేకుండాపోతుంది. శరణాగతుని గణాలకు అనుగ్రహించినట్లు కాగలదే తప్ప, తమ కరుణతో కార్యాన్ని చేసినట్లు కాబోదు కదా! ఈ అర్థాన్ని కూరేశులు శ్రీవైకుంఠస్తవంలో **"త్వత్పాదసంశ్రయణహేతుషు సాధికారాన్ ఉద్యుఞ్జత శ్చరిత కృత్స్నవిధీంశ్చ తాంస్తాన్, త్వం రక్షసీతి మహిమా న తవాల మేషః"** (నీ పాదాలను ఆశ్రయించడంలో హేతువులైన కర్మాదియోగాలలో ప్రయత్నించినవారై, యోగ్యతను పొందినవారు, సమస్త నిధులను నిర్వర్తించిన ఆయా అధికారులను నీవు రక్షిస్తున్నావు - అనే మహిమ నీకు చాలదు. అకించనులను రక్షించి నపుడే నీ మహిమకు గొప్పతనం) అనే శ్లోకంలో స్పష్టంగా పలికారు. దోషాలను, లోపాలనే కారణంగా గ్రహించి శరణాగతు లను పరిగ్రహిస్తాడు - అనేదే శ్రీరాముని గొప్పతనం.

## వాత్సల్యగుణంలో కలిగే శంకా పరిహారాలు

ఈవిధంగా గ్రహిస్తే, దాసులమైన మనం దోషాలను మనఃపూర్వకంగానే చేయవలసి ఉన్నదనే అర్థం స్ఫురించదా! - అని రీతిలో పలు సందేహాలను కొందఱు

పల్కుతారు. మనం శాస్త్రవిధిని అనుసరించి వర్తించవలసినవారం - అనేది అవిచాల్యంగా స్ఫుటపడుతున్నందున మనం బుద్ధిపూర్వకంగానే దోషాలను చేయవలసి వస్తుందని అనడం తప్పు. అగ్ని ఇంటిని దహిస్తుందని ఒకడు అగ్ని గొప్పతనాన్ని చెప్పినంతలో మనం మన ఇల్లు అగ్నిలో దహింపబడినదిగా తలచి బాధపడతామా! శ్రీరాముని **"క్షమయా పృథివీసమః"** (ఓర్పులో భూమివంటివాడు) అని అంటూ చాలా గొప్ప సహనాన్ని కలవాడని చెప్పబడింది."మనం ఎన్ని దోషాలు చేసినా శ్రీరాముడు సహించి కరుణిస్తాడు" అనే నమ్మికతో అందఱు బుద్ధి పూర్వకంగా దోషాలనే చేయాలని నిశ్చయించుకొంటారు - అనే కారణంచేత శ్రీరాముడు సహనాన్ని లేనివాడని అనడం సాధ్యమా! శ్రీరాముని కల్యాణ గుణాలలో ఏ గుణం ఏ సమయంలో ఏ అధికారిపై ఏవిధంగా ప్రవహిస్తుంది - అనేదానిని మనం చూడగలమా! సుగ్రీవ మహారాజుతో అగ్నిసాక్షికంగా గొప్ప స్నేహాన్ని చేసి **"ఇళైయవర్‌కట్కు అరుళుడైయాయ్!"** (చిన్నవారిపట్ల దయగలవాడా!) అని ప్రశంసింపబడే శ్రీరాముడు, ఆ సుగ్రీవుడు, తాను చెప్పిన కాలంలో సేనను సమీకరించుకొని వచ్చి చేరలేదు - అని కోపించి, **"న చ సంకుచితః పంథా యేన వాలీ హతో గతః... హనిష్యామి సబాంధవమ్"** (నా బాణానికి లక్ష్యమై హతుడైన కాలిపోయిన మార్గం ఇంకా మూసుకు పోలేదు. అదేదారిలో సుగ్రీవుని అతని చుట్టాలతో పాటు పంపిస్తాను) అని పల్కిన శ్రీరాముడు ఎల్లప్పుడు సహన సముద్రుడని, ఎల్లప్పుడు దోషాలను గుణాలుగా గ్రహించేవాడని భావించడానికి వీలుకాని వాడుగా ఉన్నందున, దోషాలను, తప్పులను చేయడంలో భయపడ వలసి ఉండడం జీవుల కర్తవ్యం. అతనిలో ప్రకాశించే కల్యాణ గుణాలను ప్రస్తావించి పల్కినంత మాత్రంతో ఏవిధమైన ఆపదను శంకించరాదు.

## ప్రసంగవశాస్తు శీమాలికన్ కథను ఉదాహరించడం

శ్రీకృష్ణుని చరిత్రలలో ఒక వృత్తాంతాన్ని వింటున్నాము. **"శ్రీమాలికనవనోడు తోఴమైక్కొళ్ళవుమ్ వల్లాయ్, శామాఱు అవనై నీ ఎణ్ణి చ్చక్కరత్తాల్ తలై క్కొణ్డాయ్"** (శ్రీమాలికునితో స్నేహాన్ని చేయగల్గినవాడవు, ఆ విధంగానే అతనిని వధించే రీతిని తెలిసి, నీ చక్రంతో అతని తలను ఖండించినవాడవు.) అని పెరియాఴ్వార్ పాశురం ద్వారా తెలిసే వృత్తాంతం విచిత్రంగా ఉన్నది. "ప్రాణ స్నేహితునిగా చేసికొన్నవాని శిరస్సునే ఖండించిన కథ కన్పిస్తున్నది. ఈ విధంగా చేయడం మహాపాతకం కదా!" - అని సందేహపడేవారి భ్రాంతిని తీర్చే విధంగా ఆ ఆఴ్వార్లే స్వయంగా ఆ పాశురంలోనే **"ఆమాఱు అఱియుమ్ పిరానే!"** అని అన్నారు. ఏయే సమయంలో ఎవరెవరి



విషయంలో ఏ రీతిలో వర్తించాలి - అనేది ఆ స్వామికే తెలుసు కనుక, అతని కార్యాలలో ఎవరూ ఏవిధమైన కొఱతను భావించరాదు - అనేదే **"ఆమాఱు అఱియుమ్ పిరానే!"** అని అనడం ద్వారా సూచించారు.

ఈవిధంగా శ్రీరాముడు దోషాలను కూడా గుణాలుగా గ్రహిస్తాడు - అనేదే **"అనసూయకః"** అనే ప్రశ్నలో భాసించే గుణమని, ఇది చాలా గొప్ప గుణమని, ఇందులో ఏవిధమైన ఆక్షేపం చేయడం తగదని తెలుపబడింది.

## ఇతరుల గొప్పతనాన్ని చూచి సంతోషించడమనే అనసూయ

గుణాలను కూడా దోషాలుగా భావించడం అసూయ - అని ఇతఃపూర్వం వివరించాము. ఇతరులకు గల గొప్పతనాన్ని సహించే స్వభావాన్ని కల్గి ఉండక పోవడాన్ని **"అసూయ"** అని అనడం కూడా ఉన్నది కనుక, ఆ అర్థాన్ని అనుసరించి కొంచెం వివరిస్తాము. ఇతరుల గొప్పతనాన్ని చూచి సహించలేకపోవడమనే అసూయను లేనివాడెవడు? అనేది ఈ ప్రశ్నలోని భావం. ఇతరుల గొప్పతనాన్ని చూచి మిక్కిలి ఆనందాన్ని పొందే స్వభావాన్ని కలవారిపట్ల అసూయ అనే దుర్గుణం ముఖం చూపించదు. తనను సేవించేవారికి అందఱికి పలు విధాలైన గొప్పతనాలను అనుగ్రహించగల్గిన శ్రీరాముడు ఆ గొప్పతనాలను చూచి అసూయను పొందే ప్రసక్తి లేదు. ఇతని కల్యాణగుణాలను గూర్చి దశరథ చక్రవర్తి వద్ద ప్రస్తావించి వివరించే అయోధ్యా పురజనులు - **"ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి"** (ఉత్సవాలలో అన్నిటిలో తండ్రివలె ఆనందిస్తాడు) అని అన్నారు. వారి వారి గృహాలలో సంతోష వృత్తాంతాలు సంభవించే సమయాలలో శ్రీరాముడు ఆనందపడడాన్ని చూస్తే, వారికి అందఱికి ఇతడు తండ్రి కాబోలు! - అనే రీతిలో ఉంటుంది.

## శ్రీరామునివల్ల గొప్పతనాన్ని పొందినవారు

**"ఏఴై ఏదలన్ కీఴ్మకన్"** (నిర్ధనుడు, వివేకహీనుడు, తక్కువ జాతివాడు) అనే ఒక వ్యాధప్రముఖునకు (గుహునకు) శ్రీరాముడు అతిశయాన్ని కల్గించినందువల్ల అతడు మనఃపూర్వాచార్యులచే గుహప్పెరుమాళ్ - అని వ్యవహరింపబడుతున్నాడు. శబరి **"చక్షుషా తవ సౌమ్యేన పూతాస్మి రఘునందన!"** (శ్రీరామా! నీ చల్లని చూపుతో నేను పవిత్రురాలను అయ్యాను.) అనే రీతిలో శ్రీరాముని కటాక్షంవల్ల గొప్ప పరిశుద్ధిని పొందింది. వానరసమూహాలు కూడా ఈస్వామి మహానుగ్రహాన్ని పొంది సుగ్రీవ మహారాజర్ అని, అంగదప్పెరు మాళ్ - అని, వానరముదలికళ్ - అని చాలా

గొప్పగా వ్యవహరింపబడుతున్నారు. హనుమానునకు **"తిరువడి"** అనే పేరును అనుగ్ర హించాడు. తన అభిమానంతో గృధ్రరాజు జటాయువు **"జటాయుమహారాజర్"** అని, **"పెరియతిరువుడైయార్"** అని వ్యవహరింపబడుతున్నాడు. రాక్షసజాతీయుడైన ఒకభక్తుడు విభీషణాழ்వాన్ - అనే బిరుదుతో పొగడబడి, **"ఎన్నిలజ్గు నామత్తళవు మరశు"** అని ప్రశంసింపబడి, **"మన్నుడైయ విబీడణఱ్కాయ్ మదిళిలజ్లై త్తిశై నోక్కి మలర్ కణ్ వైత్త"** (స్థిరమై కీర్తిని గల విభీషణుని కోసం ప్రాకారాలను కల లంకవైపు కటాక్షించిన) అనే పర్యంతం అనుగ్రహాన్ని పొంది కాలతత్త్వం ఉన్నంతవరకు గొప్పతనాన్ని పొందినవాడయ్యాడు. ఈవిధంగా ఎన్ని చూపాలి! ఈవిధంగా పలువురకు పలు విధాలైన గొప్పతనాలను కల్గించి, అందువల్లనే మనస్సులో ఉబ్బి తబ్బిబ్బు అయ్యే శ్రీరాముడు ఇతరుల గొప్పతనాన్ని చూచి సహించలేకపోవడమనే అసూయ అనే దుర్గుణానికి అవకాశలేశం కూడా లేనివాడు కదా!

## ముముక్షుప్పడిలోని ఒక దివ్యసూక్తి

మానవులకు సంభవించే దుర్గుణాలలో అసూయ ఒక్కటే ప్రాధాన్యాన్ని కల్గినది. దీనిని జయించినవారు లోకంలో ఉండడం చాలా అరుదే. శ్రీపిళ్ళైలోకాచార్యుల వారు తాము అనుగ్రహించిన ముముక్షుప్పడి అనే ఒక దివ్యగ్రంథంలో **"ఇప్పడి యిరుక్కుమ్ శ్రీవైష్ణవర్కళిన్ ఏత్తమతిన్డు ఉకన్దిరుక్కై"** (ఈవిధంగా ఉండే శ్రీవైష్ణవుల గొప్పతనాన్ని గ్రహించి ఆనందించడం) అని పల్కినచోట వ్యాఖ్యాన కర్తలైన శ్రీమణవాళ మహామునులు **"మత్త గుణజ్గళ్ ఎల్లాముణ్డానాలుమ్, ఉణ్డాక అరిదాయిరుప్పదు ఒన్టన్ఱో యిదు"** (మిగిలిన గుణాలు అన్నీ ఉన్నా, ఈ గుణం ఉండడం అరుదుకదా) అని అనుగ్రహించారు. అందువల్ల ఈ దుర్గుణం మానవులకు మందు లేని వ్యాధి - అని అనడంలో అడ్డు లేదు. శ్రీరాముడు **"రిపూణా మపి వత్సలః"** అని మాటిమాటికి ప్రశంసింపబడుతున్నాడు. శత్రువులలో కూడా దోషాలను చూడనివాడు. శత్రువులకు కూడా గొప్పతనాన్ని కల్గించాలని తలచేవాడు- అనే ప్రసిద్ధిని పొందిన శ్రీరాముడొక్కడే **"కః అనసూయకః?"** అనే ప్రశ్నకు సమాధానాన్ని ఇచ్చే లక్ష్యం కాదగినవాడు.

## గీతాభాష్యానుసారం అనసూయాశబ్దవివరణం

భగవద్గీతలో **"ప్రవక్ష్యామ్యనసూయవే"** (9-1) అనే చోట భాష్యాన్ని అనుగ్రహించే శ్రీరామానుజులు ''శాస్త్రోక్తాలైన విషయాలను వింటే, ఇవి పొసగవు - అని అంటూ



కుతర్కాన్ని చేసేవాడు - అసూయను కలవాడు. పొసగుతుంది - అని ఆనందించే వాడు - అసూయ లేనివాడు - అని వివరించారు. ఈవిధమైన గొప్పతనం కూడా శ్రీరామునకు తగినది.

## రామ - జాబాలి సంవాదం

శ్రీరాముని అరణ్యంనుండి తిరిగి అయోధ్యకు తీసికొనిపోవాలని చిత్ర కూటానికి వచ్చిన భరతాழ்వాన్ పట్ల ప్రేమతో జాబాలి అనే ముని శ్రీరామునితో కొన్ని నాస్తికవాదాలను చేయడం ఆరంభించాడు. **"ఆశ్వాసయన్ తం భరతం జాబాలి ర్బ్రాహ్మణోత్తమః, ఉవాచ రామం ధర్మజ్ఞం ధర్మాపేత మిదం వచః"** (ఆ భరతుని ఓదారుస్తూ గొప్ప బ్రాహ్మణుడైన జాబాలి, ధర్మాలను తెలిసిన రామునితో, ధర్మం లేని ఈమాటను పలికాడు) (అయోధ్యా-108-1), వాల్మీకిమునికూడా **"ధర్మాపేత మిదం వచః"** (ధర్మం తొలగిన ఈ మాట) అని పలికే రీతిలో శాస్త్రవిరుద్ధమైన మాటలను జాబాలి పలికాడు. అపుడు శ్రీరాముడు **"అమృష్యమాణః పునరుగ్రతేజాః నిశమ్య తన్నాస్తికవాక్యవేషమ్, అథాబ్రవీత్తం నృపతే స్తనూజో విగర్హమాణో వచనాని తస్య"** (అయోధ్యా-109-31) (గొప్ప తేజస్సును కల ఆ రాముడు ఆనాస్తిక వాక్యరూపమైన మాటను విని సహించలేక, దశరథ పుత్రుడైన అతడు ఆ జాబాలి మాటలను గర్హిస్తూ ఈవిధంగా అన్నాడు) అనేరీతిలో గొప్ప బ్రాహ్మణోత్తముడైన జాబాలి పల్కిన మాటలుకదా - అని చూడకుండా నాస్తిక వాదాన్ని కొంచెం కూడా సహించకుండా, ఆ మునిని కోపించి, గర్హించినట్లు కనబడుతుంది. అందువల్ల, అన్నివిధాలుగాను శ్రీరాముడు అసూయ లేనివాడు - అని తెలుపబడింది.

# ఇక, 13వ, 16వ ప్రశ్నల విమర్శనం

ఇక, తరువాత కల్యాణగుణాన్నిగూర్చి విచారిద్దాం. పూర్వం, **"ఆత్మవాన్ కః?"** అనే పన్నెండవ ప్రశ్నకు తరువాత **"కో జితక్రోధః?"** అనే పదమూడవ ప్రశ్న వివరింపబడ కుండా, విడచిపెట్టబడింది. ఆ ప్రశ్నను, తరువాత రాబోయే పదహారవ ప్రశ్నతో చేర్చి వివరించాలని విడచిపెట్టాను. **"జితక్రోధః కః?"** అనే దానికి ''కోపాన్ని జయించిన వాడెవడు?'' అని అర్థం. **"కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే?"** అనే అనంతర ప్రశ్నకు - ''యుద్ధరంగంలో ఎవని కోపాన్ని చూచి దేవతలు కూడా భయపడి జంకుతారు?''- అని అర్థం. అందువల్ల ఈ రెండు ప్రశ్నలు ఒకదానితో ఇంకొకటి విరుద్ధంగా ఉన్నట్లు తోస్తాయి. వైరుధ్యం లేని రీతిలో సమన్వయించి ఇక్కడ వివరిస్తాను.

## శ్రీరాముని కోపంలోని వైచిత్రి

**"జితక్రోధః కః?"** అనే పదమూడవ ప్రశ్నకు "కోపాన్ని జయించినవాడెవడు?" అని అర్థమే తప్ప, "కోపాన్ని లేనివాడెవడు?" అనే అర్థం కాదు. కోపాన్ని జయించడం అంటే - దానిని స్వాధీనం చేసికోవడం. కొందఱు సదా కోపిష్ఠివారుగానే కనబడతారు. కొందఱు కోపం ఏమీ లేనివారుగా ఉంటారు. రెండు తప్పు. కోపాన్ని చూపి కార్యాన్ని సాధించవలసిన సమయాలలో మాత్రం కోపాన్ని ఆరోపించుకోవడం, కార్యం పూర్తి కాగానే ఆ కోపం ఉండే చోటు తెలియకుండా పోయేటట్లు చేసికోవడం ఉత్తమ పురుషుల లక్షణం. ప్రభువు - దోషులను, ఉపాధ్యాయుడు - శిష్యులను, తండ్రి - సంతానాన్ని దండించవలసిన కాలాలలో అవశ్యం దండించవలసి ఉన్నది. దీనికి శాస్త్రాలలో అనుమతి ఉన్నది కనుక, పూర్వం తెల్పిన దండనలు తప్పు కావు. ఆ విధంగా దండించడం జరిగేటపుడు కోపం కల్గి తీరుతుంది. కోపం లేకపోతే వీలు కాదు కదా! అందువల్ల ఆ కోపం ఆవశ్యకమే. "ఎపుడు చూచినా ఇతని ముఖం చిటపటలాడుతూ ఉంటుంది" అనే విధంగా కొందఱు ఉంచారు. వారిని సంస్కృత భాషావిదులు **"ప్రకృతికోపనాః"** - అని అన్నారు. కోపమే స్వభావంగా కలవారు - అని అర్థం. శ్రీరాముని స్వభావం అయితే - యుద్ధరంగంలో కన్పించేటపుడు **"అజ్గణ్ మాఞాలమ్"** (ఆ అందమైన విశాలమైన భూమి) అని, **"మునైత్త శీ*గ్ఱ*మ్ విణ్కడ ప్పోయ్ మూవులకుమ్ పిఱవుమ్ అనైత్తు మఞ్జ"** (కోపించిన ఆ కోపం ఆకాశాన్ని దాటి ముల్లోకాలు అంతా భయపడేటట్లు) అని, **"ఉయిర్ మలజ్గ క్కొణ్డ శీ*గ్ఱ* మొన్ఱుణ్డు"** (ప్రాణులు భీతిల్లేటట్లు గ్రహించిన అద్వితీయమైన కోపం ఉన్నది) అని పలికే రీతిలో ఆరోపితమైన కోపం కూడా అంతు లేనిదికాగానే ఉంటుంది. మిగిలిన సమయాలలో చూస్తే "ఇతని వద్ద ఏనాడూ కోపానికి చోటు లేదు"అనే రీతిలో పరమసౌమ్యుడై ఉంటాడు.

వాల్మీకి మహర్షి ప్రశ్నలకు సమాధానం పలికే నారదముని **"ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః"** (ఇక్ష్వాకు వంశంలో పుట్టినవాడు, జనులకు రాముడని ప్రసిద్ధుడు) అని శ్రీరామునిగూర్చి పల్కడం ఆరంభించి, **"సదైక ప్రియ దర్శనః"** అని, **"సోమవత్ ప్రియదర్శనః"** అని పల్కి, తరువాత, **"కాలాగ్నిసదృశః క్రోధే"** (కోపంలో కాలాగ్ని వంటివాడు) అని అన్నాడు. రెండు విధాలైన ప్రశ్నలకు తగిన సమాధానాలను పలికాడు. తరువాత, అయోధ్యాకాండ మొదటి సర్గలో శ్రీరాముని కల్యాణగుణాలను శరవర్షం వలె కురిసే వాల్మీకిముని **"అప్రధృష్యశ్చ సంగ్రామే క్రుద్ధైరపి సురాసురైః,**



**అనసూయో జితక్రోధో.... న చ మత్సరీ"** (యుద్ధంలో కోపించిన సురాసురులకు సైతం జయింపరానివాడు, అసూయ లేనివాడు, కోపాన్ని జయించినవాడు, మాత్సర్యం లేనివాడు) అని అన్నాడు. చక్రవర్తి వద్ద శ్రీరామగుణాలను ప్రస్తావించి పలికే నగరప్రజలు **"స్మితపూర్వభాషీచ"** అని శ్రీరాముని విశేషించి పలికారు. అందఱితో చిఱునవ్వుతో అందంగా శ్రీరాముడు మాట్లాడతాడట. **"పౌరాన్ స్వజనవన్నిత్యం కుశలం పరిపృచ్ఛతి"** అనికూడా అన్నారు. అయోధ్యా నగరంలోని జనులను అందఱిని తన బంధువులుగా, దగ్గరివారుగానే భావించి ప్రతిదినం క్షేమాన్ని విచారించేవాడు, శ్రీరాముడు. దీనికి పిమ్మట చెప్పే విషయాన్ని ముఖ్యంగా గమనించండి. **"నాస్య క్రోధః ప్రసాదశ్చ నిరర్థోఽస్తి కదాచన, హంత్యేష నియమాత్ వధ్యానవ్యేషు న కుప్యతి"** (ఇతనికోపం గాని, అనుగ్రహం కాని ఎక్కడా వ్యర్థం కావు. వధించ వలసిన వారిని వధిస్తాడు. వధ్యులు కానివారి పట్ల కోపించడు) అని అన్నారు, అయోధ్యాజనులు. దీని అర్థం ఏమంటే - "శ్రీరామునకు కోపం కాని, అనుగ్రహం కాని ఏనాడూ కారణం లేకుండా కలుగదు. దండించవలసినవారిని దండించి తీరుతాడు. దోషం లేనివారిపట్ల కోపాన్ని శ్రీరాముడు పొందడు" - అని

## కోపవిషయంలోని రెండు ప్రశ్నల ఆవశ్యకత్వం

**"కః జితక్రోధః?"** అనే ప్రశ్న సాధారణమని, పదహాఱవ ప్రశ్న ప్రత్యేకంగా అడుగవలసినది లేదని కొందఱు భావించవచ్చు. కోపాన్ని జయించినవాడు - అంటే అక్కఱలేని సమయాలలో దానిని నిరోధించి, కావలసిన సమయాలలో పొందేవాడు- అనే అర్థం కనుక, ఒక ప్రశ్న చాలు. రెండు ప్రశ్నలు అక్కరలేదు - అని భావించడం తగినదే. అయినా, **"కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే?"** (యుద్ధంలో కోపించిన ఎవనిని చూచి దేవతలు కూడ భయపడతారు?) అనే పదహాఱవ ప్రశ్న అర్థం అంతా **"కః జిత క్రోధః?"** అనే ప్రశ్నలో అంతర్భవించలేదు కనుక, ప్రత్యేకంగా ఈ ప్రశ్న ఆవశ్యకమే.

**"జితక్రోధః"** అనే ప్రశ్నలో సాధారణమైన కోపం స్ఫురిస్తుంది. ఈ ప్రశ్నలో కంటితో చూడడానికి సాధ్యంకాని (అపరిమితమైన) కోపం స్ఫురిస్తుంది. రెండిటికి ఉదాహరణంగా శ్రీరామాయణంలో కొన్ని సందర్భాలను చూపిస్తాను. అందఱికి కోపం తమకు హానిని చేసినవారిపట్ల కల్గుతుంది కదా! ఈవిధంగా హానిని చేసేవారు రెండు విధాలుగా ఉంటారు. తమపట్ల సాక్షాత్తుగా హాని చేసేవారు ఒకవిధమైన వారు. తమకు కావలసినవారి (స్నేహితులు) విషయంలో హాని చేసేవారు ఇంకొక

విధమైనవారు. లోకంలో మనవంటివారి స్వభావం ఎటువంటిది! అంటే, మన స్నేహితుల విషయంలో ఎవరైనా హానిని చేస్తే దానిని లెక్కించకుండా, మనకు నేరుగా హాని చేసేవారి విషయంలోనే కోపాన్ని పొందడమే ప్రాయికంగా - ఎక్కువగా- కనబడే స్వభావం. భగవానుని స్వభావం దీనికి వేఱయినది. ఇతరులు తనపట్ల ఎన్ని అపచారాలను చేసినా కోపాన్ని పొందడు. మనోవికారాన్ని కొంచెంకూడా పొందడు. తన భక్తులకు హాని చేసేవారి విషయంలోనే చాలా కోపాన్ని పొందుతాడు. దీనిని శ్రీకృష్ణుడు ఒక సందర్భంలో అద్భుతంగా ప్రస్తావించి పలికాడు. పాండవుల కోసం దుర్యోధనుని వద్దకు దూతగా పోయిన కాలంలో ద్రోణుడు, భీష్ముడు, దుర్యోధనుడు- అనే ముగ్గురు తమ తమ ఇంటికే శ్రీకృష్ణుడు భుజించడానికి రావచ్చునని భావించి, తమ గృహాలలో భోజనపదార్థాలను గొప్పగా సిద్ధం చేసి ఉంచారు. శ్రీకృష్ణుడు పరమభక్తుడైన విదురుని గృహంలో ఆరగించి, వారివద్దకు వచ్చాడు. అపుడు దుర్యోధనుడు శ్రీకృష్ణుని ప్రశ్నిస్తూ **"భీష్మ ద్రోణా వతిక్రమ్య మాం చైవ మధుసూదన!, కిమర్థం పుండరీకాక్ష! భుక్తం వృషలభోజనమ్?"** - (శ్రీకృష్ణా! భీష్ముని విడచి, ద్రోణుని విడచి, నన్ను కూడా విడచి, ఒక శూద్రుని అన్నాన్ని భుజించి వచ్చావు. ఇదేమి!) అని దీనికి శ్రీకృష్ణుడు బదులు పల్కిన రీతి ఏది? అంటే, ''విదురుడు శూద్ర జాతిలో జన్మించినప్పటికీ అతడు శూద్రుడు కాడు. **"న శూద్రా భగవద్భక్తాః విప్రా భాగవతా స్స్మృతాః"** (భగవద్భక్తులు శూద్రులు కారు. భాగవతులు విప్రులుగా చెప్పబడ్డారు) అనే రీతిలో అతడు బ్రాహ్మణోత్తముడే కాగలదు. ''నేను శూద్రాన్న భోజనాన్ని చేశానని నన్ను నిందించడం తగదు?'' అనే సమాధానాన్ని పలుకకుండా, **"ద్విషదన్నం న భోక్తవ్యం ద్విషంతం నైవ భోజయేత్, పాండవాన్ ద్విషసే రాజన్! మమ ప్రాణా హి పాండవాః"** అనే సమాధానాన్ని పలికాడు. ''ద్వేషించేవారి అన్నాన్ని భుజించరాదు. ద్వేషించేవారికి అన్నం పెట్టరాదు. నీవు పాండవులపట్ల ద్వేషాన్ని కల్గినవాడవు. పాండవులు నాకు ప్రాణాలు సుమా!'' అనేది ఈ శ్లోకార్థం. ఒకడు ఇంకొకని శరీరంలో కత్తితో గాయపరిస్తే, మందుతో ఆ గాయాన్ని మాన్పవచ్చు. మర్మస్థానంలో (ప్రాణ స్థానంలో) కత్తితో గాయపరిస్తే మందులేదు కదా! పాండవులవంటి భాగవతులను భగవానుడు తన ప్రాణస్థానీయులుగా భావిస్తాడు. గీతలో **"జ్ఞానీ తు ఆత్మైవ మే మతమ్"** (జ్ఞాని నా ఆత్మ అని నా అభిప్రాయం) అని జ్ఞానులను తన ప్రాణంగా, వారికి తాను శరీరంగా పల్కడం గమనించదగినది. అందువల్ల, వీటినిబట్టి, భగవానుడు తనపట్ల అపచారపడిన వారినిగూర్చి కోపాన్ని పొందడు - అని, తన



భక్తులపట్ల అపచారపడేవారి విషయం లోనే చాలా కోపాన్ని పొందుతాడు - అని దృఢంగా తెలియవచ్చు. ఈవిషయాన్ని కూరత్తాళ్వాన్ వరదరాజస్తవంలోని **"యదపరాధసహస్ర మజస్రజం త్వయి శరణ్య! హిరణ్య ఉపావహత్, వరద! తవ చిరం త్వమవిక్రియః వికృతి మర్భకనిర్భజనాదగాః"** (వరదరాజస్వామీ! గొప్ప శరణమైనవాడా! ఎల్లప్పుడు నీ పట్ల వేలాది అపచారాలను హిరణ్యకశిపుడు చేసినా అతనిపై కోపించని నీవు, నీ భక్తుడైన ప్రహ్లాదుని పట్ల అతడు అపచారపడగానే కోపంతో వికారాన్ని పొందావు) అనే శ్లోకంలో స్పష్టం చేశారు. హిరణ్యకశిపుడు భగవానుని విషయంలో అపరిమితాలైన అపచారాలను చేసినా, భగవానుడు కొంచెం కూడా కోపాన్ని పొందలేదు. పరమభక్తుడైన ప్రహ్లాదాళ్వాన్ పట్ల అతడు అపచార పడినందువల్లనే ఘనమైన కోపాన్ని పొందాడు - అని ఈ శ్లోకంలో తెలుపబడింది.

## శ్రీరాముని రెండు విధాలైన కోపాల వివరణం

శ్రీరాముడు తన విషయంలో అపచారపడినవారిపట్ల కోపాన్ని పొందడానికి చాలా శ్రమపడినట్లుగాను, తన భక్తుల విషయంలో అపచారపడినవారివల్లనే కోపం తన స్వాధీనంలో ఉన్నట్లును వాల్మీకి చాలా అందంగా పలికారు.

శ్రీరాముడు సముద్రరాజును ఉద్దేశించి శరణాగతిని చేసి, మూడు దినాల పాటు సముద్రతీరంలో శయనించినా, సముద్రుడు వచ్చి ముఖం చూపించలేదు. అపుడు **"సముద్రస్య తతః క్రుద్ధః"** (యుద్ధకాండం-21-13) అని సముద్రునిపై కోపించినట్లుగా సామాన్యంగా పలికారు. పధ్నాలుగు వేలమంది రాక్షసులు జన స్థానంలో తనకు హాని చేయాలని వచ్చినపుడు కూడా **"క్రోధ మాహారయత్తీవ్రం వధార్థం సర్వరక్షసామ్"** (ఆరణ్య-24-34) (రాక్షసుల అందరి వధకోసం శ్రీరాముడు కోపాన్ని ఆరోపించుకొన్నాడు) అని కోపాన్ని ఆరోపించుకొన్నట్లు పలికారు. (**"కోధమ్ ఆహారయత్"** - రాని కోపాన్ని బలాత్కారంగా ఆరోపించుకొన్నాడు- అని భావం).

ఇపుడు, ఇంకొక సందర్భాన్ని చూపిస్తాము. అక్కడ చూడండి. యుద్ధకాండం లోని **"తతో రామో మహాతేజాః రావణేన కృతవ్రణమ్, దృష్ట్వా ప్లవగశార్దూలం కోపస్య వశమేయివాన్"** (అపుడు గొప్ప తేజస్సును కల శ్రీరాముడు రావణునిచే గాయపడిన గొప్పవానరుడైన హనుమానుని చూచి కోపానికి వశుడయ్యాడు) (59-134) అనే సందర్భం మిక్కిలి ముఖ్యమైనది. రావణుడు, ఒక వానరవీరుని గాయపఱచడం చూచిన శ్రీరాముడు **"కోపస్య వశమేయివాన్"** - కోపాన్ని తన వశంలో కల్గినవాడు

కాకుండా, కోపానికి తాను వశమయ్యాడు - అని పలికే ఈ సూక్తి పూర్వం విస్తృతంగా నిరూపించిన విషయాలను ద్రఢీకరించగల్గినది.

ఈ విధంగా **"జితక్రోధః"** అనే పదమూడవ ప్రశ్నకు లక్ష్యంగా గ్రహించవలసిన సందర్భం ఇది - అని, **"కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే"** అనే ఈపద హాఱవ ప్రశ్నకు లక్ష్యంగా గ్రహించవలసిన సందర్భం ఇది - అని స్పష్టంగా తెలియ జేశాను.

మిత్రులకొక విన్నపం. ఈ విధంగా అపూర్వరామాయణాన్ని వ్రాసే నెపంతో శ్రీరాముని కల్యాణగుణాలను ఆశ్చర్యకరంగా అనుభవించగల్గిన నాకు ఎవరూ సాటి లేరు - అనే గర్వం కల్గుతున్నది. వాస్తవంగా చాలా విలక్షణమైన ఈ అనుభవం బహుసుకృత ఫలంగా లభించిందని భావించి సంతోషిస్తున్నాను.

**అపూర్వపూర్వం మధురం గభీరం విగాహ్య రామాయణ మేతదార్యాః ।**
**అణ్ణంగరార్యైః లిఖితం రసజ్ఞాః ముదం లభేరన్నితి మేఽత్ర యత్నః ॥**





## అనుబంధం

# శ్రీరామాయణంలో నవవిధ సంబంధాలు

**పితా చ రక్షకః శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః ।**
**స్వామ్యాధారో మమాత్మా చ భోక్తా చాద్యమనూదితః ॥**

**"ఋచో యజూంషి సామాని తథైవాథర్వణాని చ, సర్వమష్టాక్షరాంతస్థమ్"** (ఋగ్యజుస్సామాథ్వరణాలనే వేదాలన్నీ అష్టాక్షరిలో ఇమిడి ఉన్నాయి) – అనే సూక్తి ప్రకారం అష్టాక్షరి వేదాల సంగ్రహరూపం. పై శ్లోకం మంత్రరాజమనబడే అష్టాక్షరీ మహామంత్రంలో సూచింపబడేవి, భగవానునకు జీవునకు మధ్య ఉండేవి అయిన తొమ్మిది సంబంధాలను తెల్పుతున్నది. భగవానుడు జీవులకు సర్వవిధబంధువు. **"బధ్నాతి ప్రీతి మితి బంధుః"** అనే బంధుశబ్దవ్యుత్పత్తి భగవానునకు జీవుని విషయంలో ఉండే సహజమైన, నిరవధికమైన ప్రీతిని వచిస్తున్నది. ఈ ప్రీతి నిరుపాధికమైనందున అనేకప్రకారాలను కల్గినది అయినా, లోకరీతినిబట్టి, ప్రాధాన్యాన్నిబట్టి తొమ్మిది విధాలైన సంబంధాలు తిరుమంత్రంలో తెలుపబడు తున్నాయని మన పూర్వాచార్యులు భావించారు.

సుబాలోపనిషత్ కూడా **"మాతా పితా భ్రాతా నివాస శరణం సుహృద్గతి ర్నారాయణః"** (నారాయణుడు – జీవులకు తల్లి, తండ్రి, భ్రాత, నివాసం, శరణం, స్నేహితుడు, గతి) అని ఈ ప్రీతి పలు విధాలైనదని అన్నది. **"వేదమ్ తమిళ్ శెయ్ద మాఱన్"** (వేదాన్ని ద్రావిడీకరించిన) నమ్మాళ్వార్లు ఈ అర్థాన్ని **"శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్ మేలా త్తాయ్ తన్దైయుమ్ అవరే, ఇని యావారే"** (అందమైన చేపలవంటి కన్నులను కల స్త్రీలు, గొప్ప సంపద, సత్సంతానం, ఇంకా తల్లి, తండ్రి ఆ భగవానుడే. ఇంకా మిగిలిన బంధువు లంతా అతడే) అని, **"తాయాయ్ తన్దైయాయ్ మక్కళాయ్ మత్ట్రుమాయ్ ముత్ట్రుమాయ్"** (తల్లియై, తండ్రియై, సంతానమై, ఇంకా అన్ని విధాలైన బంధువై) అని అనుసంధించారు. ఈ రీతిలో భగవానునకు జీవులపై ఉండే ప్రీతి ఏ రీతిలో అయినా, అది నిరుపాధికం, నిరవధికం. **'భూతానా మవ్యయః పితా"** (జీవులకు వ్యయం లేని–నిత్యమైన–తండ్రి) అనే ఉపబృంహణసూక్తి, **"ఎన్టుమ్ ఇఱవాద ఎన్దై"** (ఏనాటికీ నశించని తండ్రి) అని ముదలాళ్వార్లు అన్నారు.

ఈ అష్టాక్షరిలో సూచింపబడే నవవిధసంబంధాలు వేదోపబృంహణమైన శ్రీరామాయణంలో అనుసంధింపబడడం సహజం, యుక్తం కదా. **"వేదః ప్రాచేత సాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"** (వేదం శ్రీరామాయణరూపంలో ఆవిర్భవించింది) కదా! ఈనవవిధసంబంధాలను నిరూపించే సందర్భాలు, సూక్తులు శ్రీరామాయణంలో ఎన్నో ఉన్నా, ఇక్కడ సంగ్రహంగా, సూచనగా మాత్రమే ప్రస్తావింపబడుతున్నాయి.

1. పదత్రయాత్మకమైన అష్టాక్షరిలోని మొదటి పదం ప్రణవం. ఈ ప్రణవం కూడా మళ్ళీ పదత్రయాత్మకమే. అందులోని మొదటి పదం అకారం. ఈ అకారం ప్రకృత్యంశద్వారా పితాపుత్రసంబంధాన్ని తెల్పుతున్నది. **"సమస్తశబ్దమూలత్వాత్ అకారస్య స్వభావతః, సమస్తవాచ్యమూలత్వాత్ బ్రహ్మణోఽపి స్వభావతః, వాచ్యవాచకసంబంధ స్తయోరర్థాత్ ప్రతీయతే"** (అకారం సహజంగా సమస్త శబ్దమూలమైనందున, పరబ్రహ్మ సహజంగా సమస్త వాచ్యమూలమైనందున, అకారం–పరబ్రహ్మల మధ్య వాచ్యవాచక సంబంధం అర్థత! స్ఫురిస్తున్నది) అనే ప్రమాణాన్నిబట్టి ఈ సంబంధం వాచ్యవాచకసంబంధ ప్రయుక్తం. దీనిని **"మాతా పితా భ్రాతా....."** అని మొదలైన శ్రుతులు, **"దేవదేవో హరిః పితా"** (దేవ దేవుడైన హరి తండ్రి) వంటి ఉపబృంహణసూక్తులు, **"ఎన్దైయే ఎన్నుమ్"** ఇత్యాది ఆళ్వార్ల సూక్తులు తెలుపు తున్నాయి.

ఈ సంబంధం శ్రీరామాయణంలో లక్ష్మణవచనంద్వారా వ్యక్తమైనది. **"భ్రాతా భర్తా చ బంధు శ్చ పితా చ మమ రాఘవః"** (శ్రీరాముడు నాకు భ్రాత, భర్త, బంధువు, తండ్రికూడా) అనే లక్ష్మణ వచనంతోపాటుగా, లక్ష్మణుని ఉద్దేశించి సుమిత్రాదేవి పల్కిన **"రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్"** (శ్రీరాముని దశరథునిగా, జానకిని నన్నుగా భావించు) అనే వచనంకూడా ప్రమాణం.

**2.** రెండవ సంబంధం రక్ష్య–రక్షక సంబంధం. ఇదికూడా అకారం ద్వారా సూచింపబడింది. అయితే, ఇది ధాత్వర్థ ప్రయుక్తం. ఈ అకారాన్ని **"అవ–రక్షణే"** అనే ధాతువునుండి పుట్టిన పదంగా గ్రహించినపుడు ఇది భగవానుని రక్షకత్వాన్ని బోధిస్తుంది. ఈ సంబంధాన్ని **"కో హ్యే వాన్యాత్ కః ప్రాణ్యాత్"** (ఎవడు రక్షించగలడో, ఎవడు బ్రతికించగలడో) ఇత్యాది శ్రుతులు, **"న హి పాలన సామర్థ్యమృతే సర్వేశ్వరం హరిమ్"** (సర్వేశ్వరుడైన హరికి తప్ప పాలించే సామర్థ్యం ఎవరికీ లేదు) ఇత్యాది ఉపబృంహణ సూక్తులు, **"కరుత్తిల్ తేవుమ్ ఎల్లా ప్పొరుళుమ్ వరుత్తిత్త మాయప్పిరాన్"**



(తన సంకల్పమాత్రంతో దేవతలను, ఇంకా అన్ని వస్తువులను వర్తింపజేసిన ఆశ్చర్యగుణచేష్టితుడు) ఇత్యాది ఆళ్వార్ల సూక్తులు తెల్పుతున్నాయి.

శ్రీరామాయణంలో ఈ సంబంధం **"రక్షితా సర్వలోకస్య"** (సమస్తలోకానికి రక్షకుడు) **"బాహుచ్ఛాయా మవష్టబ్ధః యస్య లోకో మహాత్మనః గజం వా వీక్ష్య సింహం వా వ్యాఘ్రం వాపి వరాంగనా, నాహారయతి సంత్రాసం బాహూ రామస్య సంశ్రితా"** (శ్రీరాముని బాహువులను ఆశ్రయించిన అందమైన సీత ఏనుగును చూచి గాని, సింహాన్ని చూచిగాని, పులిని చూచి గాని ఏమాత్రం భయపడడం లేదు) ఇత్యాది పలు సూక్తుల ద్వారా వ్యక్తం.

**3.** మూడవ సంబంధం శేష – శేషిసంబంధం. ఇది అకారంపై వచ్చి లోపించిన చతుర్థీవిభక్తి ద్వారా సూచింపబడుతున్నది. జీవులందఱు భగవానునకు శేషమని, అతడు సర్వశేషి – అని దీని తాత్పర్యం. ఇది **"యస్మాస్మి న తమంతరేమి"** (నేను ఎవనిని శేషమై ఉన్నానో, ఆ భగవానుని విడచి ఉండను), **"పతిం పతీనామ్"** (ప్రభువులకు ప్రభువు) ఇత్యాది శ్రుతుల ద్వారా **"జగత్పతిం దేవదేవమ్"** అనే మొదలైన ఉపబృంహణవాక్యాలద్వారా **"అమరర్కళ్ అదిపతి"** (నిత్య సూరులకు ప్రభువు) ఇత్యాది దివ్యసూరివచనాల ద్వారా తెలుపబడుతున్నది.

శ్రీరామాయణంలో ఈ సంబంధం లక్ష్మణ, భరత సూక్తులద్వారా స్పష్టం. రాజ్యపట్టాభిషేకాన్ని చేసికొని, రాజ్యాన్ని పాలించమని వశిష్ఠాదులతో భరతుడు పల్కిన **"రాజ్యం చాహం చ రామస్య"** (నేను, రాజ్యం రామునకు శేషభూతులము) అనే వచనం, తనను వనానికి వెంటగా తీసికొనివెళ్ళమని అర్థిస్తూ శ్రీరామునితో లక్ష్మణుడు పల్కిన **"కురుష్వ మామనుచరం వైధర్మ్యం నేహ విద్యతే"** (నన్ను అనుచరునిగా చేసికో, ఇందులో ధర్మవిరుద్ధం ఏమీ లేదు) ఇత్యాది వచనాలు, **"అహం సర్వం కరిష్యామి"** (నేను అన్ని కైంకర్యాలను చేస్తాను) ఇత్యాదులు ఇక్కడ ప్రమాణాలు.

**4.** నాల్గవది భర్తృ–భార్యా సంబంధం. ఇది ప్రణవంలోని ద్వితీయాక్షరమై, ద్వితీయపదమైన ఉకారంద్వారా సూచింపబడుతున్నది. ఈ ఉకారంద్వారా జీవుని భగవదనన్యార్హత్వం సూచింపబడింది. ఇటువంటి స్థితి లోకంలో భార్యభర్తల విషయంలో కల్గి ఉంటుంది కనుక, ఈ ఉకారం భర్తృ–భార్యా సంబంధవాచకం. దీనిని **"భగవత ఏవాహమస్మి"** (భగవానునకు మాత్రమే చెందినవాడను) **"యోవై స్వాం మతియజతే, ప్రస్వాయై దేవతాయై చ్యవతే, న పరాం ప్రాప్నోతి, పాపీయాన్ భవతి"** (ఎవడు తనకు

స్వరూపానురూపమైన దైవాన్ని వదలి అన్యదైవాన్ని భజిస్తాడో, అతడు తన దేవతనుండి దూరం కావడమే కాక, అతనికి పరగతి లేదు, పాపిష్ఠివాడవుతున్నాడు) ఇత్యాది శ్రుతులు, **"సంసేవ్య ఏకో హరి రింద్రియాణాం సేవాఽన్యదేవే వ్యభిచార ఏవ"** (హరి ఒక్కడే ఇంద్రియాలకు సేవ్యుడు. అన్యదైవాలను సేవించడం వ్యభిచారమే కాగలదు) ఇత్యాది ఉపబృంహణవాక్యాలు, **"పఱవై ఏఱు పరమ్ పురుడా! నీ ఎన్నై క్కైక్కొణ్డ పిన్"** (గరుడుని అధిరోహించే పరమపురుషా! నీవు నన్ను పాణిగ్రహణం చేసిన తరువాత) అనే, పెరియాళ్వార్ల సూక్తి, **"ఊనిడైయాళి శఙ్గు ఉత్తమర్క్కెన్ఱు ఉన్నిత్తెళున్ద ఎన్ తడములైకళ్ మానిడవర్క్కెన్ఱు పేచ్చు ప్పడిల్ వాళకిల్లేన్"** (శంఖచక్రధారియైన పురుషోత్తముని కోసంగా ఎదిగిన నా స్తనాలు – అంటే –జ్ఞాన భక్తులు– మానవులకోసమనే మాట వింటే జీవించలేను) అనే గోదాసూక్తి, ఇత్యాది దివ్యసూరి సూక్తులు తెలుపుతున్నాయి.

శ్రీరామాయణంలో ఈ సంబంధం సుందరకాండలో సీతాదేవి హనుమానునితో పల్కిన **"కౌసల్యా లోకభర్తారం సుషువే యం మనస్వినీ, తం మమార్థే సుఖం పృచ్ఛ"** (కౌసల్యాదేవి, లోకభర్త అయిన ఏ శ్రీరాముని కన్నదో, అతనిని నాకోసం కుశలమడుగు) అనే సూక్తి ద్వారా స్పష్టపడుతున్నది.

**5.** జ్ఞాతృ–జ్ఞేయసంబంధం అయిదవది. ఇది ప్రణవంలోని మకారం ద్వారా సూచితం. ఈ మకారాన్ని **"మన– జ్ఞానే"** అనే ధాతువునుండిగాని, **"మను– అవబోధనే"** అనే ధాతువునుండి గాని పుట్టిన పదంగా గ్రహించినపుడు ఈ సంబంధం వ్యక్తమవుతుంది. శ్రియఃపతి అయిన భగవానుని లక్ష్యంగా కల్గిన జ్ఞానమే– శ్రియఃపతి పరతత్వమనే జ్ఞానమే – యథార్థజ్ఞానం. అందువల్ల జ్ఞేయస్వరూపుడు భగవానుడే. ఈ సంబంధాన్ని **"నిదిధ్యాసితవ్యః"** ఇత్యాది శ్రుతులు, **"ధ్యేయో నారాయణ స్సదా"** (నారాయణుడు సదా ధ్యానించదగినవాడు) ఇత్యాది ఉపబృంహణాలు, **'ఎన్ ఉణర్విసుళ్ళే ఇరుత్తినేన్"** (నా జ్ఞానానికి నిన్ను విషయంగా చేసికొన్నాను) అని, **"ఒణ్ తామరైయాళ్ కేళ్వన్ ఒరువనైయే నోక్కుమ్ ఉణర్వు"** (జ్ఞానమనేది– లక్ష్మీదేవి వల్లభుని మాత్రమే లక్ష్యంగా కల్గినది) ఇత్యాది దివ్యసూరి సూక్తులు తెల్పుతున్నాయి.

శ్రీరామాయణంలో ఈ సంబంధం విశ్వామిత్రమహర్షివచనం ద్వారా తెలుపబడింది. యజ్ఞసంరక్షణార్థం. శ్రీరాముని విశ్వామిత్రుని వెంట పంపడానికి సందేహించిన దశరథునితో విశ్వామిత్రుడు **"అహం వేద్మి మహాత్మానమ్ రామమ్"** (శ్రీరాముని నేను మహాత్మునిగా తెలిసికొంటున్నాను) అని పల్కిన సూక్తి ద్వారా ఈ



జ్ఞాతృజ్ఞేయసంబంధం తెలుపబడింది. **"అహం రామం వేద్మి"** అంటే– శ్రీరాముని నా జ్ఞానానికి విషయంగా చేసికొన్నానని కదా అర్థం. ఈ జ్ఞానం ఎటువంటిది? అంటే **"మహాత్మానం వేద్మి"** అని విశేషించి పలుకబడింది. ఈ వచనం **"వేదాహమేతం పురుషం మహాంతమ్"** అనే పురుషసూక్త ప్రక్రియను అనుసరిస్తున్నది– అని పెరియవాచ్చాన్‌పిళ్ళై తనిశ్లోకిలోని సూక్తి.

**6.** ఆఱవది స్వ–స్వామిభావ సంబంధం. ఇది అష్టాక్షరిలోని నమశ్శబ్దం ద్వారా సూచితమైనది. **"మః"** అంటే– నేను నాకు సొత్తు– అని అర్థం. **"న"** అనేది ఈ భావాన్ని నివర్తింపజేస్తున్నది. అందువల్ల, **"న మః"** – అంటే నేను నాకు సొత్తు కాదు; భగవానుని సొత్తును. అతడే నాకు స్వామి – అని భావం. ఈ సంబంధాన్ని **"ఈశానో భూతభవ్యస్య"** (భూతభవిష్యత్తులకు స్వామి) ఇత్యాది శ్రుతులు, **"స్వత్వమాత్మని సంజాతం స్వామిత్వం బ్రహ్మణి స్థితమ్"** (సొత్తుగా ఉండే స్థితి ఆత్మలో ఉన్నది, స్వామిగా ఉండే స్థితి పరబ్రహ్మలో ఉన్నది) ఇత్యాది ఉపబృంహణవాక్యాలు, **"ఉలకమ్ మూన్ఱుడైయాయ్!"** (ముల్లోకాలను సొత్తుగా కలవాడా!) ఇత్యాది ఆళ్వార్ల సూక్తులు తెల్పుతున్నాయి.

ఈ సంబంధం శ్రీరామాయణంలో లక్ష్మణుడు పల్కిన **"అహ మస్యావరో భ్రాతా గుణై ర్దాస్య ముపాగతః"** (నేను ఇతనికి తమ్ముడను. ఇతని కల్యాణ గుణాల వల్ల దాసుడనయ్యాను) అనే సూక్తి ద్వారా బోధింపబడుతున్నది. **"అఖిలజగత్ స్వామిన్!"** అనే శరణాగతిగద్యలోని సంబోధనను పెరియవాచ్చాన్‌పిళ్ళై **"అపరాధత్తై త్తవిర్ప్పిత్తు ఆభిముఖ్యత్తై ఉణ్డాక్కి దేవర్ తిరువడికళిలే పుకురనిఱుత్తుకైక్కు వేఱు నిర్వాహకరుణ్డో!"** (అపరాధాలను తీర్చి, ఆభిముఖ్యాన్ని కల్గించి, నీ శ్రీచరణాలలో ప్రవేశింపజేసి, నిలుపడానికి నీకంటే ఇంకొక నిర్వాహకులున్నారా?) అని వివరించారు. ఇందువల్ల జీవుల విషయంలో స్వామిత్వమంటే తనపట్ల వారికి గల ప్రాతికూల్యాన్ని పోగొట్టి, తనపట్ల ప్రీతిని కల్గించి, వారి నుండి కైంకర్యాన్ని గ్రహించడమేకదా ఈ భావం. స్వ–స్వామి ఇది **"అహమస్య"** ఇత్యాది ప్రమాణం లోని **"గుణైః దాస్యముపాగతః"** అనే ప్రయోగం ద్వారా ద్యోతక మవుతున్నది. ఈ వాక్యాన్ని శరణాగతి గద్యవ్యాఖ్యలో శ్రుతప్రకాశికాచార్యులవారు, శ్రీరంగగద్యలో దేశికులు ప్రమాణీకరించారుకూడా.

**7.** ఏడవది– ఆధార– ఆధేయ సంబంధం. ఇది నారాయణ పదానికి చెప్పబడే తత్పురుషసమాసం ద్వారా సూచింపబడుతున్నది. నిత్యవస్తువుల సమూహమైన

నారాలకు (నిత్య వస్తువులకు) అయనం – ఆధారమైనవాడనే అర్థాన్ని బట్టి ఈ సంబంధం సూచితమవుతున్నది. ఇది **"సదాయతనాః సత్ప్రతిష్ఠాః"** (ఈ లోకాలు సచ్ఛబ్ద వాచ్యుడైన భగవానునికి ఆధారంగా కల్గినది. అతనిలో స్థిరంగా నిలచి ఉండేది) ఇత్యాదిశ్రుతులు, **"మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ"** (దారంలో మణుల సమూహంవలె, నాలో ఈ చరాచరాలు అన్నీ గుదిగుచ్చబడి ఉన్నాయి) ఇత్యాది ఉపబృంహణ వచనాలు, **"మూవులకుమ్ తన్ నెఱియా వయిఱ్ఱిల్ కొణ్డు"** (ముల్లోకాలను ఏ అలసట లేకుండా తన ఉదరంలో గ్రహించి) ఇత్యాది దివ్యసూరి సూక్తుల ద్వారా ద్యోతకమవుతున్నది.

శ్రీరామాయణంలో యుద్ధానంతరం బ్రహ్మ శ్రీరాముని స్తుతించే సందర్భంలో గల **"త్వం ధారయసి భూతాని వసుధాం చ సపర్వతామ్"** (నీవు సమస్త ప్రాణులను, పర్వతాలతో కూడిన భూమిని ఏ శ్రమలేకుండ ధరిస్తున్నావు) ఇత్యాది వచనాల ద్వారా తెలుపబడింది. ఇటువంటి వచనాలు ఈ సందర్భాలో ఇంకా ఉన్నాయి.

**8.** ఎనిమిదవది ఆత్మా– ఆత్మీయసంబంధం. ఇది నారాయణ పదానికి చెప్పబడే బహువ్రీహి సమాసం ద్వారా బోధింపబడుతున్నది. నారాలను – అంటే – నిత్యవస్తు సమూహాన్ని తనకు ఆధారంగా చేసికొని, వాటిలో అంతరాత్మగా వ్యాపించి ఉంటాడనే అర్థంద్వారా ఈ సంబంధం భాసిస్తున్నది. **"యస్యాత్మా శరీరం యస్య పృథివీ శరీరమ్"** ఇత్యాది శ్రుతులు, **"తత్ సర్వం వై హరే స్తనుః"** (అది అంతా హరికి శరీరమే కదా) ఇత్యాది ఉపబృంహణ (శ్రీవిష్ణుపురాణ) సూక్తులు, **"ఉమ్మురియర్ వీడుడైయాన్"** (మీ ఆత్మలను శరీరంగా కలవాడు) ఇత్యాది ఆళ్వార్ల సూక్తులు దీనిని తెల్పుతున్నాయి.

ఈ సంబంధం శ్రీరామాయణంలో యుద్ధకాండలో బ్రహ్మ చేసిన స్తుతిలోని **"జగత్సర్వం శరీరం తే"** (జగత్తు అంతా నీకు శరీరం), **"అశ్వినౌ చాపి తే కర్ణౌ చంద్రసూర్యౌ చ చక్షుషీ"** (అశ్విని దేవతలు నీ రెండు చెవులు, సూర్యచంద్రులు నీ రెండు నేత్రాలు), **"దృశ్యసే సర్వభూతేషు బ్రాహ్మణేషు చ గోషు చ"** (అన్ని ప్రాణులలో, బ్రాహ్మణులలో, గోవులలో గోచరిస్తున్నది) ఇత్యాదిగా గల పలు వచనాల ద్వారా వ్యక్తమైనది.

**9.** ఇక, చివరిది భోగ్య– భోక్తృసంబంధం. ఇది నారాయణ పదంపై వచ్చిన **"ఆయ"** అనే చతుర్థీవిభక్తిద్వారా సూచితం. **"అహ మన్న మహ మన్న మహ మన్నమ్"** (నేను భగవానునకు అన్నం– భోగ్యవస్తువును) ఇత్యాది శ్రుతులు, **"భోక్తారం యజ్ఞతపసామ్"**



(యజ్ఞాల, తపస్సుల భోక్త) ఇత్యాది ఉపబృంహణ సూక్తులు, **"ఉణ్డిట్టాయ్, ఇని ఉణ్డొழியాయ్"** (నా ఆత్మను భుజించావు. ఇక పూర్తిగా భుజించు), **"ఎన్నై ముఱ్ఱమ్ ఉయిరుణ్డ"** (నా ఆత్మను పూర్తిగా అనుభవించిన) అనే దివ్యసూరి సూక్తులు నారాయణ పదంపై గల చతుర్థి ద్వారా వ్యక్తమయే జీవుని అనన్యభోగ్యత్వాన్ని సూచిస్తున్నాయి.

శ్రీరామాయణంలో ఈ సంబంధం శత్రుఘ్నుని ద్వారా తెలుపబడింది. కణ్ణినుణ్ శిఱుత్తామ్బు ప్రబంధావతారికలో నంబిళ్ళై, పెరియవాచ్చాన్‌పిళ్ళై, నాయనార్ ప్రస్తావించిన శ్రీరామానుజులకు చెందిన ఒక వార్త ఇక్కడ స్మరణీయం. **"శ్రీశత్రుఘ్నాழ்వాన్ పెరుమాళుక్కు నల్లనానపడి– అవనై యల్లదఱియాద శ్రీభరతాழ்వానై యల్లదు వేఱొన్రు అఱియాదపడి ఆనాన్– ఎన్రు ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్‌దార్"** (శ్రీశత్రుఘ్నాழ்వాన్ శ్రీరామునకు ప్రీతిపాత్రుడు ఏవిధంగా అయ్యాడు? అంటే– శ్రీరాముని తప్ప వేఱొకరిని తెలియనివాడు శ్రీభరతాழ்వాన్. ఆ భరతాழ்వాన్‌ను తప్ప ఇంకొకటిని తెలియనివాడై శ్రీశత్రుఘ్నాழ்వాన్ ఉన్నందు వల్ల– అని శ్రీరామానుజులన్నారు) అనేది ఈ వార్త. దీనివల్ల తనకు ఆత్మస్థానీయు డైన తన భక్తుని విషయంలో పరమభక్తిని కల్గి ఉండేవారి పట్ల భగవానునకు **"మద్భక్తభక్తేషు ప్రీతి రభ్యధికా భవేత్"** (నా భక్తులకు భక్తులైనవారి విషయంలో నాకు ప్రీతి మిక్కిలి ఎక్కువ) అనే రీతిలో చాలా ప్రీతి. ఇటువంటివారిని చూచి భగవానుడు చాలా ఆనందపడతాడు. ఈ జ్ఞానమే ఆత్మయాథాత్మ్యజ్ఞానం. పరమాత్మకు అత్యంతం ప్రీతికరమైన భాగవతశేషత్వపారతంత్ర్యాలను అనుష్ఠించి చూపినవాడు శత్రుఘ్నుడు కనుక, భోగ్య–భోక్తృ సంబంధం శత్రుఘ్నుని ఆచరణ ద్వారా సువ్యక్తమైనది. ఈ విషయాన్ని మనఃపూర్వాచార్యులు **"భరతేన తదాऽనఘః, శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః ప్రీతిపురస్కృతః"** (అపుడు, ఏపాపం లేనివాడు, నిత్యం శత్రువులను జయించిన వాడైన శత్రుఘ్నుడు భరతునిచే ప్రీతిపూర్వకంగా తనతో తీసికొని పోబడ్డాడు) అనే శ్రీరామాయణ శ్లోకాన్ని ప్రమాణీకరించి, వ్యాఖ్యానించడం ద్వారా నిరూపించిన విషయం గమనార్హం.